శ్రీరస్తు.

# అనంతుని ఛందము

అను నామాంతరముగల

# ఛందోదర్పణము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచే

ప్రకటితము.

1921

# వి ష య సూ చి క.


| విషయము. | పుట. |
|---|---|
| ఉపోద్ఘాతము. | ... |
| **ప్రథమాశ్వాసము.** | |
| ఇష్టదేవతాస్తుతి | 1 |
| సంజ్ఞాప్రకరణము | ,, |
| గద్యపద్యలక్షణము | 2 |
| గురులఘునిర్ణయము | 3 |
| గణాష్టకలక్షణము | 3 |
| ఇంద్రచంద్రాదిగణభేదములు | 5 |
| సంయుక్తవర్ణగణంబులు | 6 |
| గణఫలములు | ౬ |
| గణాధిదైవతములు | 6 |
| కృత్యాదివర్జనీయగణములు, నక్షత్రములును | 6 |
| ప్రాసప్రకరణము | 7 |
| ద్వాదశవిధప్రాసములు | 8 |
| షడ్విధప్రాసములు | 15 |
| యతిప్రకరణము | 17 |

| విషయము. | పుట. |
|---|---|
| **ద్వితీయాశ్వాసము.** | |
| గద్యలక్షణము | 28 |
| ఛందములు | 29 |
| ఛందోవృత్తసంఖ్య | 30 |
| సర్వసమవృత్తభేదసంఖ్య | 31 |
| సమవృత్తములు | 31 |
| అర్ధసమవృత్తములు | 58 |
| విషమవృత్తములు | 59 |
| ఉద్ధురమాలావృత్తములు | 61 |
| **తృతీయాశ్వాసము.** | |
| కందములు | 65 |
| ఆర్యలు | 66 |
| గీతులు | 67 |
| సమవిషమగీతులు | 68 |
| సీసములు | 69 |
| తరువోజ | 76 |

| విషయము. | పుట. | విషయము. | పు |
|---|---|---|---|
| అక్కరలు | 77 | సమాసములు | 1[illegible] |
| పదములు | 78 | కారకశబ్దములు | 1[illegible] |
| రగడలు | 80 | క్రియాపదములు | 1[illegible] |
| చాటుప్రబంధములు | 83 | అవ్యయశబ్దములు | 1[illegible] |
| షట్ప్రత్యయములు | 85 | విశేష్యవిశేషణములు | 1[illegible] |
| చతుర్థాశ్వాసము. | | క్రియావిశేషణములు | 1[illegible] |
| దశదోషములు | 89 | పంచాశద్వర్ణములు | 1[illegible] |
| షట్సంధులు | 97 | షడ్వర్గములు | 1[illegible] |

# ఉపోద్ఘాతము.

---

## అనంతామాత్యుఁడు.

అనంతామాత్యుని చరిత్ర - విమర్శకులకు తెలిసినంత మట్టుకు-ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములోను, ఆంధ్రకవుల చరిత్రలోను ఉన్నది. చర్వితచర్వణముగా అందులోని విషయములనే మరియొకసారి చర్చించి వ్రాయుట మనవసరము; గనుక వాటిలోని సారాంశములను మాత్రము సంగ్రహించి తెలియజేయుచున్నాను.

అనంతుఁడు ఆరువేల నియోగి బ్రాహ్మణుడు; కౌండిన్యగోత్రజుడు. ఇతనిముత్తాతయైన బయ్యన్నకు తిక్కనసోమయాజి "భవ్యభారవి" అన్నబిరుదిచ్చెనట. అనంతుఁడు రచించిన గ్రంథములు 1. భోజరాజీయము, 2. ఛందోదర్పణము, 3. రసార్ణవము. భోజరాజీయములో ఉన్న "సీ. విలసితంబగుకృష్ణవేణా," అనే పద్యమునుబట్టి అనంతుని "తండ్రియైన తిక్కన కృష్ణామండలములోని శ్రీకాకుళమున కొండయుఁడైన యంధ్రవల్లభుని సేవ చేయుచుండె"ననిన్ని, రసార్ణవమందున్న "శా. జానొందన్ శకవర్షముల్" అనేపద్యముబట్టి ఇతడు క్రీ. శ. 1435. జనవరి తే 25 దికి రసార్ణవము రచియించి దేవాంకితము చేసినట్లు తెలియవచ్చుచున్నది గనుక, ఇతడు 15-వ శతాబ్దము నడుమ నున్న వాడనిన్ని నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఛందోదర్పణములో నాలుగవ ఆశ్వాసము చివర నొక పద్యమందు భోజరాజీయమును మాత్రమే పేర్కొనుటచేత అనంతుడు మొట్టమొదట భోజరాజీయము, తర్వాత ఛందోదర్పణము, అటుపిమ్మట రసార్ణవము రచించిఉండునని ఊహించవచ్చును.

## గ్రంథవిశేషము.

తెలుగున లక్షణగ్రంథము లనేకముగా ఉన్నవి. వీటిలో అనేకగ్రంథము లింకను అచ్చుపడలేదు. 1917 సం॥న కవిజనాశ్రయము ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే క్రొత్తగా ప్రకటితమైనది. నేటికి శ్రీ వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే ఈ ఛందోదర్పణము ప్రకటితమైనది. రంగరాట్ఛందము మొదలుగు న గ్రంథములు వీరిచే త్వరలో అచ్చుపడవలసి ఉన్నవి. ఇదివరకు చాలాకాలమయి అచ్చుపడి ప్రచారములో ఉన్నవి సులక్షణసారము, అప్పకవీయము.

వీటిలో కవిజనాశ్రయము ప్రాచీనతమమయి నట్లగపడుచున్నదనిన్ని, ఆగ్రంథము రచించినవాడు వేములవాడ భీమకవి అనిన్ని, ఆ భీమకవి 12-వ శతాబ్దారంభము వాడగుననిన్ని, శ్రీ జయంతిరామయ్యగారు కవిజనాశ్రయపీఠికలో వ్రాసినారు. "కవిజనాశ్రయము భీమకవివిరచితముకానేకాదని నాకుతోఁచుచున్న" దని వీరేశలింగము పంతులుగారు రామయ్యపంతులుగారి 'పీఠిక' చదివినతర్వాతనే *ఆంధ్రకవులచరిత్రలో వ్రాసినారు. "కవిజనాశ్రయములో చెప్పఁబడిన యతులసంఖ్య యన్నింటికంటెఁదక్కువది,

---

* 1917-పుట 362, ఆంధ్రకవులచరిత్ర, రెండవకూర్పు.

కావున,నా గ్రంథమె యన్నింటిలోఁ బ్రాచీనమైనదని యూహింప వచ్చును" అని రామయ్యపంతులుగారు 'అంతరతమ్య' పరీక్ష చేసి సిద్ధాంతీకరించినారు. అయితే అప్పకవి ఏడువిధములైన సీసభేద ములే చెప్పగా అనంతుఁడు పదివిధములైన సీసభేదములను చెప్పినా డుగదా. అంతమాత్రమున అనంతుఁడు అప్పకవి తర్వాతివాడని చెప్పవచ్చునా ?

,శ్రీ రామయ్యపంతులుగారు సంపాదించిన కవిజనాశ్రయ ప్రతులు 10. అందులో రెండుమాత్రమే సమగ్రముగాఉన్నవి. ఆ రెండింటిలోను అవతారిక పద్యములులేవు ; అసమగ్రమైన ఒక్క ప్రతియందు మాత్రమే ఉన్నవి. వాటిలో ఒకపద్యమునుబట్టి గ్రంథము భీమకవిరచించియుండునేమో అని అనుమానించుటకు కాస్తఅవకాశము లేకపోలేదు, గాని అన్ని ప్రతులలోను ఉన్నట్లు చూపిన * "జననుత భీమతనూజా," అనే పద్యమును బట్టి ఏమనవలెను ? ఇంతకున్ను ఒక్క ప్రతిలో మాత్రమే ఉన్న అవతారిక ఎంతమట్టుకు ప్రమాణముగా గ్రహింపగలము ? అం దులోనున్న పద్యములు పరిశీలించిచూడగా అసందర్భములుగా ఉన్నవి. మొట్టమొదటిపద్యము అనంతునిఛందములోనిది.— "ననంతశయనుఁ డోయజనాభుఁ," అని ఛందోదర్పణములో ఉన్నది. "మురారిభక్తితో వినుతింతుఁ," అని కవిజనాశ్రయము లోఉన్నది. "జైనుఁడగుకవి విష్ణుప్రతిపాదకములగు పద్యముల రచించుట యసంభవ" మని "చనుమగణము శ్రీనాథాయనిన"

* సంజ్ఞా-88.

"తగణము శ్రీకృష్ణయనఁగ" ఇటువంటి పద్యములు ప్రక్షిప్తములని వ్రాసినప్పుడు "మురారిభక్తితో వినుతింతుర," అని ఉన్న అవతారికలోని మొదటిపద్యము ప్రక్షిప్తమనిచెప్పవలసిఉండును. గణముల కుదాహరణగా విష్ణుపరమైన పదములే ఉండనప్పుడు "మురారిభక్తితో వినుతింతుర" అని ఉండునా? "నిను నీవె పొగడువైఖరి నొనరించెదఁ," అని కృతిభర్తనుగూర్చి కవి వ్రాయునా? కవితావైఖరిని బట్టిచూడగా ఈ అవతారిక ప్రక్షిప్తమని దృఢముగాచెప్పవచ్చును. "రేచనపై...కవివరులు...పొగడర" "నీదుపేర" "ఛందము సుకవులుబ్రదుకు" ఇటువంటి పదముల తోనున్న కవిత్వము ఆధునిక కవిత్వముగాని పూర్వకవిత్వము వలెతోచదు.

కొన్ని వ్రాతప్రతులలో "భీమనఛందస్సు" అని గ్రంథనామమున్నది. అయితే వాటిలో రామయ్యాపంతులుగారు "ప్రక్షిప్తము"లని తీసివేసినపద్యము లనేకముగ ఉన్నవి. "పరగిననిమల యశోభాసురనిరతుఁడు భీమనాగ్రసుతుఁ * డఖిలకళాపరిణతుఁడ

---

*ఈ భీమనాగ్రసుతుఁడు 'అగస్త్యభ్రాత' లాటివాడు; ఎవరో తెలియదు. "భీమనఛందస్సన్న" పేరుగలిగి మనకు కనబడుచున్న వ్రాతప్రతులలోని గ్రంథము రచించినవాడు భీమనాగ్రసుతుడు; గాని, భీమనకాడు. వ్రాతప్రతులన్నిటిలోను భీమనఛందస్సు కలగూరగంపగా ఉన్నది. తక్కిన ఛందోగ్రంథములలోని లక్షణములున్ను ఉత్తరాంధ్రకావ్యములలోని లక్ష్యములున్ను ఉన్నవి. కొన్నిటిలో భీమనమతము స్పష్టముగా నిరాకృతమయి ఉన్నది. ఈ భీమనాగ్రసుతుడో, ఆపేరిటివాడు వేరేమరియొకడో, 'సర్వలక్షణసార' మను గ్రంథము రచించినట్టు తంజావూరి సరస్వతీమహాల్ పుస్తకాలయములో 327_వ నెంబరుగల వ్రాతప్రతినిబట్టి కనబడుచున్నది. అం

య్యెను భూసురవరుఁడు ప్రసాదోదితర్ధుని శ్రీయుతుఁడై", "అస
మానదాన రవితనయ సమానోన్నతుఁడు యాచకాభరణుఁడు

---

దులో "పరగిన విమలయశోభాసురచరితుఁడ భీమనాగ్రసుతుఁడ" అనిగ్రం
థకర్త వ్రాసుకొన్న పద్యమున్ను ఇంకా 'భీమనఛందస్సు'లో ఉన్నట్లే
అనేక పద్యములున్ను ఉన్నవి. 17-వ శతాబ్దారంభమునాటి మల్లన రచించిన
చంద్రభానుచరిత్రలోని పద్యమున్ను ఇంకామరికొన్ని కావ్యములలోని పద్య
ములున్ను ఉదాహృతమై ఉన్నవి. దీనినిబట్టి చూడగా భీమన 16-వ శతా
బ్దాంతమునాటి వాడుకావలెను. కళింగదేశము రాజయిన రాజరాజు 11-వ
శతాబ్దము వాఁడుగదా; ఈ భీమన ఆరాజరాజును తనకవితామహిమచేత
గద్దెమీదనుండి పడద్రోసి తిరిగీగద్దెక్కించడము ఎట్లు సంభవమగును? ఈ
కవితామహిమానువర్ణనముగల రెండుచాటుపద్యములు మాత్రమే ఆధార
ముగాచేసుకొని భీమన రాజరాజనాటివాడనిన్ని భీమన ఛందస్సు ప్రాచీన
తమమయినదనిన్ని చెప్పుటకు శ్రీరామయ్యపంతులుగారు సాహసించడము
వింతగా ఉన్నది. కవిజనాశ్రయములోనివి కావని తమకు తోచినవి
ప్రక్షిప్తములని చెప్పికొన్ని, చెప్పకకొన్ని, గాలించి తీసివేసి, కొంతభాగ
తమకు తోచినట్లుమార్చి, భీమన ఛందస్సులోమిగిలి ఉన్నపద్యాలు 'అసలు'
కవిజనాశ్రయమని పంతులుగారు ప్రకటించినారు. ఇది ఆంధ్రసారస్వత
మునకు కొంత ఉపచరించినదని కృతజ్ఞతతో ఒప్పుకుంటూ, ఈ గ్రంథము
మరికొన్ని ప్రతులసాయమున చక్కగా విమర్శించి సంప్రతించి అచ్చొ
త్తించుట అగత్యమని తెలియజేయుచున్నాను.

పంతులుగారి పరిష్కరణములోని దోషములు రెండువిధము లయి
నవి. i. గ్రంథములో చేరకూడని పద్యములు చేర్చినారు. ఉదా. 1. సం
జ్ఞా. 90, 91, 92 ఇవి కావ్యాలంకారచూడామణియందున్న పద్యములు
"ప్రక్షిప్తము లైనవేమోయని సంశయింపఁదగియున్న" దని కిందను వ్రాస్తూ
గ్రంథమున చేర్చినారు. 2. ఉత్సాహగఁడచ్ఛందములోనిది, "సభలంజెప్పిన"

ప్రాణసమానమిత్త్రుఁడీకృతికి సహాయుఁడుగా నుదాత్తకీర్తి శ్రీలన్."
ఈపద్యము లనన్వయముగా నుండుటచేత నందుఁ జేర్కొనఁబడిన భీమునకును గ్రంథమునకును గల సంబంధ మిట్టిదని నిర్ణయింప వలనుగాకయున్నది" అని శ్రీరామయ్యపంతులుగారు గ్రంథమున చేర్చలేదు. "పై పద్యము లనన్వితములుగావు. గ్రంథమునఁ గూర్చుకొని చూచినచోఁ దేటపడఁగలదు. పాఠము తప్పుగానున్నప్పుడు సమన్వయమెట్లేర్పడును?" అని శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రబంధరత్నావళి పీఠికలో ఈవిషయము చర్చించి వ్రాసినారు. భీమకవి కవిజనాశ్రయకర్త కానేరడనియే వారితలంపు. వారుచెప్పినట్లు "వేములవాడ భీమకవి విషయము సర్వమును సందిగ్ధమే యగుచున్నది."

ఛందోదర్పణకాలమును నిర్ణయించగలిగినట్లు కవిజనాశ్రయకాలమును నిర్ణయించలే మనుట స్పష్టము. అనంతుఁడు భీమకవినిగాని కవిజనాశ్రయమునుగాని ఎరిగిఉన్నట్లు కనబడదు.

అనంతుని ఛందోదర్పణమును ఎదుటనుంచుకొని అప్పకవి కొన్నివృత్తములకు లక్ష్యములు వ్రాసినట్లు స్పష్టముగా కనిపించుచున్నది. మదరేఖ, తోదక, మనోజ్ఞ, ప్రియకాంత, నర్కుటము,

---

అనేపద్యము (46). ఇందులోని విషయములు పూర్వపద్యములలోని (88, 89) విషయములకు విరుద్ధముగా ఉన్నవి. 8. అవతారిక పద్యములు. 4. అనంతచ్ఛందములోని పద్యములు; ii గ్రంథములో చేరవలసినవి విడిచినారు: ఉదా. విశ్రాంతివిరతి అనేకందమునకు బదులుగా "రేచనకీర్తిగలుగు" అనే మాటలుగల గీతపద్యము చేర్చవలసియుండెను. ఇంకా ఇటువంటివి ఉన్నవి.

శిఖరిణి, పృథ్వి మొదలయిన వృత్తలక్ష్యపద్యములు అనంతుని పద్యములలోని పదములతో కనబడుచున్నవి. వీటిలో ఒక్కటి చూడండి:—

అజశివ శక్రనిరంత♦రార్చిత పద్మ్వయుఁ
భుజగకులాధిప తల్పుఁ♦బూని నుతింపగా
నజయతినొంది నజాభ♦రార్చితమైచనుఁ
బుజువగు నుర్విమనోజ్ఞ ♦ బుమ్యనురాగమై.

అనంతునిది.

అజమృడవాసవసంత ♦ తార్చితపాదపం
కజయుగళుఁ హరినిర్వి♦కారు మనోజ్ఞనా
ఋజువగు వృత్తమునందు ♦ బ్రీతినుతింపగా
నజజభరంబులు వొల్చు♦నచ్చిన దిగ్యతిఁ

అప్పకవిది.

ఈలాగున అనంతుడు కవిజనాశ్రయము ఎదుట నుంచుకొని తన ఛందోదర్పణమును వ్రాసియుండునేమో అని ఎంతపరిశీలించి చూచినను పద్యములలో పోలిక ఎక్కడనయినను కనబడ లేదు.

కవిజనాశ్రయముకంటె ఛందోదర్పణము పెద్దగ్రంథము. కవిజనాశ్రయములో సంజ్ఞాధికారమందు గణఫలములు, గణగోత్రములు, గణలింగములు, బీజాక్షరములు మొదలయిన విషయముల గురించి 35 పద్యము లున్నవి. ఛందోదర్పణములో వీటిలో ముఖ్యమైన విషయములగురించి 6 పద్యములు మాత్రమే ఉన్నవి. గాని వళ్లు, ప్రాసములు, షట్ప్రత్యయములు...వీటిగు

రించి ఛందోదర్పణములో ఉన్నన్నివిషయములు కవిజనాశ్రయములో లేవు.

1 "క. పరగగనిరువదియాఱు...." ఛందో. పుట 61; కవి. పు. 52.
2 "క. క్రమమునఁ బ్రస్తారము...." ఛం. పు. 85; కవి. పు. 76.
3 "సీ. వృత్తంబునకువలె..." ఛం. పు. 69; కవి. పు. 67.

ఈ మూఁడుపద్యములు రెండుగ్రంథములందున్ను కనబడుచున్నవి. వీటిలో మొదటివి రెండున్ను ఎవరుచెప్పినవో ఏగ్రంథములో ఇవి ప్రక్షిప్తములనవలెనో తెలియదు. మూఁడవది ఛందోదర్పణములోనిదేగాని కవిజనాశ్రయములోనిదికాదని మరియొకచోట నీపీఠికలోనే తెలియజేసినాను.

అనంతుఁడు 105 సమవృత్తభేదములను 9 విషమవృత్తభేదములను చూపించినాఁడు. కవిజనాశ్రయములో 123 సమవృత్తభేదములున్ను 6 విషమవృత్తభేదములున్ను ఉన్నవి.

జాత్యుపజాతులగురించి ఛందోదర్పణములో చెప్పినంత గ్రంథము కవిజనాశ్రయములో లేదు. రగడలు, కళికలు, ఉత్కళికలు వీటినిగుఱించి కవిజనాశ్రయకర్త ఏమిన్ని చెప్పలేదు.

లక్షణగ్రంథములన్నిటిలోను ఛందోవిషయములు ఎక్కువగా వివరించి చెప్పినది అప్పకవీయమే అనుటకు సందేహము లేదు. అందుచేతనే, అప్పకవి,

"క. ఒకదానికంటె మఱివే,
ఱొకటి విశేషంబుఁ జెప్పుచుండుఁ గతమునన్
సకల గ్రంథములను జదు,
వక దెలియునె లక్షణప్రపంచంబెల్లన్.

క. ఇది చదివినపిమ్మట మఱి,
యెదియేనియుఁ జదువుబుద్ధియేలావొడమున్
బదఁపడి గ్రంథములన్నియు,
వెదకివెదకి సారమెల్ల వివరింపంగన్. ''

అని వ్రాసుకొన్నాడు. అయితే నిరంకుశాధికారమును వహించిన వానివలె తన ఇష్టానిష్టములఁబట్టి లక్షణములను అతడు శాసించినాడు. శ్రీ వావిళ్లవారు ఇప్పుడు త్వరలో అచ్చొ... ...గచ బోయే అప్పకవీయ పీఠికలో అవి తెలియు జేయుట ఉండును; గాని, ఇక్కడ చర్చించుట అనవసరము.

## —= గ్రంథప్రచారము. =—

"క్రీ. శ. 1620-వ సంవత్సరప్రాంతములందు కవిగాఁ బ్రసిద్ధికెక్కినవాఁడు" అని వీరేశలింగము పంతులుగారు చెప్పిన చిత్రకవి అనంతయు "హరిశ్చంద్ర నలోపాఖ్యాన ప్రకాశికలో" (V. 8.) "క. ప్రథమాంతవిభక్తులపై ..." అనే—ఛందోదర్పణములోని—పద్యమును ఉదాహరించినాడు. ఈ పద్యమునే 16-వశతాబ్దాంతమునఉండిన వాడని వీరేశలింగముపంతులుగారు చెప్పిన ముద్దరాజు రామన్న "రాఘవపాండవీయాదర్శము" లో (I. 2, iii. 65) రెండుచోట్ల ఉదాహరించినాడు. అంతేకాదు "పోణిమి" అని ణకారముగా చెప్పవచ్చుననుటకు, "తీవ తీఁగ యనుచు..." అనేపద్యము అనంతుని ఛందమందున్నట్లు ముద్ద రాజు రామన "రాఘవపాండవీయాదర్శము"లో (II.6) చెప్పినాడు; గాని, ఆపద్యము ఛందోదర్పణములో కనబడదు. ఈపద్యము ఎవ

రిదో తెలియదు. "ఇంబు" అనే ప్రయోగమునకు ఆ ఆదర్శములోనే (2. 98) "ఇంబడరగా భజసనంబులని యనంతుని ఛందః ప్రయోగము" అని కూడా ఉన్నది. ఇది అప్పకవీయములో లయగ్రాహికి లక్ష్యలక్షణపద్యముగా కనిపించుచున్నది; గాని ఛందోదర్పణములో కానరాదు. అయితే అప్పకవి "పదునేడవశతాబ్దమధ్యమునందుండిన లక్షణవేత్త" అని వీరేశలింగముపంతులుగారు వ్రాసినారు గదా; అప్పకవి పద్యమును ముద్దరాజురామన ఎట్లుదాహరించియుండును? ఇంతకంటెను ఆశ్చర్యమైన దేమంటే, చిత్రకవి అనంతయగారి హారిశ్చంద్రనలోపాఖ్యాన ప్రకాశికలో ద్వితీయాశ్వాసాంతమున (శ్రీనరఘుల చినసీతారామస్వామిశాస్త్రులవారివిమర్శనముతోకలిసి శ్రీ వావిళ్లవారిచే ప్రకటితమైన ప్రతి, పుట. 128) నర్కుటవృత్తవ్యాఖ్యలో "ఈవృత్తమునకే కోకిలకాకమను నామాంతరము కలదు. లక్షణము:—కొలిచెదనాదిదేవు....(అప్పకవీయము. ఆ. ర)" అని ఉన్నది. ఈ గ్రంథము మొదట అచ్చొత్తించిన పూండ్లరామకృష్ణయ్యగారో పూర్వలేఖకులో అప్పకవీయ పద్యములను ఈ వ్యాఖ్యానములలో దూర్చి ఉండవలెను. నేనుచూచిన తాటాకుపుస్తకములందు ఇవి కానరాలేదు.

## పాఠనిర్ణయము.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరులుగారు తమవద్దనున్న 14 ప్రతులుశోధించి పాఠనిర్ణయముచేసి గ్రంథ మచ్చొత్తించినారు. వారు నావద్దకుపంపినముద్రితగ్రంథమును, నావద్దనున్న శ్రీపరవస్తువారి ప్రతిని, పరిశీలించి ఈ ఉపోద్ఘాతమును టిప్పణిని వ్రాసినాను.

## ఛందోవిషయములు.

ముఖ్యమైన ఛందోవిషయములు ఈ చిన్న పీఠికలో ఇపుడు ద్పుటకు వీలయినంత వఱకు చర్చించి లాక్షణికులలో గల మత భేదములను తెలియజేయుచున్నాను.

### వ డి.

"యతి పర్యాయపదములలో వడియనునది తెలుఁగు; దాని వ్యుత్పత్తియూహ్యము" అని జయంతి రామయ్యపంతులుగారు కవి జనాశ్రయపీఠికలో వ్రాసినారు. వారు వ్రాసినట్లు 'వడి' 'వళి' అనేవి తెలుగుమాటలనిన్ని వ౯ అనే అఱవమాటతో సంబంధము కలవి అనిన్నీ నాఅభిప్రాయము. యతి, విరతిమొదలయిన పర్యాయపద ములతో పాటు వడి(వళి)అనేమాటను లాక్షణికులు వ్యవహరించు చున్నను దీనికి ఒక అర్థవిశేష మున్నట్లు స్పష్టముగా కనిపించు చున్నది. "ఆద్యోవళిః" అనే ఆంధ్రశబ్దచింతామణి సూత్రము లోను, అందుకు అనువాదముగా ఉన్న తెలుగు లక్షణగ్రంథము లలోని పద్యములందున్ను 'వడి, (వళి)' అనే ఉన్నదిగాని 'యతి, విరతి' మొదలైన పర్యాయపదములలో మరియేదీ కనబడదు. చూడండి.

1. "చరణాద్యక్షరమేవడి" కవిజనాశ్రయము.
2. "పాదప్రథమాక్షరముత్పాదితమగు వళియనంగ" కావ్యాలంకారచూడామణి.
3. "వాసనగలమొదలివ్రాయి వడియనఁబరగుఁ" ఛందోదర్పణము.

4. "చరణచరణమున కాద్యక్షరములు ! వళులయ్యె"
అప్పకవీయము.

ఈసందర్భమున వడి (వళి) కి బదులుగా యతి, విరతి మొదలయిన పర్యాయపదములలో మరియేదిన్నీ వాడకూడదన్న ట్లే తోచును. సంస్కృతశ్లోకములలో పాదములమధ్యమందు విశ్రాంతిమాత్రమే ఉంటుందిగాని తెలుగు పద్యములలోఉన్నట్లు అక్షరమైత్రి లేదు. గనుకనే కాబోలు వడి (వళి) యను తెలుగుమాట తెలుగుఛందస్సులలో వాడవలసివచ్చినది. వళి అంటే మార్గమని అర్థము. పద్యపాదము విశ్రాంతిననుసరించి రెండుభాగములు కాగా ఆభాగముల మొదటి అక్షరములు పాదభాగములకుమార్గములు చూపించిన ట్లుండుటచేతను, మొదటిభాగముయొక్క ప్రథమాక్షరముతో (అనగా పాదాద్యక్షరముతో) రెండవభాగము మొదటి అక్షరము మైత్రిగలదిగా ఉండవలెనన్న నియమము ఆచారమై ఉన్నది గనుకను, వడి (వళి) అని మీదచూపించిన స్థలములలో లాక్షణికులు ప్రయోగించి ఉందురని నా అభిప్రాయము.

## వడిభేదములు.

కవిజనాశ్రయములో పదివిధములైన వళ్లుమాత్రమే ఉన్నవి. కావ్యాలంకారచూడామణిలో పండ్రెండున్ను, ఛందోదర్పణములో ఇరువైనాలుగున్ను, అప్పకవీయములో నలువదిఒకటిన్ని, వళిభేదములు కనిపించుచున్నవి. ఈలాగున వళ్లసంఖ్య ఎక్కువతక్కువగా ఉండుటకు కారణ మేమై ఉండును? తక్కువగా

వళ్లుపేర్కొన్నవారికి పరిశీలన లోపముకలిగినదా? లేక, ఎక్కువగా చెప్పినవారు అనవసరముగా వళ్లసంఖ్య అధికముచేసినారా? లేక, కవులు స్వతంత్రించి క్రొత్తక్రొత్త ప్రయోగములుచేసి ఉండుటచేత తర్వాతి లాక్షణికులు వళ్లసంఖ్య ఎక్కువచేయువలసి వచ్చినదా? ఈవిషయములు చక్కగా విమర్శించవలసి ఉన్నది గనుక కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, అప్పకవీయము— ఈనాలుగింటిలో ఉన్న వళ్లభేదములు ఒకపట్టికలో చూపించి విమర్శించుచున్నాను:—

| కవిజనాశ్రయము-10 | కావ్యాలంకారచూడామణి-12 | ఛందోదర్పణము-24 | అప్పకవీయము-41 |
|---|---|---|---|
| 1. స్వరయతులు | 1 స్వరజలు | 1 స్వరయతులు | 1 స్వరమైత్రి |
| | | | 2 స్వర ప్రధానయతి |
| | 2 వృద్ధివళులు | 2 గూఢస్వరయతి | 3 లుప్తవిసర్గయతి |
| | | | 4 వృద్ధివళులు |
| | | 3 ఋకారస్వరూపయతి | 5 ఋవళి |
| | | 4 రీవిరమము | 6 ఋత్వసంబంధవళి |
| | | | 7 ఋత్వసామ్యయతి |
| వ్యంజనయతులు. | | 5 ఇకారవిరతి | |
| 2 వర్గయతులు | 3 వర్గజలు | 6 వర్గయతి | 8 ప్రాణివిరామము |
| | | | 9 వర్గయతులు |
| 3 పోలికవడి | 4 ముకారవళి | 7 పోలికవడి | 10 మువిభక్తి |
| | | | 11 ముకారయతులు |
| 4 సరసయతి | 5 ఇతరేతరవర్గజలు | 8 సరసయతి | 12 సరసవళులు |
| | | | 13 ఋజుయతులు |
| | | | 14 ఊష్మయతులు |

| | | | |
|---|---|---|---|
| 5 బిందుయతి | 6 సబిందువర్గజలు | 9 అనుస్వారయతి | 15 బిందుయతులు |
| | | | 16 అనుస్వారసంబంధయతులు |
| | | | 17 అనునాసికాక్షరయతులు |
| | | 10 మకారయతి | 18 మవర్ణయతులు |
| 6 ఎక్కటియతి యుక్తాక్షరయతి | 7 ఏకతరయతి | 11 ఎక్కటియతి | 19 ఏకతరయతులు |
| | | 12 సంయుక్తయతి | 20 సంయుక్తయతి |
| | | 13 తద్భవవ్యాజయతి | 21 తద్భవవ్యాజయతి |
| | | | 22 విశేషవళి |
| | | 14 భిన్నయతి | 23 భిన్నయతి |
| | | 15 ది యతి | 24 ప్రత్యేకయతులు |
| | | 16 వికల్పయతి | 25 అంత్యోష్మసంధియతి |
| | | 17 యుక్తవికల్పయతి | 26 వికల్పసంధియతి |
| | | | 27 అభేదవిరతులు |
| | | 18 అభేదవిరతి | 28 అభేదవర్గవిరతులు |
| | | 18 రేఫయుతయతి | |

| | | | |
|---|---|---|---|
| ఉభయవళులు:— | | | |
| 8 ప్రాదియతులు | 8 ప్రాదియతులు | 19 ప్రాదియతులు | 29 ప్రాదియతులు |
| | 9 ద్వ్యక్షరత్ర్యక్షరప్లుతాక్షరవళి | 20 కాకుస్వరయతి | 30 కాకుస్వరయతి } 31 ప్లుతాక్షరయతి |
| 9 ప్లుతయతులు | | | |
| 10 అఖండ | 10 ఆదేశవళి } 11 దేశీయావళి | 21 నిత్యసమాస యతులు | 32 నిత్యసమాసయతులు } 33 దేశ్యనిత్య సమాన యతులు |
| | 12 (మూచన) (జివరాలు) | 22 ప్రభునామాంతర యతులు | 34 నామక ఖండ యతులు |
| | | | 35 రాగమయతులు |
| | | 23 విభాగయతులు | 36 విభాగయతులు |
| | | 24 నిత్యయతులు | 37 నిత్యయతులు |
| | | | 38 యుష్మదస్మచ్ఛబ్ద యతులు |
| | | | 39 పరరూపయతులు |
| | | | 40 పంచమీవిభక్తి య |
| | | | 41 ప్రాసవిశ్రాంతి [తులు |

వర్ణభేదములన్నీ సమాకలనముచేసి ఈదిగువవగు ర్తులుంచి తెలుపుచున్నాను.

1. అ=ఐ=ఔ (=మైత్రికిగురుతు; హ్రస్వస్వరముబట్టి దీర్ఘస్వరముకూడా ఉన్న ట్లే ఊహించవలెను.)

2. ఇ=ఎ, ర్ (ఇ,ఎ) } =ఋ=కౄ=వౄ (ఋకార మే వ్యంజనముపై ఉన్నా విడిగాఉన్న స్వరమువలె పాటించవచ్చును)

3. ఌ=ల్, ళ్ (ఇ, ఎ). (ఇ ఈ ఎ ఏ లం గూడిన లళలే అని అర్థము)

4. ఉ=ఒ

5. ≷క్; (ఁ.వర్గులకు ఇట్లే); (≷అనునాసికము కాక తక్కిన వర్గాక్షరములు నాలుగున్న అని తెలియజేసేగురుతు. ఆనాలుగున్న అన్యోన్యమైత్రిగలవి అని అర్థము.

6. ≷చ్=శ్=ష్=స్

7. ≷ంక్=జ్

8. ≷ంచ్=ఞ్

9. ≷ంత్=≷ంట్=న్=ణ్

10. ≷ంప్=≷ంయ్=మ్ (≷య్ అంటే యరలవశషసహలు 8న్ని)

11. ≷ప్ (ఉ, ఒ)=మ్ (ఉ, ఒ)

12. క్ష్=ష్

13. జ్ఞ్ } =న్ / =క్ష

14. ల్ ళ్=డ్

15. హయలకు స్వరమైత్రి } వ్యంజనము పాటించకుండా హకార యకారముల పైని ఉన్న స్వరములకు ప్రత్యేకించి వడి చెప్పవచ్చును.

16. గూఢస్వరవ్యంజనములు వడికోసము పాటింపవచ్చును.
ఉ. దాసోఽహం 'అన్యోన్య'లో 'అ'; 'వనౌకస'లో 'ఓ'
'జగజ్జనకుడు' లో 'త్'; 'వాగ్ఘరి'లో 'హా'

17. 'సంయుక్తవ్యంజనములలో' ఏవ్యంజనమునకు వడి ఉంచినా చాలును; గాని పాదమున మూడునాలుగు చోట్లవడికావలసిన వృత్తములలో స్రగ్ధరాది వృత్తములలో సర్వత్ర ఏదో ఒకవ్యంజనమునేపాటించవలెను.

18. ఉభయవళులు-అఖండవడి—(వీటిని గురించి ప్రత్యేకముగా చర్చచేయవలసినది.)

19. ప్రాసవడి.

పైని ఉదాహరించినవాటిలో 1,4, 5, 6, 7, 8, 11, 15, 17 సర్వలాక్షణిక సమ్మతములు.

2-వ దానిలో ఇ ఈ ఎ ఏ ఋ ౠలకు మైత్రిమాత్రమే

కవిజనాశ్రయములోను కావ్యాలంకారచూడామణిలో ఉన్నవి; తక్కిన విషయములు మూడున్ను అనంతుడున్ను అప్పకవిన్ని చెప్పినారు. అయితే అప్పకవిచెప్పినట్లు మూడున్ను మూడుభేదములుగాచెప్పక అనంతుడు రెండుభేదములుగానే చెప్పినాడు.

3-వది అనంతుడు మాత్రమే చెప్పినాడు; తక్కినలాక్షణికులు దీనినిగురించి ఏమీ చెప్పినట్లు కనబడదు. ఋవళినిబట్టి ఌవళి ఒప్పుకోవలసినదే.

9-వ దానిలో ≤ంత్=న్; ≤ంట్=ణ్; అని బిందుయతులకిందను; న్=ణ్ అని సరసయతులకిందను, అందరున్ను చెప్పినారు. ఇవికాక, ≤ంత్=ణ్; ≤ంట్=న్; ≤ంత్=≤ంట్ వేరే భేదములుగా అప్పకవి చెప్పినాడు; గాని అనవసరము; బిందుసరసయతులబట్టి ఇవి సాధించవచ్చును.

10-వ దానిలో ≤ంప=మ అని మాత్రమే బిందుయతికింద అందరును చెప్పినారు. ≤ంయు=మ అనేము కారయతి అనంతుడు, అప్పకవి చెప్పినారు; విన్నకోటపెద్దన చెప్పలేదు. అప్పకవీయములో ఈవళికి లక్ష్యముగా భీమన చాటుపద్యము (చ. గరళపు...) ఉన్నది. ఈభీమనే కవిజనాశ్రయకర్త అయితే ఈవళి భేదము తన లక్షణగ్రంథములో ఎందుకు పేర్కొలేదో !

12-వ దానిగురించి భారతములో ప్రయోగములున్నా కవిజనాశ్రయములోగాని కావ్యాలంకారచూడామణిలోగాని ఏమీ చెప్పలేదు. అనంతుడు వపలకుమాత్రమే మైత్రి చెప్పి దీనికి 'అభేదవిరతి' అని పేరుపెట్టినాడు. వబలకు అభేదమున్నదిగాని వపలకు లేదుగదా? గనుక, ఈపేరువీటికి సార్థకముకాలేదు. అప్పకవి

అందుచేతనే వబలకు అభేదవిరతి అనిన్ని ఙపవలకు అభేదవర్గయతులనిన్ని పేర్లుపెట్టినాడు. అయితే, రెండవదానిలో మొదటిది కూడా ఇమిడి ఉన్నది గనుక ఙపవలమైత్రి (అభేదవర్గయతి) అని ఒక్కటిగాచెప్పితే చాలదా?

13-వ దానిగురించి కవిజనాశ్రయములోగాని కావ్యాలంకారచూడామణిలోగాని ఏమీ కనబడదు. జ్ఞనలకు మాత్రము వడి అనంతుడు చెప్పినాడు. జ్ఞ ఙకలకుకూడా వడిగలదని తిక్కనసోమయాజి ప్రయోగమాధారముగా తీసికొని చెప్పినాడు; గాని సోమయాజి మరియెక్కడను ఇటువంటి ప్రయోగము చేయలేదు. ఈ ప్రయోగమైనా చేసి ఉండడనిన్ని ఇదిసరియైనపాఠముకాదనిన్ని కొందఱి అభిప్రాయము. ఇదిసరియైనపాఠమే అయితే తిక్కనసోమయాజిగారి కాలముననే జ్ఞాకు తాలవ్యోచ్చారణ మారి ఇప్పుడున్నట్టు 'గ్న్య' అని కంఠ్యోచ్చారణ వచ్చినదని ఊహించవలెను. నన్నయ ఈవడి వాడలేదు; మీదచెప్పిన ప్రయోగముకాక పూర్వకవిప్రయోగము మరియొకటి కనబడలేదు; గాని, ఉత్తరాంధ్రకవులు కొందరువాడినారు.

14-వ దానిగురించి స్పష్టముగాచెప్పినవాడు అప్పకవి. స్పష్టముగా లక్షణము చెప్పకపోయినా, అనంతకవి తాను వ్రాసిన పద్యములో ళడలకు మైత్రి పాటించుటచేత అతనికీ మైత్రి ఇష్టమే అని ఊహించవలసిఉన్నది. (చూ. మూ. I. 95) లళకు మైత్రీకలదని ఎక్కటియతి గురించి వ్రాసినపద్యము లో చెప్పినాడు. వీటినిగురించి కవిజనాశ్రయములోను కావ్యాలంకారచూడామణిలోను ఏమీ చెప్పియుండలేదు. లళమైత్రికి ఆదిపర్వమందే ప్రయోగమున్నది.

16-వ దానిలో నాలుగువిషయము లున్నవి. రెండువిధములయిన సంధికార్యములచేత స్వరమున్ను మరిరెండువిధములయిన సంధికార్యములచేత వ్యంజనమున్ను గూఢముగా ఉంటవి. ఈనాలుగు విషయములను నాలుగువిధములైన యతులుగా అప్పకవి పేర్కొన్నాడు: (లుప్తవిసర్గ, వృద్ధి, అంత్యోష్మసంధి, వికల్పసంధి). వీటిలో స్వరసంబంధమైనవి రెండున్ను ఒక్కటిగాచేసి అనంతుడు మూడువిధములయిన యతులు పేర్కొన్నాడు. విన్నకోటపెద్దన వృద్ధిగళులగురించే లక్షణముచెప్పి ఆదేశయతికి లక్ష్యముగా ఇచ్చినపద్యములో లుప్తవిసర్గవళికికూడా సరిపోయినట్లు 'అన్యోన్య' లో గూఢస్వరమునకు 'అ' తో వడి కూర్చినాడు. గూఢముగాఉన్న వ్యంజనముగూర్చి ఏమీ చెప్పలేదు. కవిజనాశ్రయములో వీటిలో ఏదిన్నీ చెప్పియుండలేదు. నన్నయ భారతమందు కాక తక్కిన కొన్ని పూర్వగ్రంథములందు వీటికి లక్ష్యములు చూపించవచ్చును.

18-వ దానిగురించి మతభేదములున్నవి.

సుప్రసిద్ధమైన ప్రయోగములు అనేకముగా ఉండుటచేతను పేరుపొందిన లాక్షణికులలో కొందరినమ్మతికలదు గనుకను అఖండవడి ఒప్పుకోక తప్పదని, "తెలుగు" అనేపత్రికలో సం॥ 9-10 లో నేను వ్రాసిన వ్యాసమును చూడండి.

అఖండవడి ఒప్పుకొన్నతర్వాత ప్రాదిమొదలయిన ఉభయవళులు వేరేపేర్కొనుట అనవసరము. కాకుప్లుతము మొదలయినవాటిలో స్వరము ప్రధానము అని చెప్పితేచాలును. అఖం

డవడి ఒప్పుకోకపోవుటచేత అనంతుడు కొన్ని ఉభయవళి విభాగ ములు ఏర్పర్చుకోవలసివచ్చినది. అతడేర్పరచిన విభాగములలో చేరక కొన్ని అఖండవళ్లు కనిపించడముచేత అప్పకవి మఱికొన్ని విభాగము లేర్పర్చవలసివచ్చినది. 12 విధములయిన ఉభయవళ్లు అప్పకవి పేర్కొన్నా వీటిలో దేనికిందనూ రాని అఖండవళ్లు కనబడుతూనే ఉన్నవి; ఉ. ఏకార్థకవడి; ఇంచుగవడి; చతుర్థీవిభక్తివడి మొదలయినవి.

19-వ ది గీతాద్యుపజాతులలో తప్ప మరియెక్కడను దీని ప్రయోజనములేదు గనుకను, అక్షరమైత్రితో సంబంధము లేదు గనుకను, దీనిని పూర్వలాక్షణికులు యతులలో పేర్కొనలేదు. యతికిబదులుగా వచ్చేదిగనుక ఇదిన్ని ఒక యతిభేదమే అని అప్పకవి పేర్కొన్నాడు.

అనవసరముగా చెప్పిన యతిభేదములు.

భిన్నయతులు, ప్రత్యేకయతులు:—అనంతుఁడు, అప్పకవి పేర్కొన్నారు. 'చేతిది'* లో ఉన్న 'తీ'కిన్ని 'దివిజ' లో ఉన్న 'దీ'కిన్ని మైత్రి కలదు; చేతి యది లో ఉన్న 'యా'కు అకారముతో మైత్రి కలదు; 'ధరించె'§ లో ఉన్న 'రీ'కి రేఫతో మైత్రి కలదు; 'ధరియించె' లో ఉన్న 'యీ'కి ఇకారముతో మైత్రి కలదు; అని ప్రత్యేకముగా కొత్తయతిభేదములవలె ఎందుకు చెప్పవలెనో తెలియదు. చేతిదిలో ఉన్న తకారముపై స్వరము విరుగునన్న భ్రమపడకూడదని చెప్పవలెనంటే, ఆలాగునే చెప్పరాదా? ఇటువంటివి ఇంకా

* చూ. అప్ప. అనంత. 128. § చూ. అప్ప. అనంత. 128.

ఉన్నవి; ఎన్నని పేర్కొనఁగలము? ఉ. ఉన్నది, (ఉన్న+అది), ఉన్నవి (ఉన్న+వి), ఉన్నాడు (ఉన్న+వాడు; ఉన్న+ఆడు),* చిన్నవి (చిన్న+అవి), రాజవు (రాజు+అవు) ఇటువంటిమాటలు 'చేతిది' వంటివికావా?

పోషించు, భుజించు మొదలయినవాటిలో మధ్యవర్ణము పై స్వరము విరుగునను టకు ప్రసిద్ధులయిన పూర్వకవుల ప్రయోగములున్నవి:—

1. నందియుం బీరమణీయకాంతినుప+మింపఁగ. (ఆది ఆ. V. 155)
2. ఇరవుగదాధారగొని భు+జించుట యొప్పఁగ. (పద్మ పు. II. 98)
3. ఎక్కబరించునంతకు వ+రించుట. (పద్మ పు. III. 170)

రేఫయుతయతి:—ఈయతిభేదము అనంతుఁడెందుకు చెప్పినాఁడో తెలియదు. "తెనుగుమాటలలో ఋకారముండదు; స్రుక్కు, క్రుమ్ము మొదలయిన మాటలలోఉన్నది రేఫ", అని చెప్పియుండునుగాని ఇదియొక యతిభేదముగా చెప్పియుండఁడని నాఅభిప్రాయము. అందుచేతనే పట్టికలో దీనికి వేరేసంఖ్యచూపక

* శృంగారనైష. III. 120. టీ. "నముచి దమనుండు పుత్తెంచి న్వాడు" లో యతి తప్పని బ్ర॥ వేదము వేంకటరాయశాస్త్రులవారు దిద్దినారుగాని, ఈపాఠమే వ్రాతప్రతులలో ఉన్నది. తిక్కన ఇట్టి యతులు వాడినారు. చూ. శాంతి. II. 87. "నాకు దక్షిణగా నిచ్చినాఁడవింక; అశ్వ I. 46 నాదు గుఱుతుసెప్పినా రెవ్వరనినను." గనుక తప్పుకాదు.

18 అని ఉంచినాను. ఇదికలిపితే అనంతుడు 25 వడి భేదములను పేర్కొన్నాడని చెప్పవలసి ఉంటుంది. 24 వడి భేదములనే అనంతుడు పేర్కొనినట్లు అప్పకవి వ్రాసినాడు.

ఎక్కటి (ఏకతర) వళ్లు:—ఇవి లాక్షణికు లందరున్ను చెప్పినారు. ఏ అక్షరమునకు ఆ అక్షరమే వడిగలది అని దీని అర్థము. అటువంటి అక్షరములు 'మయరలవ' లు అని కవిజనాశ్రయములోను, 'మరఱలవ' లు అని కావ్యాలంకారచూడామణిలోను, 'మరఱళవ' లు అని ఛందోదర్పణములోను ఉన్నది.

బిందుయతినిబట్టి, 'మా'కు పంపతో వడి ఉండగా, 'మ' ఎట్లు ఎక్కటి వడి కాగలదు? సరసయతినిబట్టి అయహాలకు వడి చెల్లగా, 'య' ఎట్లు ఎక్కటి వడికాగలదు? డకారముతోను, లకారముతో 'ళా' కు వడి అంగీకరించిన అనంతుడు 'ళా' ఎక్కటి వడిగా ఎట్లుచెప్పగలడు?

ఇది అంతాచక్కగా విమర్శించేకాబోలు అప్పకవి, రఱలనే ఏకతరయతులక్రింద పేర్కొన్నాడు.

లాక్షణికులు పాటించిన అక్షరమైత్రిచాలామట్టుకు "తుల్యాస్యప్రయత్నం సావర్ణ్యం" అనేధర్మమునుబట్టే ఏర్పడ్డదని చెప్పవచ్చును. గాని ఈదిగువ నుదాహరించినవాటిలో తుల్యాస్యప్రయత్నము పూర్తిగాఉన్నట్లు కనబడదు.

1. ఇ, ఎ=ఋ. ఋకారము మూర్ధన్యముగదా? తాలవ్యాచ్చులతో ఎట్లు మైత్రికలుగును? అయితే, ఋకారమునకు

తాలవ్యోచ్చారణ పూర్వముండెను. కనుకనే కృష్ణుఁడు-కిష్టడయినది.* రానురాను ఋకారమునకు తాలవ్యోచ్చారణ మారి ఉత్వముతో కలిసిన రేఫోచ్చారణవచ్చినది. ఋఋూలు రురూలని తెలుగువారు పలుకుచున్నారు. ఇది అనంతుని నాటికేవచ్చినట్లు కనబడుచున్నది. సృక్కు రేఫయుతమేగాని 'నృక్కు'అని ఋకారయుతము కాదని చెప్పినాడు. ఇటువంటివే ఇవడి.

2. దంత్య 'చజస' లకు తాలవ్య'చజశ'లకు మూర్ధన్య'ష' కారమునకు మైత్రిఎట్లు సావర్ణ్యమునుబట్టి కలిగినది? వీటిమైత్రి కంటె 'సెలవు'లో 'సె'కున్ను 'శలభము'లో ఉన్న 'శ' కున్ను మైత్రి తెలుగువారి ఉచ్చారణబట్టి ఎక్కువగా ఉన్నట్లున్నది. ఇవి అన్నిఉష్మములు కనుకవాటికి మైత్రికలదు అంటే, హాకారము కూడా ఊష్మము, ఉపధ్మానీయజిహ్వామూలీయములు కూడా అట్టివే. అంతస్థములయిన "యరలవ"లకేల మైత్రి లేదు?

3. లఘ్వలఘు యకారములకు తుల్యాస్య ప్రయత్నము పూర్తిగాఉన్నదా? 'యామినీ' లోని 'య' 'వచ్చినయప్పుడు' లోని 'య'—ఈ రెండున్ను ఒక్కలాటివా?

4. నణలు భిన్నవర్గములు; అనునాసికత్వమే సామాన్యము; అంటే, తక్కినఅనునాసికలతో ఎందుకు మైత్రికూడదు? తత్సమ తద్భవములలో నణలు మారుచుండును. ఉ. గుణము; గొనము;

*ప్రాకృతభాషలలోను, పాలీలోను ఋకారము కొన్నియెడల ఇకారమయినది. అరవములో కృ=కిరు, తెలుగులోను, కన్నడములోను కృ=క్రి.

సావర్ణ్యము కొంతవరకుండబట్టే ఈరెండును ఒకదానికొకటి వచ్చునంటే, దడలు ఈలాగునే దేశ్యపదములలో కనిపించును గదా; వాటికిమైత్రి ఎందుకుచెప్పరాదు? ఉ. దొంగ, డొంగ; దాపల; డాపల, సంస్కృతమందు తకారమొకప్పుడు టకారమగునుగదా.

5. లడలకు, వ బలకు (వ, ప) అభేదమన్న కారణముచేత మైత్రి అంగీకరించినప్పుడు, రలలకెందుకుమైత్రిఉండరాదు? (సరిరము,సలిలము; రేఖ, లేఖ)

6. తెలుగులో గవలు, 'లన'లు కొన్నిమాటలలో మారుచుండును; ఉ. పగడము, పవడము; తెలుఁగు, తెనుఁగు.

వడిస్థలము.

సంస్కృతశ్లోకములలో విశ్రాంతిప్రధానము; ఖండాద్యక్షరమైత్రి కావలెనన్న నియమములేదు. తెలుగు పద్యములలో ఖండాద్యక్షర మైత్రిప్రధానము. విశ్రాంతి(అనగా పదముముగియవలెనన్న) నియమములేదు. విశ్రాంతి ఐచ్ఛికముగా ఉండుటవల్ల మేలేకలిగినదని చెప్పవచ్చును. అన్నిపాదములలోను విశ్రాంతి ఒక్కచోటనే ఉండుటకంటె మారుతూఉంటే పద్యము రసోచితముగా ఉండుటకు వీలుండును. అక్షరమైత్రి కావలెనని కోరేవారు విశ్రాంతిస్థలమందు వడిపాటించుట మంచిదేకాని విశ్రాంతిస్థలమును నిర్ణయించుటలో రసజ్ఞులైనకవులు తమస్వాతంత్ర్యము చెడగొట్టుకో కూడదని నామతము.

లక్షణసూత్రములు మీరరానివన్నట్లున్నా కవులుకొద్దిగా స్వాతంత్ర్యమును చూపించకపోలేదు. సంస్కృతలాక్షణికులు

వృత్తములలో ఎక్కడెక్కడ విశ్రాంతి ఉండవలె ననిచెప్పినారో ఆవృత్తములకు సరియైన తెలుగుపద్యములలో ఆయాస్థలములం దేవడి నియమము సాధారణముగా ఉన్నది; గాని, చాలాచోట్ల తప్పినది. ఉదాహరణములు:—

1. భుజంగప్రయాతము:—సంస్కృతమున 6 అక్షరముల తర్వాత * తెలుగున 7 తర్వాత వేదము వేంకటరాయశాస్త్రుల వారు సంస్కృతపండితులు గనుక సంస్కృతనియమమే పాటించినారు.

2. పంచచామరము:—సం. 8; తెలుగు 9.

3. శిఖరిణి:—సం. 6; తె. 12.

4. ఆర్యాదిజాతులు:—చూడండి; మూలము III. 3. 4.

తెలుగుపద్యములలోనే వళిస్థలములగురించి లాక్షణికుల లోను కవులలోను మతభేదమున్నది. చూడండి:—

1. పృథ్వి:—

సంస్కృతములో 8. ఈమర్యాద ననుసరించినవారు పెద్దన.

| | |
|---|---|
| అప్పకవి, అనంతుడు, విన్నకోటపెద్దన కవిజనాశ్రయకర్త వీరి మతమున | 11 తర్వాత. ఈనియమమును నన్నయ రామరాజ విభూషణుడు మొదలయిన వారు పాటించినారు. |

---

* కొందరు లాక్షణికులు ఎన్ని అక్షరములయిన తర్వాత వడిఉండునో ఆసంఖ్య తెలియజేతురు. కొందరు ఎన్నవఅక్షరము వడిగలదో ఆసంఖ్య తెలియజేతురు. సంకేతభేదమే గాని, స్థితి ఒకటే.

తాతంభొట్లు మతమున 13 తర్వాత.

2. కవిరాజవిరాజితము:—

| | |
|---|---|
| అప్పకవి మొదలయినలాక్షణికు లందరిమతమున. | పాదాక్షరములలో 8 వది, 14 వది, 20 వది మొదటి అక్షరముతో మైత్రిగలవి. |
| కవిజనాశ్రయములో— | (చూ. పు. 49) రెండవపాదమున "కామనిభా"* అనుచోట మాత్రము వడి తప్పినది. గాని, అప్పకవి మొదలయినవారు చెప్పినట్లేవడి ఉన్నది. |

కంకంటిపాపన మొదలయినకవులు కొందరిట్లే వడిపాటించినారు. గాని నన్నయ, పెద్దన, జక్కన మొదలయినవారు కొందరు పాదమధ్యమున ఒక్కచోటనే వడిపాటించినారు.

3. మధ్యాక్కర:—

లాక్షణికులందరును మూడుగణముల తర్వాత వడి నియమించినారు. నన్నయఒక్కడే నాలుగుగణముల తర్వాత వడి

* జయంతి రామయ్యపంతులుగారిచే పరిశోధితమై ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే ప్రకటితమైన ప్రతిలో "కామనిభా" అని ఉన్నది; గాని నావద్దనున్న ప్రతిలో "రామనిభా" అని ఉన్నది. పరిష్కర్తలు తమవద్దనున్న ప్రతులలోని పాఠము నిచ్చినారు కాబోలు. కవిజనాశ్రయములో వడి గురించిలక్షణమున ఏమీ చెప్పియుండలేదు; గాని లక్ష్యలక్షణపద్యములో అప్పకవిచెప్పినట్లు మొదటిపాదమున వళ్లు ఉండడముచేత రెండవపాదమున కూడా అట్లేఉండవలెనని తోచును.

పాటించినకవి. యుద్ధమల్లుని శాసనమందున్న మధ్యాక్కరలలో నాలుగుగణముల తర్వాతనే వళి ఉన్నది.

కొన్ని పద్యములలో తెలుగులాక్షణికు లందరున్ను చెప్పిన స్థలమందుగాక మరియొకచోటను వళి ఉంటే ఎక్కువ బాగుగా ఉండునని నాయభిప్రాయము.

1. జలోద్ధతగతి:—

సరోరుహాదళాక్ష + శాశ్వతయశా (అనంతుడు), తెలుగులాక్షణికు లందరును ఇట్లే వళి పాటించినారు; గాని' సంస్కృత లాక్షణికుల నియమము పాటించుట మంచిదని నేను వ్రాసినది చూడండి.

సరోజనయనా + జలోద్ధతగతిణ్
సరూపగతులణ్ + జనంబు జనముల్
జరించు; విరతుల్ + షడర్ణములపై
కరీంద్రవరదా + ఖగేంద్రతురగా

2. ప్రమితాక్షరము:—

'కమనీయతేజునిన + గణ్యయశుణ్' అనంతుడు లాక్షణికు లందరును ఇట్లే 8 తర్వాతి వడి ఉంచినారు. గాని 6, తర్వాత వడి ఉంచి నేను వ్రాసినది చూడండి.

జగదేకదేవ + సజసాయుతమై
ద్విగణాంతమందు + విరమం బమరణ్
భగవంతుఁ గొల్వ + ప్రమితాక్షరమై
జగమందు నిల్చు + జలజాక్షహరీ!

3. మౌక్తికమాలావృత్తము:—

"భక్తజనత్రాత+భతవగాసం
యుక్తములై మౌని+యుతయతుల్ సు—" (అప్పకవి)

తక్కిన లాక్షణికులు ఈ వృత్తము పేర్కొ లేదు.

సంస్కృతమున ఉన్నట్లు 5 తర్వాత విశ్రాంతి ఉంచి నేను వ్రాసినది చూడండి.

భక్తులఁగాచే+వనరుహనేత్రున్
సూక్తులఁబల్కె+సురుచిరగాత్రున్
ముక్తినొసంగే+మునిజనమిత్రున్
మౌక్తికమాలన్+బలుమఱు గొల్తున్

## ప్రా స ము.

అలంకార తుల్యములైన ప్రాసములు—సుకర, దుష్కర, ద్వి, త్రి, చతుష్ప్రాస, అనుప్రాస, అంత్యప్రాసములు ఏడింటిని అప్పకవి చెప్పినాడు. వీటిలో మొదటిదిగాక తక్కిన ఆరున్ను ఛందోదర్పణములో ఉన్నవి. చతుష్ప్రాసముగాక తక్కిన ఆరున్ను కవిజనాశ్రయములోను, కావ్యాలంకారచూడామణి లోను ఉన్నవి. అయితే కావ్యాలంకారచూడామణిలో చతుష్ప్రాసప్రాసము లక్షణపద్యమందు కనబడకపోయినా దానికి లక్ష్యముగా త్రిప్రాసలక్షపద్యము తర్వాత నొకపద్య మున్నది. ఇది ప్రక్షిప్తము కాబోలు.

ప్రధానప్రాసభేదములలో లళడ ఋక్రాంతప్రాసములపద్యములు మూడు కవిజనాశ్రయములో ఉన్నవి. ఈపద్యములే కావ్యాలంకారచూడామణిలో కూడా ఉన్నవి. ఇవి ఎవరివో తెలియదు. ఇంతకు మించి ప్రాసభేదములు ఈ లక్షణగ్రంథములలో లేవు. ఈ లక్షణగ్రంథకర్తలు నన్నయ భారతములోని పద్యములందు గల ప్రాసభేదములను చక్కగా పరిశీలించలేదని చెప్పవచ్చును.

అనంతుడు సమప్రాస విధులు చూపించి మరి పదకొండు విధములైన విశేష ప్రాసముల గురించి చెప్పినాడు. (**మూలము** 10-వ పుట చూడుము.)

అనంతుడు చెప్పిన పండ్రెండువిధములేకాక అతడు చెప్పక విడిచిన మరి యేడు విశేషములు అప్పకవి చెప్పినాడు. అవి ఏవంటే:—

(1) వేఁడు, పండ్లకు.
(2) లోక, (భా)షాక్లప్తకు.
(3) సమలకు.
(4) తమ్ములు, (భ)క్తి మ్మురి (భక్తి + మురి) లకు
(5) వధలకు, ౦దంథలకు.
(6) లఘ్వలఘు యకారప్రాసము.
(7) లడలకు.

ఈప్రాసములలో కొన్ని అనంతునికి పూర్వము ప్రసిద్ధులయిన కవులు వాడినారు గనుక కొంతవరకు అతని పరిశీలనలో లోపమున్నదని చెప్పకతప్పదు.

## యతిప్రాసములు.

" యతిప్రాసనియమము త్యజించుట కాంధ్రలోక మంగీకరించునని తోఁపదు" అని జయంతి రామయ్యగారు కవిజనాశ్రయ పీఠికలో కొన్ని కారణము లిచ్చి సిద్ధాంతము చేసినారు. ఈనియమములను త్యజింపవలయునని గాని త్యజించరాదనిగాని శాసించి నిర్బంధించకూడదనిన్ని, త్యజించదలచుకొన్న వారిని పాటించదలచుకొన్నవారిని సమదృష్టితో చూడవలసినదనిన్ని నాయభిప్రాయము. ఈనియమములు శబ్దాలంకారములవలె ఐచ్ఛికముగా వాడుకోవచ్చును; లేదా ఇవి విడిచిపెట్టి యుక్తివిశేషము ప్రధానముగా పెట్టుకొని రసవంతముగా కావ్యములు చెప్పవచ్చును. సంస్కృత శ్లోకములకు తెలుగు పద్యములలో ఉండవలెనన్న నియమములు లేవు. అంతమాత్రాన కాళిదాసాది మహాకవుల కావ్యములకు ఏమి లోటు కలిగినది? వాటికంటె తెలుగు కావ్యములకు వళ్లవల్లను ప్రాసములవల్లను వచ్చిన ఘనత ఏమి?

"శబ్దస్వరూపము నిర్ణయించుట కత్యంతోపయోగకరము" లని రామయ్యపంతులుగారి అభిప్రాయము. వడిప్రాసములు లేకపోయినా సంస్కృత భాషాశబ్దస్వరూపము వేదకాలమునుండి నేటికిని ఎక్కువ చక్కగా నిర్ణయించవచ్చును గదా. అయితే ఇతరసాధనము లున్నవందురేమో. సూర్యారాయ నిఘంటువు వంటి నిఘంటువులున్ను, అచ్చు మొదలయిన ఇతర సాధనములున్ను వచ్చుచున్నవిగనుక వడిప్రాసములవంటి సాధనములు శబ్దస్వరూపనిర్ణయమున కిక నవసరమని తోఁచదు.

"ఆంధ్రవాఙ్మయాభివృద్ధి కీ నియమములు బాధకము లుగా ఉండి యుండక/పోయిన"వని రామయ్యగారి అభిప్రాయము. నన్నయ, తిక్కన మొదలయిన మహాకవులు సయితము వడిప్రాస ముల కోసము పొల్లుమాటలు వాడుకచేసినట్లు వందలకొలది ఉదాహరణములు చూపించవచ్చును.

ఇటువంటి నియమములు పాటించవలెనని నిర్బంధముగా ఉన్నంతకాలము ఆంగ్లవాఙ్మయము ఎట్లుండెనో స్వేచ్ఛ కలిగిన తర్వాత (Romantic Period) లో ఎట్లు అభివృద్ధి పొందినదో చూడండి.

పద్యములకు నడక ప్రధానమైనది. పద్యముల కుండవలసిన ఈ ముఖ్యలక్షణమును స్పష్టముగా తెలియజేసేటట్లు లాక్షణి కులు కొన్నిచోట్ల సరియైన లక్ష్యలక్షణపద్యములను ఇయ్యలేదని నా యభిప్రాయము. ఈ విషయమును గురించి "తెలుగు"పత్రిక 5, 6, 7, 8 సంచికలలో నేను వ్రాసిన "ఛందోరహస్యదర్పణ ము"ను చూడండి.

## సీసములు.

లాక్షణికు లందరిలోను అనంతుడు ఎక్కువగా పదిసీసభేద ములను చెప్పినాడు.

1. సమసీసము.— (సామాన్యసీసము; విశేషలక్షణ మేమీలేదు.)

2. సర్వతః ప్రాసనీసము.— (అన్నిచరణములలోను ఒకే అక్షరము ప్రాసయతులుగలది. అనగా 24 చోట్ల ఒకటే ప్రాసాక్షరము.)

3. అక్కలిప్రాసనీసము.— (పెద్దపాదములందుగల 8 ఖండములలోను గీతినాలుగు పాదములలోను రెండవఅక్షర మొక్కటే అయి ఉండవలెను. అనగా 12 చోట్ల ఒకటే ప్రాసాక్షరము.)

4. సమప్రాసనీసము.— (నాలుగు పెద్దపాదములందును గీతిలో బేసిపాదములరెంటను రెండవ అక్షరము ఒక్కటే అయి ఉండవలెను. అనగా ఆరుచోట్ల ఒకటే ప్రాసాక్షరము.)

5. వృత్తప్రాసనీసము.— (పెద్దపాదముల నాల్గింటమాత్రమే వృత్తముల కున్నట్లు ప్రాస ముండవలెను.)

6. అవకలిప్రాసనీసము.— (అన్నిచోట్లను ప్రాసయతి నియమముమాత్రమే కలది.)

7. అక్కలివడినీసము.— (అన్నిచోట్లనువడి నియమమేకలది.

8. వడిసీసము.— (అన్నిచోట్లను వడి నియమ ముండవలెను; అంతేకాక పాదాదినున్న వర్ణముతో మైత్రిగల వర్ణములే పాదముపొడవున యతిస్థలములందు రావలెను.)

9. విషమసీసము.— (ఉత్సాహ, గీతపద్యమున్ను కలిసినది.)

10. సర్వలఘుసీసము.— (ఇందులో ఇంద్రగణములకు బదులుగా అయిదు లఘువుల గణము లుండును.)

వీటిలో 3, 4, 6, 7, 8, 9—సీసభేదములు కవిజనాశ్రయములోను కావ్యాలంకారచూడామణిలోను ఉన్నవి. అయితే 3 వది సరిగా అనంతుడు చెప్పినట్లులేదు; 8 పాదములలోను ప్రాసాక్షర మొక్కటయితే చాలును; పెద్దపాదముల పశ్చిమార్థములందీనియమము లేదు.

ఈరెండు లక్షణగ్రంథములలోను సీసభేదముల విభాగమున్ను లక్షణములున్ను ఒక్కలాగుననె ఉన్నవిగాని, కవిజనాశ్రయములో రెండేసిభేదముల కొక్కొక్క పద్యమే ఉన్నందున కావ్యాలంకారచూడామణిలో ఉన్నంతస్పష్టముగా లక్షణము లేదు. రెండు గ్రంథములలోను విషమసీసములుగాక తక్కిన అయి

దున్న సమసీసములని చెప్పియున్నదిగాని సమసీసము ఒకసీస భేదముగా చెప్పలేదు.

"సీ. వృత్తంబునకువలె" అన్నపద్యము కవిజనాశ్రయము లోను ఛందోదర్పణములోను ఉన్నది. ఇది సీసభేదముల పేళ్లు గలసీసము; అవకలిసీసమునకు లక్ష్యముగా ఉన్నది. ఇందులో వృత్తప్రాససీసమును సమసీసమును పేర్కొన్నారు. వీటికి కవిజనాశ్రయములో లక్ష్యపద్యములు లేవు; సీసభేదములను పేర్కొన్న గద్య వేరేఉన్నది; ఆగద్యలో ఈ రెండు భేదములు పేర్కొనలేదు. ఈవిషయము లన్నిచూడగా ఈపద్యము అనంతునిదే అనిన్ని కవిజనాశ్రయములో ప్రక్షిప్తమనిన్ని ఊహించనచ్చును.

ఈలాగుననే మరికొన్ని పద్యములు కవిజనాశ్రయము వ్రాతప్రతులలో దూరినవి. అవి ప్రక్షిప్తములని ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశిత ప్రతిలో పుట అడుగున సూచితమై ఉన్నది గాని ఈపద్యముగురించి ఏమియు చెప్పలేదు. పరిష్కర్తలు చూచిన అన్ని ప్రతులందును ఈపద్యమున్నది కాబోలు.

అప్పకవీయములో లక్షణపద్యమునుబట్టి లక్ష్యములు సరిగా లేవు గనుక కవి అభిప్రాయము స్పష్టముగా తెలియదు. అతడు చెప్పిన సమసీసము, సర్వతఃప్రాససీసము, విషమసీసము, సర్వలఘుసీసము అనంతుడు చెప్పినట్లే ఉన్నవిగాని, అప్పకవి అక్కలిప్రాససీసమన్నది అనంతుని సమప్రాససీసమునకు సరిపోయినది. అయితే అందుకు లక్ష్యముగా అప్పకవి ఇచ్చినపద్యములో చివరను "చెలఁగుచుండు వృత్తిప్రాససీసము లిల" అని ఉండుటకు కారణమేమో తెలియదు.

"ఆదినే వడి నిల్పి రావడే పదమెల్లఁ జేయ నయ్యది వడిసీస మనఁగ" అని అప్పకవి అనంతునివలెనే లక్షణముచెప్పి అందుకు లక్ష్యముగా ఇచ్చిన పద్యములో ఆ లక్షణము పాటించలేదు. అనంతుడు అక్కిలివడికి చెప్పిన లక్షణము మాత్రమే పాటించినాడు.

అనంతుడు 'అవకలిప్రాస' మన్నసీసమునకు అప్పకవి అవకలివడిసీసమని పేరుపెట్టినాడు.

ఇంతకున్ను ఎంతవఱకు ఈసీసభేదములు కవులు తమ కావ్యములలో చూపించినారో విచారణీయము. "సప్తవిధము లివియ శబ్దశాసనుండు, పంచమామ్నాయ ఫక్కిలోఁ బల్కెఁగాని, కడమకవులాఱుసీసము ల్విడిచిపెట్టి. తెలఁగి సమసీసపద్యమే చెప్పినారు" అని అప్పకవి వ్రాసినాడు; గాని ఇది సత్యముకాదు.

నన్నయ 13 విధము లయిన సీసములు చెప్పినాడు. వీటిలో రెండుమాత్రమే లాక్షణికులుచెప్పిన సీసభేదములలో ఉన్నవి:— (1) అక్కిలివడిసీసము (2) అవకలిప్రాససీసము. ఈవిషయము "తెలుగు" రెండవసంచికలో చర్చించినాను.

ఆవ్యాసమున చెప్పమరచిన దొకటేమంటే నన్నయసీసములలో రెండు (ఆది. II. 21; III. 27) వృత్త్యప్రాససీసము లున్నవి. అయితే వాటిలో ఒకవిశేషమున్నది. ప్రాసాక్షరము పశ్చిమార్థము లందున్ను కలదు.

ఎఱ్ఱాప్రెగడ భారతములో నన్నయచెప్పిన సీసభేదములు కలవు.

భాగవతములో పోతనామాత్యుడు నన్నయవలెనే కొన్ని నియమములను పాటించి పలువిధములయిన సీసములను చెప్పి నట్లు వావిలికొలను సుబ్బారావుగారు పరిషత్పత్రికలో (సంపుటము 6 పుటలు 417-420) తెలియజేసినారు.

భాగవతము ఏకాదశస్కంధమున 72-వ పద్యము సర్వ లఘుసీసము. లాక్షణికులు చెప్పినట్లు ఇందులో ఇంద్రగణములకు బదులుగా 5 లఘువులగణము లున్నవి. ఇది తెలియక కాబోలు (చూ. ఆనంద...1904 ముద్రితము) పుట అడుగున ఈసీసము లక్షణ సమన్వయముగాక యున్నదని సంప్రతించినవారు వ్రాసినారు.

కూచిమంచి తిమ్మకవి మొదలయినకవులు కొందరిట్లే సర్వలఘుసీసములు చెప్పినారు. గణపవరపు వేంకటకవిమాత్రము తనప్రబంధములో నలములయిన ఇంద్రగణములతోనే సీసము వ్రాసినాడు (చూ. 75, 221 పద్యములు.)

## ఆర్యలు, గీతులు.

పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల అని ఆర్యలు అయిదు. గీతి, ఉపగీతి, ఉద్గీతి, ఆర్యాగీతి అని గీతులు నాలుగు. ఈ తొమ్మిదన్ని సంస్కృతచ్ఛందములో ఉన్నవి; కందమన్న పేరు దానిలో లేదు గాని, ఆర్యాగీతిలక్షణము కందపద్యలక్షణమునకు సరిపోయినది. గనుక కందముగీతులలో ఒకటిగా చెప్పవచ్చునుగాని అప్పకవి చెప్పినట్లు కందమును ఆర్యలయిదింటిలో చేర్చి కందము లారువిధములని చెప్పుట యుక్తియుక్తముగాలేదు.

సంస్కృతమున ఉన్న ఆర్యలయిదింటికిన్ని సామాన్యలక్షణము:—

“లక్ష్మైతత్ సప్తగణా, గోపేతాభవతి నేహ విషమేజః।
షష్ఠోఽజశ్చనలఘువా, ప్రథమార్ధే నియతమార్యాయాః ।
షష్ఠేద్వితీయలాత్పర, కేన్లేముఖలాచ్చసయతిపదనియమః।
చరమేఽర్ధేపంచమకే, తస్మాదిహ భవతి షష్ఠోలః।”

| | |
|---|---|
| 4+4+4 | అంకెలు మాత్రాసంఖ్యను నిలువు గీతలు యతిస్థానములను తెలియ జేయును. |
| 4+4+1 \| +3 \| +4+4 | |
| 4+4+4 | |
| 4 \| +4+1 \| +4+2 | |

(రెండవపాదము మూడోగణము నలమో జగణమో కావలెను. దానిలో మొదటిలఘువు తర్వాత యతిగనుక 1+3 అని వ్రాయవలసివచ్చినది.) పైని చెప్పినవిషయములు సూత్రప్రాయముగా అనంతుడు III. 3.4 లో చెప్పినాడు. ఈలక్షణము యతిప్రాసనియమములలో కాక తక్కిన విషయములలో సరిపోయినది. కందములో కనబడునట్లు ప్రాసమున్ను సమపాదములలో మూడవగణముతర్వాత విశ్రాన్ని ఉండవలెనని తెలుగులాక్షణికులు చెప్పినారు.

ఇప్పుడు ముద్రితమైన ఛందోదర్పణప్రతిలో ఆర్యాగీతుల లక్ష్యపద్యములు కనబడవు. లాక్షణికుల ఆచారమును అనుసరించి లక్ష్యలక్షణములను ఒక పద్యమందు ఇతరస్థలములలో

చూపించిన అనంతుఁడు ఈఆర్యాగీతులందు మాత్రము చూపించి యుండఁడా ? అజ్ఞానముచేత కొందరు లేఖకులు అనంతుని ఆర్యాగీతులను కందములవలె నడిచేటట్లు "సవరించి" రూపుమాపినారు. అనవసరముగా అతికినమాటలు తీసివేసినయెడల వాటిలో లక్ష్య లక్షణములు రెండున్ను స్పష్టముగా కనబడగలవు. చూడండి:—

పథ్యార్య.—బేసులు త్రిగణయుతము లై
యాసమపాదములఁ బొరసి+యార్యయనఁ
భాసిల్లుఁ బథ్య యనఁగా
వాసవముఖదివిజ+వర్గనుతా. (పుట. 66)

విపులార్య.—ప్రకటసమపాదముల నిలు
వక శబ్దము నవలఁ జొచ్చి+వచ్చినఁ ద
క్కక విపులార్యయగును సే
వక జనమందార+వనజాక్షా. (,,)

చపలార్య.—వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురద్గమాద్యగజకార+ములు దగరెం
డరయఁగఁ దనర్చునేనిఁ
హారీమురారిచప+లార్య యగుఁ. (,,)

ముఖచపలార్య.—చపలా గణప్రకారం
బపారకారుణ్యసాగ+రా ! ప్రథమా
ర్థపరం బగుచున్నది ముఖ
చపలార్య యనంగఁ+జనుఁ గృతులఁ. (,,)

జఘనచపలార్య.- మొదలివగము చపలార్యా
స్పదగణలక్షణము సారక + చరమార్థం
బునెత ప్రకార రేఖఁ
గదాధరా! చను జ + ఘనచపలఁ (పుట. 67)

గీతి.—లసి దార్య మొదలి సగమున
నెసఁగఁగ రెండరలు చెప్పి + రే నది గీ
తిసమాహ్వయ మగుఁ గృతులఁ
వసుధాధర కృష్ణయాద + వస్వామీ. (,,)

ఉపగీతి.—ధర నార్యమీఁదిసగమున
నిరుసగమున చెప్పి + రే నది దాఁ
బరగు నుపగీతి యనఁగా
సరసిజదళనేత్ర + శార్ఙ్గధరా. (,,)

ఉద్గీతి.—విదితార్యచరమదళముఁ
మొదలి సగము చేసి + మొదలిసగం
బది యవరార్థముఁ జేసినఁ
బొదుపగు నుద్గీతి భుజగ + భుగ్గమనా. (,,)

నేనుచూచిన (పరవస్తువారి) ప్రతిలో మొదటివి రెండున్ను కాక తక్కినవన్నీ నేనిక్కడ చూపించినట్లే ఉన్నవి. మొదటిది ఇప్పుడు ముద్రితమైన ప్రతిలో ఉన్నట్లేఉన్నది; రెండవదానిలో రెండవపాదము నేను చూపించినట్లే ఉన్నది.

## అక్కరలు.

అక్కరలు దేశ్యజాతులలో చేరినవి. ఇవి కన్నడమందును గలవు. తెలుగు అక్కరలకు కన్నడపు అక్కరలకు చాలా మట్టుకు సాదృశ్యమున్ను కొద్దిగా భేదమున్ను ఉన్నది.

| నెం | తెలుగు పేరు. | లక్షణము. | కన్నడపు పేరు. |
|---|---|---|---|
| 1 | మహాక్కర | సూర్య ఇంద్ర చంద్ర<br>1 + 5 + 1 = 7 | పిరియక్కర |
| 2 | మధ్యాక్కర | ఇం సూ ఇం సూ<br>2 + 1 + 2 + 1 = 6 | దొరెయక్కర |
| 3 | మధురాక్కర | సూ ఇం చం<br>1 + 3 + 1 = 5 | నడువణక్కర |
| 4 | అంతరాక్కర | సూ ఇం చం<br>1 + 2 + 1 = 4 | ఎడెయక్కర |
| 5 | అల్పాక్కర | ఇం చం<br>2 + 1 = 3 | కిరియక్కర |

వీటిలో మహాక్కరకు పిరియక్కర, అంతరాక్కరకు ఎడెయక్కర, అల్పాక్కరకు కిరియక్కర అనేపేళ్లు సరిగా ఉన్నవి. కాని తక్కినవిసరిగాలేవు. అక్కర లయిదింటిలోను పాదమున ఉన్న గణసంఖ్యనుబట్టి నడుమనున్నది గనుక నడువణక్కర అనేపేరు కన్నడమున అన్వర్థముగా ఉన్నది. అయితే లక్షణమును బట్టి దీనికిసరియైన తెలుగుపేరు మధురాక్కర; అర్థమునుబట్టి సరియైన తెలుగుపేరు మధ్యాక్కర. మధ్యాక్కరకు లక్షణమునుబట్టి సరియైన కన్నడముపేరు దొరెయక్కర. దొరెయక్కరనగా సమాన

భాగములుగల అక్కర అనియర్థము; అంటే పాదము రెండుసమభాగములుచేయగా రెండుసమభాగములలోను గణములు ఒక్కతీరున ఉంటవని అర్థము.

2, 3, అక్కరలపేళ్లలో ఇంతమట్టుకు వైషమ్యమున్నా జయంతి రామయ్యపంతులుగారు అది కనిపెట్టకపోవడమేకాక "....పాదమున కైదేసి గణములుగల యక్కర గణసంఖ్యచే నైదక్కరలకు మధ్యస్థానమున నుండుటచే మధ్యాక్కర మనుపేరును నన్వర్థములుగానున్న" వని వ్రాయుట చాలావింతగా ఉన్నది. మధ్యాక్కరపాదములో ఉన్నగణములు ఆరుగాని, ఆయనచెప్పినట్లు అయిదుకాదు. "మధ్యాక్కర" అని అర్థమిచ్చే కన్నడపు నడువణక్కర అనేపేరు అన్వర్థముగా ఉన్నదని కాబోలు వారు చెప్పదలచి అట్లు వ్రాసినారు.

కన్నడపు అక్కరలకున్ను తెలుగు అక్కరలకున్ను లక్షణములో కొద్దిగా భేదములున్నవి.

1. తెలుగు పద్యములలో సూర్యగణములుండేచోట కన్నడపద్యములలో బ్రహ్మగణములుంటవి (అనగా నగణ హగణము లేకాక గగ, సగణములు కూడాను). తెలుగులో ఇంద్రగణములుండేచోట కన్నడములో విష్ణుగణములుంటవి (అనగా నల, నగ, సల, భ, ర, తలేకాక మగణము, సగణగురువు కూడాను). తెలుగులో చంద్రగణములుండేచోట కన్నడములో రుద్రగణములుంటవి(అనగా నగగ, నహ, సలల, భల, భగ, మల, సవ, సహ, తల, రల, నవ, నలల, రగ, తగలేకాక మగ, నగగములు కూడాను).

2. తెలుగు మధ్యాక్కరకు లక్షణముబట్టి సరిపోయిన కన్నడపు దొరెయక్కరలో చివరనున్న బ్రహ్మగణము అంత మందు గురువుగలదిగా ఉండవలెనన్న నియమమే ఉన్నది. అంటే గగమో సగణమో కావలెను. ఇందులో విష్ణుగణములు మాత్రము 4 గాని, 5 గాని మాత్రలుగల గణములే కావలె నన్నారు గనుక తెలుగున ఉన్న ఇంద్రగణములే అగును.

నాగవర్మ కన్నడఛందములో లక్ష్యములుగా ఇచ్చిన యక్కరలలో పాదాదినుండే బ్రహ్మగణములు మూడుమాత్రల గణములుగానే ఉన్నవి; గాని దొరెయక్కరలలో నడుమనున్న బ్రహ్మగణములు కొన్ని గగములున్ను, కొన్ని సగణములున్ను అయి ఉన్నవి.

3. కన్నడ పిరియక్కరల సరిపాదములందు 6 వ గణము బ్రహ్మగణము కావలెనన్న నియమమున్నది. అటువంటి విశేష లక్షణము మహాక్కరలందున్నట్లు కవిజనాశ్రయములో చెప్ప లేదు. "రెండును నాలుగునగు వాసరంబున నర్కుఁడైన, నాద రంబుననెడ నొచ్చునని మహాక్కరంబలుకుదు రార్యులెల్ల" అని అనంతుడును, "రెండవచోట నాలవచోటఁ జిత్రభానుగణంబు గదియుచుండు" అని అప్పకవీయములోను ఉన్నది. ఈవిశేషలక్ష ణము తెలుగు లాక్షణికుల మతమున ఐచ్ఛికముగా ఉన్నట్లు కన బడుచున్నది.

తెలుగు లాక్షణికులు అందరును ఒక్కలాగుననే మధ్యా క్కరకు లక్షణము చెప్పినారు. (ప్రతిపాదమునను రెండు ఇంద్ర

గణములు, ఒక సూర్యగణము, రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణము ఉండును. అని) అందరున్ను మూడవగణము తర్వాతనే వడి నియమించినారు.

నన్నయ మధ్యాక్కరపాదములలో నాల్గవగణము తర్వాత వడి కనిపించుచున్నది. యుద్ధమల్లుని శాసనాక్కరలలో సైతము నాల్గవగణము తర్వాతనే వడి ఉండడముచేత పూర్వము అట్లే వడిస్థానముండేదని ఊహించవలసి ఉన్నది. తిక్కన మధ్యాక్కరలు చెప్పలేదు. ఎఱ్ఱాప్రెగడ మూడవగణము తర్వాతనే వడి పాటించినాడు. మరి యేకవిన్నీ మధ్యాక్కరలు చెప్పినట్టు కనబడదు. లాక్షణికులు ఎఱ్ఱాప్రగ్గడ పాటించిన వడి గురించే చెప్పినారు గాని నన్నయపాటించిన వడి గురించి చెప్పలేదు.

నన్నయ మధ్యాక్కరలకున్ను తెలుగులాక్షణికులుచెప్పిన మధ్యాక్కరలకున్ను వడిస్థలములోనే భేదమున్నదా లేక గణములలో నయితము భేదమున్నదా? ఇటువంటి ప్రశ్న పుట్టుటకు కారణమేమంటే, పాఠభేదములు అనేకముగా ఉన్నవి. నన్నయ ఎట్లువ్రాసి ఉండునో తెలుసుకొనుట కష్టముగా ఉన్నది. వాటిలో అనేకపాదములందు గణములతీరు తెలుగులాక్షణికులు చెప్పినట్లు లేదు. భారతము పరిష్కరించి అచ్చువేయించిన వారు తెలుగు లాక్షణికుల మతము ననుసరించి సవరించినారు. ఎంతో శ్రమపడి వారు ఆలాగున సవరించి అచ్చువేయించినా అచ్చుపుస్తకములలో కొన్నిపాదములందు గణములతీరు తెలుగులాక్షణికులు చెప్పినట్లులేదు. చూడండి:—(వేమూరివారు ప్రకటించినది.)

(1) తనదివ్యశ_క్తి నప్పాశముల విడిచి+తన్మునినాథు
(ఆది. VII. 112)

(2) వంగురుకులహానికరుఁడయి ధారుణీ+నాథనీసుతుఁడు
(సభా. II. 182)

(3) సమరంగ ధర్మువురక్షించుఁబ్రీతి+నని శత్రులందు
(అర. I. 225)

(4) గలుగుపెరిఁగియుపాయపూర్వమునఁ+గడఁగి తత్సిద్ధి
(అర. I. 234)

(5) అరుణసరోరుహాదళమృదులంబు+లై నయి_త్తరుణి
(అర. III. 299)

(6) వరఁగ నాకారణమున నిట్టి దుఃఖ+భారముదాల్చె
(అర. III. 299.)

(7) నరిగె నీశానుదిక్కు_నకు నీయనుజుఁ+డనిల వేగమున
(అర. III. 378)

(8) తోనేఁగెను_త్తరముమించి ధర్మని+త్యుఁడు ధర్మజుండు
(అర. IV. 8)

(9) పదుంద్రబోలెడు సుతులనూర్వురఁ+బడయుంగవలతొ

(10) పదుంద్రనూర్వురకెనయగునుతులఁ+బడయుంగ వలతొ
(అర. II. 349)

వ్రాతప్రతులు చూచినయెడల మరి కొన్ని పాదములలో ఈలాగుననే గణములతీరు లాక్షణికులు చెప్పినదానికి భిన్నముగా ?నబడును.

కొన్ని చోట్ల చాలావ్రాతప్రతులలో ఒక్కలాగుననే ఉన్న పాఠము అచ్చుపడ్డపుస్తకములలో కనబడక పోవుటచేతను, అచ్చుపడ్డపుస్తకములలో ఉన్న పాఠము నన్నయ వాగ్వ్యవహారమునకు విరుద్ధముగా ఉండడముచేతను పరిష్కర్తలు తెలుగులాక్షణికులమతము ననుసరించి నన్నయపాఠములను దిద్దినారని ఊహించవలసి ఉన్నది. చూడండి:—

(1) నీపరోక్షంబున రాజుగావలె + నెమ్మినిట్లేగ
(ఆది. IV. 175)

(2) ఏమేము మున్నుపూజింపుదుమురుద్ర + నిందనివేడ్క
(అర. II. 255)

'కావలె' 'పూజింపుదుము' వంటిప్రయోగములు మరియెచ్చటను నన్నయభారతమందు కనబడవు. ఇవి ఇటీవలి కవులు వాడినారు గాని పూర్వకవిప్రయోగములు కావు; గనుక 'కావలయు' 'పూజింతుము' అనే నన్నయ వాడి ఉండును. అయిదారు వ్రాతప్రతులలో ఇట్లే ఉన్నది. 'కావలయు', 'పూజింతుము' అని ఉన్నయెడల మీద చూపించిన 10 పాదములవలెనే ఈరెండుపాదములలోను గణములతీరు లాక్షణికులు చెప్పినవిధమున ఉండదు. చూడండి:—

(1) నీపరోక్షంబున రాజుగావలయు + నెమ్మినిట్లేగ
(వ్రాతప్రతులు)

(2) ఏమేము మున్నుపూజింతుము రుద్ర + నిందనివేడ్క
(వ్రాతప్రతులు)

ఈలాగున పరిశీలించి చూచిన యెడల నన్నయ మధ్యాక్కరలు తెలుగులాక్షణికులు చెప్పిన లక్షణమునకు కొంచెము విరుద్ధముగా ఉన్నవి. అయితే నన్నయ మధ్యాక్కరలకు వేరే లక్షణము చెప్పగలమా ?

ఈవిషయము కొంతవరకు విమర్శించిన వారు, ఓకుమళ్ల రాజగోపాలరావుగారు, శ్రీవఝల చినసీతారామస్వామి శాస్త్రుల వారు మొదలయినవారు.

వీరిలో శాస్త్రులవారు * ఒక క్రొత్తమార్గ మవలంబించి నన్నయమధ్యాక్కరలకు లక్షణసమన్వయము చేయబోయినారు గనుక వారు చెప్పినది మొట్టమొదట విమర్శించవలసి ఉన్నది.

శాస్త్రులవారు అవలంబించిన మార్గమునకు యుద్ధమల్లుని శాసనములోని మధ్యాక్కరలే ఆధారము. ఆశాసనములో అరసున్నలు లేవు. అవి పూర్వకాలపులిపిలో లేనేలేవు. లేకపోవుట పూర్వకాలపు లేఖన సంప్రదాయము. అర్థానుస్వారము లుండదగినచోటకూడా పూర్ణానుస్వారములే ఉన్నా వాటికి పూర్వమందున్న హ్రస్వాక్షరము ఛందోనియమములకు సరిపడునట్లు ఊదిపలుకుటగాని తేల్చిపలుకుటగాని సంప్రదాయవిరుద్ధము కాదు. ఇందుకు దృష్టాంతముగా చూడండి:—

* చూ. ఆంధ్రచ్ఛందస్సులు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపుటం 9 సంచిక 2.

"అనిన వసిష్ఠుణ్డిట్లనియె న న్త ధనంబును నట్టి రాజ్యంబుం" అని శాసనములో ఉన్నట్లు పూర్వలేఖనసంప్రదాయమును అనుసరించి ఉన్న ఈచంపకమాలాపాదము, "అనిన వసిష్ఠుఁ డిట్లనియె+నంత ధనంబును నట్టిరాజ్యముం" అని చదువవలెను.

ఆలాగుననే, "గనిమల్లణ్డె త్రించె గుడియు మఠంబునుం గార్త్తికేయునకు" అని యుద్ధమల్లుని శాసనాక్షరపాదమును తెలుగు లాక్షణికులు చెప్పిన లక్షణమునను సరించి,

"గనిమల్లఁ| డె త్రించె | గుడియు | మఠమునుఁ | గార్త్తికే| యునకు" అని చదివి గణవిభజన చేయవచ్చును.

అయితే ఇప్పుడు శాస్త్రులవారు చేసినదేమంటే,:— పైని చూపినట్లే గణవిభజనచేసి అర్ధానుస్వారములకు బదులుగా పూర్ణానుస్వారములే ఉంచి అప్పుడు నిలువుగీతల నడుమను ఏగణములు ఏర్పడునో అవికూడా సూర్యేంద్రగణములుగా పరిగణించవలెను అన్నారు. తెలుగులాక్షణికులమతమున పై పాదములో 'సల, త, న, నల, ర, న' గణము లుండునంటే, శాస్త్రిగారు 'సగ, త, న, ఇగ, ర, న' గణము లున్నవని అంటున్నారు.

ఈలాగుననే శాసనములోని మధ్యాక్కరల పాదములకు గణవిభజనము చేసి శాసనగృహీతగణప్రస్తారము చూపించి, ఆప్రస్తారముబట్టి ఏర్పడిన "ఇనేంద్రగణముల భేదము నంగీకరించి గ్రహించినచో, నిటీవలి మనతెనుఁగు లాక్షణికులు గ్రహించిన

మధ్యాక్కరలక్షణమె పై శాసనాక్కరలకును గుదురుపడును" అని వ్రాసినారు.

వీరిప్పుడు క్రొత్తగా తెచ్చిపెట్టిన గణములు (IUI, IUU; IUUU, IUIU, IUUI, IUII*). కర్ణాట లాక్షణికులు తమ బ్రహ్మ విష్ణు గణములందుగాని, తెలుగు లాక్షణికులు తమ సూర్యేంద్ర గణములందుగాని వీటిని చేర్చుకో లేదు. తెలుగు లాక్షణికులు గ్రహించిన సూర్యేంద్రగణములుమార్చి ఆ తెనుగు లాక్షణికులు గ్రహించిన మధ్యాక్కర లక్షణమె పై శాసనాక్కరలకు కుదురు పడును అని శాస్త్రులవారు వాదించుటవల్ల లక్షణసమన్వయము సిద్ధించినదా ? సూర్యేంద్రగణముల గురించి తెనుగు లాక్షణికులు చెప్పిన లక్షణము కేవలము మధ్యాక్కరలకోసమై మార్చి వ్రాసా క్షరములకు పరమందున్న పూర్ణానుస్వారములను వీలయిన చోట్ల అర్ధానుస్వారములుగా పరిగణించే పూర్వసంప్రదాయ మును పరిత్యజించి శాస్త్రులవారు ఒకక్రొత్తమార్గమును అవలం బించుటవల్ల ప్రయోజనమేమైనా ఉంటే ఆక్షేపణముండకూడదు. వారిమార్గ మవలంబించ వలసినదే అవును. శాసనాక్కరల లక్ష ణము చెప్పడమే ప్రయోజనమంటే, వారీలాగున క్రొత్తమార్గ

* వారివాదము ననుసరించి 'I U II' కూడా ఇంద్రగణములలో ఉండ వలెను. పు. 88 లో ఉన్న ప్రస్తారపట్టికలో లేదు; వ్రాయుమరచినారో ? అచ్చుతప్పో ? వారిమతమున శాసనాక్కరలలో "క్రమంబున। దానిక..." అనేపాదమందీగణమున్నది.

† శాస్త్రులవారు క్రొత్తగా తెచ్చిపెట్టిన ఇసేంద్రగణములు సీసములు మొదలయిన తక్కిన తెలుగుపద్యములందు ఉపచరించునా ?

మవలంబించవలసినంత అవసరము కనబడదు. ఇదివరకున్న సంప్రదాయమును, ఇదివరకు తెలుగు లాక్షణికులు చెప్పిన లక్షణమును (యతివిషయము తప్ప) అనుసరించి చూచినయెడల శాసనములోని మధ్యాక్కరలు సిద్ధలక్షణసమన్వితములై ఉన్నవి.

అయితే నన్నయ మధ్యాక్కరల లక్షణము కనుగొనుట కష్టముగా ఉన్నది గనుక వాటిలక్షణము నిరూపించడమే ప్రయోజనముగా తలచి శాస్త్రిగారు ఈ వాద మవలంబించినారంటే, సంతోషమే, కాని, వారి మనోరథము నెరవేరినట్లు కనబడదు.

"అరుణసరోరుహదళమృదులంబులైన యత్తరుణి"
"పరగనాకారణమున నిట్టి దుఃఖభారముఁ దాల్చె"

ఈపాదములు లోంగలేదని వారే ఒప్పుకొన్నారు.

"అవసరజ్ఞుడైన వేదవ్యాసుడేతెంచె నంతన త్తపసి
కపిల గడ్డంబును గపిల జడలునుం గపిల కన్నులును
తపశి యన్నువపొడవు నల్లని దీర్ఘ తనువు(ను)జూచి
యువిదయు గనుగవమూశి తెరువకయుండె భయమునా"

ఇది తమవద్దనున్న "ప్రతులలోఁ బ్రాచీనవుఁ బ్రతిలోని" దని చూపించి "ఈ పద్యము వెనుక నేనుదాహరించిన శాసనాక్కరల లక్షణమునకు లొంగియే యున్న"దని వ్రాసినారు.

ఇదులో 3-వ పాదము ఎట్లులొంగియున్నదో తెలియదు.

"తపశియు న్నవపాడ వునల్లని దీర్ఘ॥ తనువు(ను) । జూచి."

ఇందులో సూర్యగణముగా ఉండవలసిన 3 వ గణము, ఇంద్రగణముగా ఉండవలసిన 4-వ గణము ఎట్లు కుదిరినవి?

మరియొకవిషయము:—అర్ధానుస్వారములు ఉండదగిన చోట్లకూడా పూర్ణానుస్వారములే పాటించవలె నన్నవాదము శాసనాక్కరల లక్షణము నిరూపించుటకా? నన్నయమధ్యాక్కరల లక్షణము నిరూపించుటకా?

పై పద్యములో మొదటిపాదము శాసనలేఖన సంప్రదాయమును బట్టి, "అవసరజ్ఞుఁడైన వేదవ్యాసుఁడితఁడె నన్తన త్తపసి" అని వ్రాయవలెను. ఇట్లున్నప్పుడు ఇది శాసనాక్కరల లక్షణమునకు ఎట్లు లొంగినది?

నన్నయ మధ్యాక్కరలకోసము ఒకవిధమైన లేఖన సంప్రదాయమున్ను శాసనాక్కరలకోసము మరియొకవిధమైన సంప్రదాయమున్ను గ్రహించవలె ననుటకు తగినఆవశ్యకత కనబడదు. నన్నయవ్రాసిన తాటాకులపుస్తకము మనకు చిక్కదు; గాని, శాసనకాలమునకున్ను నన్నయకాలమునకున్ను అట్టే అంతరము లేనందున ఆకాలపులేఖనక్రమము శాసనములోనున్నట్లు ఉండ వచ్చునని ఊహించుట తప్పుకాదు.

ఈ విషయములన్నీ విమర్శించి చూడగా శాస్త్రులవారు సూచించిన మార్గము నన్నయమధ్యాక్కరల లక్షణము తెలును

కొనుటకు ఉపయోగించలేదు. మొత్తముమీద వారు చెప్పి నట్లు, "దిద్దుబాట్లులేనట్టియుఁ దప్పులకుప్పలు కానట్టియుఁ బ్రతులు దుర్లభంబులై యుండుటచేత నన్నపార్యుని యక్కరలవైఖరి నిర్ణయింప శక్యము గాకున్నది." అనుట ఇప్పటివరకు నిజమే. అయినను విమర్శించి ఊహించుటకు వల్లనయినంతమట్టుకు సంభావ్యమైన లక్షణము నిరూపించుటకు మనము యత్నించవచ్చును.

నన్నయ కన్నడలక్షణము ననుకరించి ఉండునని తేకుమళ్ల రాజగోపాలరావు పంతులుగారు ఊహించిరి. ఇది నాకు సమ్మతమే. అయితే అందువల్ల మధ్యాక్కరపాదములో మూడవ గణము గగమైనా సగణమైనాకూడా కావచ్చును అని మాత్రమే తేలినది. ఎందుచేతనంటే: కన్నడమువారు మధ్యాక్కరకు 4,5 మాత్రల విష్ణుగణములే ఉండవలెనని చెప్పుటచేత అవి మనవారుచెప్పిన ఇంద్రగణములే అయినవి. చివరగణము గుర్వంతమైన అజగణము కావలెనని కన్నడమువారు చెప్పినారు; గాని నన్నయ దానిని పాటించినట్లు కనబడదని వారేటెప్పకోవలసివచ్చినది అని బొడ్డపాటి రాజన్నపంతులుగారు ఆక్షేపించినారు. గాని ఈ ఆక్షేపణమునకు సమాధానము చెప్పవచ్చును. సంస్కృతములో ఉన్నట్లే కన్నడములోకూడా పాదాంతవర్ణము లఘువైనా కావలసినప్పుడు గురువుగా పాటించవచ్చును గనుక తక్కినవిషయములలో కన్నడలక్షణమును నన్నయ అనుకరించినాడని చెప్పినప్పుడు ఈవిషయములోకూడా అతడు అనుకరించి ఉండవచ్చును అని చెప్పుట తప్పుకాదు. దీనిని బట్టి,

నంగురు కులహాని [1]కరుఁడై ధారుణీ+నాథనీ సుతుఁడు
నమరంగ ధర్మువు [2]రక్షిం చుం బ్రీతి+ననిశ త్రులందు

ఇటువంటి పాదములకు లక్షణము కుదిరినది.

ఇంతవరకే రాజగోపాలరావు పంతులుగారు చెప్పినసమాధానము నాకు తోడుపడినది. లక్షణసమన్వయము (అనగా మన తెలుగువారు చెప్పినలక్షణముబట్టి) కాలేదని నేను పైని చూపించిన పాదములలో ఇంకా కొన్ని ఉండిపోయినవి. అటువంటి పాదములకు రాజగోపాలరావుగారు సమాధానము ఏమీచెప్పినట్లు కనబడదు. నేను చూచిననాలుగైదు ప్రతులలోను అచ్చుపడ్డప్రతులలోను ఆపాఠములు కనిపించుచుండుటచేత అవి నన్నయపాఠములే అయియుండుననుట తప్పుకాదు.

అయితే ఇవి ఎట్లు లక్షణ సమన్వితములు కాగలవు? ఇందుకు నేను చెప్పేసమాధానమేమంటే కన్నడ పిరియక్కరలోను తెలుగు మహాక్కరలోను ఒకసూర్యగణము సామాన్యలక్షణము చొప్పున ఉండవలసిన స్థలమందేకాక 2-వ స్థలమందైనా 4-వ స్థలమందైనా ఉండవచ్చును అని ఉన్నది గదా. అట్లే ఈమధ్యాక్కరలోకూడా కవికి స్వాతంత్ర్యముండెనేమో.

---

1. 'కరుఁడయి' అని కొన్ని ప్రతులలోఉన్నది; గాని కరుఁడై అని యైనను ఉండవచ్చును.

2. 'రక్షించుఁబ్రీతి' అని కొన్ని అచ్చుప్రతులలో ఉన్నది గాని వ్రాతప్రతులలో అనుస్వారమున్నది.

నన్నయపాటించిన యతిస్థలమునకు పూర్వము రెండుఇంద్రగణములు ఒకసూర్యగణము మరియొకఇంద్రగణము ఉండవలెనని గదా అనుకొంటున్నాము. ఆసూర్యగణము మూడవచోటనే కాక మరియొకస్థలమునందైనా ఉండవచ్చునని నన్నయ అభిప్రాయమేమో! చూడండి:—

తనదివ్య శక్తిన ప్రాణముల్ విడిచి + తన్మునినాథు
నమరంగ ధర్మువు రక్షించుఁ బ్రీతి + ననిశత్రులందు
గలుగుతె తెంగియు పాయపూ ర్వమున + గడఁగితత్సిద్ధి
అరుణస రోరుహ దళమృదు లంబు + లైనయిత్తరుణి
పరగనా కారణ మునసిట్టి దుఃఖ + భారముదాల్చె
నరిగెనీ శానుది క్కునకునీ యనుజుఁ + డనిలవేగమున
తోనేఁగె నుత్త రముమించి ధర్మని + త్యుఁడుధర్మజుండు
నీవరో తుంబున రాజుగా వలయు + నెమ్మినిట్లేఁగ
ఏమేము మున్నుపూ జింతుము రుద్రు + నిందని వేడ్క

ఇట్లు సమాధానముచెప్పి ఇటువంటిపాదములకు లక్షణము నిరూపించవచ్చును గాని ఇదమిత్థమని చెప్పలేము. చాలా వ్రాతప్రతులు జాగ్రత్తగా పరిశీలించి విమర్శించవలసి ఉన్నది.

"పదుంద్ర బోలెడు..." (అర. II 348) ఈపద్యమున మొదటి రెండు చరణములలోను జగణమున్నది. ఇది మనవారు చెప్పిన సూర్యేంద్రచంద్రగణములలోగాని, కన్నడమువారు

చెప్పిన బ్రహ్మవిష్ణురుద్రగణములలోగాని చేరలేదు. అయితే, "పదుగురు" అన్నపాఠము కొందరిచ్చినారు.

---

## షట్ప్రత్యయములు.

అనంతుడు షట్ప్రత్యయములను సూత్రప్రాయముగా చెప్పినాడు. విద్యార్థులకు సులభముగాను స్పష్టముగాను బోధపడవలెనని వాటిని వివరించి వ్రాస్తున్నాను.

### 1. ప్రస్తారము (చూ. మూ. iii. 66)

అయిదవ ఛందమునకు ప్రస్తార మేలాగుచేయవలెను? మొదట అయిదుగురువులు ఉంచవలెను; దాని క్రింద మొదటి గురువు లఘువుగా మార్చి లఘువుగీత గీచినతర్వాత కడమ వన్నీ మీదిచాలు ననుసరించి గురువులే వేయవలెను. రెండవచాలు చూచి మూడవది, మూడవదానినిచూచి నాలుగోది ఈలాగున కడవరకు వెళ్లవలెను. మీదిచాలున ||ᑌ|ᑌ ఉన్నప్పుడు మొదటి రెండులఘువులున్న గురువులుగామార్చి తర్వాత నున్నగురువు లఘువుగామార్చి, లఘువుకనబడినది గనుక మరి మార్చకుండా మీదిచాలున ఎట్లుంటే ఆలాగున వేయవలెను. అట్లు వేయగా ᑌᑌ||ᑌ ఏర్పడుతుంది.

| | | | |
|---|---|---|---|
| UUUUU | 1 | UUUUI | 17 |
| IUUUU | 2 | IUUUI | 18 |
| UIUUU | 3 | UIUUI | 19 |
| IIUUU | 4 | IIUUI | 20 |
| UUIUU | 5 | UUIUI | 21 |
| IUIUU | 6 | IUIUI | 22 |
| UIIUU | 7 | UIIUI | 23 |
| IIIUU | 8 | IIIUI | 24 |
| UUUIU | 9 | UUUII | 25 |
| IUUIU | 10 | IUUII | 26 |
| UIUIU | 11 | UIUII | 27 |
| IIUIU | 12 | IIUII | 28 |
| UUIIU | 13 | UUIII | 29 |
| IUIIU | 14 | IUIII | 30 |
| UIIIU | 15 | UIIII | 31 |
| IIIIU | 16 | IIIII | 32 |

ఈ 32 లో చివరను గురువుగలవి 16, లఘువుగలవి 16 నాలుగోఛందము ప్రస్తరిస్తే చివరను U గలవి 8; లఘువుగలవి 8 మూడోఛందములో చివరను U గలవి 4; లఘువుగలవి 4; రెండోఛందములో చివరను U గలవి 2; లఘువుగలవి 2; ఈవిషయములన్నీ మీదిపట్టికలో చూచుకోవచ్చును.

2 నష్టలబ్ధి (చూ. మూ IV. 67)

9 వ ఛందమునవుట్టిన 13 వ వృత్తమునకు గణములేవి ?

1౩ రెండుచే భాగించి, భాగించగావచ్చినలబ్ధమును (అరలునిండుగాచేసుకొంటూ) మరల రెండుచేత భాగించవలెను. ఈలాగున భాగించుకొంటూవెళ్లవలెను బేసిసంఖ్య భాగించినప్పుడు గురువున్ను సరిసంఖ్యభాగించినప్పుడు లఘువున్ను పెట్టవలెను.

```
2|13
2|6½=7  —U
2|3½=4  —U
   2    —|
```

```
2|2
2|1   —|
 ½=1—U
```

లబ్ధము ఒకటికాగానే బేసిసంఖ్య గనుకను ఎన్నిసార్లు భాగించినా ఒకటేవచ్చును గనుకను గురువులే పెట్టవలెను.

9 వ ఛందమున పుట్టినవృత్తములలో పాదమునకు 9 అక్షరములుండును. గనుక అందుపుట్టిన 13వ వృత్తమునకు గణములు:—

UUU UU| |UU
త, య, మ

3. ఉద్దిష్టము. (చూ. మూ. III. 68)

UU||U ఈ గణములు గలది ఎన్నో ఛందములో ఎన్నోవృత్తము? అయిదు అక్షరములుగనుక అయిదోఛందము, (సుప్రతిష్ఠ). ఈ అయిదు స్థలములలోను మొదటిదానికింద 1, రెండవదానికింద 2, 3 వ దానికింద 4, 4 వ దానికింద 8, 5 వ దానికింద 16 ఇట్లు ద్విగుణముగా లెక్కవేసుకొని లఘువుల కిందనున్న లెక్కలనే మొత్తముచేసి ఒకటికలపగా వృత్తసంఖ్య ఏర్పడును.

```
U U | | U
1 2 4 8 16   4+8+1=13
```

4. వృత్తసంఖ్య (చూ.మూ. III. 39)

5 వ ఛందమున ఎన్ని వృత్తములు పుట్టినవి ?

5 వ ఛందమున పుట్టిన వృత్తములలో పాదమునకు అయిదక్షరములున్నవి. వాటిలో ప్రతిఅక్షరమున్ను గురువో లఘువో కావలెను గనుక అయిదుసార్లు 2 ఇబ్బడించినయెడల ఎంతవచ్చునో అన్నివృత్తములు పుట్టును $2 \times 2 \times 2 \times 2 \times 2 = 32$

ఆలాగుననే 12 వ ఛందమున $2^{12}=4096$ వృత్తములు పుట్టినవి. 26 వ ఛందమున $2^{26}=6710\ 8864$ వృత్తములుపుట్టినవి.

సమవృత్తములవెరను (చూ.మూ. III. 77) ఈ 26 ఛందములలోను పుట్టిన వృత్తము లన్నీ ఎన్ని ?

$$2^1 + 2^2 + 2^3 + 2^4 \ldots 2^{25} + 2^{26} = 2^{27} - 2 = \underline{134217726}$$

5. లగక్రియచక్రము (చూ. మూ. III. 70-71)

$$\begin{array}{c} 1 + 1 \\ 1 + 2 + 1 \\ 1 + 3 + 3 + 1 \\ 1 + 4 + 6 + 4 + 1 \\ 1 \quad 5 \quad 10 \quad 10 \quad 5 \quad 1 \end{array}$$

ఇదిపాదమున కెన్నెసిలఘువులుగల వృత్తములెన్నెన్ని ఒక్కొక్కఛందమున బుట్టినవో తెలియజేసే లగక్రియచక్రము. మీాది చక్రములో అయిదవఛందమువరకు ఉన్నది. అయిదవచాలున కనబడే 1,5,10,5,1 అనేఅంకెల అర్థమేమంటే, ఒక్కలఘువైనా లేక అన్నిగురువులు గలవృత్తము 1; ఒక్కలఘువుమాత్రమే కలవృత్తములు 5; రెండులఘువులుకలవి 10; మూడులఘువులు కలవి 10; నాలుగులఘువులుకలవి 5; అయిదున్ను లఘువులే అయినవృత్తము 1; మొత్తము 32.

ఈలాగుననే మీాది వరుసలలో మొదటిఛందమునుండి నాలుగోఛందమువరకు పైని చెప్పినవిషయముల వివరణ ఉన్నది.

అయితే మీాది వరుసను బట్టి కిందివరుసవేసుకొంటూ ఉంటేనేగాని 8 వ ఛందములోనో 16 వ ఛందములోనో మరియేదైనా ఛందములో ఈవృత్తములసంఖ్యలు తెలియజేయుట కష్టము; గనుక, ఇంగ్లీషుబడులలో చదువుకొనే విద్యార్థులు ఈ విషయములను తెలుసుకొనుటకు ఒకసులభమైన మార్గమున్నది. దీనినిబట్టి అడిగిన ఛందముగురించి ఈవిషయములు వెంటనే చెప్పగలము ఉ॥ పదియవ ఛందములో ఎన్నెన్నిలఘువుల వృత్తములెన్నెన్ని ఉన్నవి?

$$(\text{గు}+\text{ల})^{10}=1\text{గు}^{10}+10\text{గు}^{9}\text{ల}^{1}+45\text{గు}^{8}\text{ల}^{2}+120\text{గు}^{7}\text{ల}^{3}+210\text{గు}^{6}\text{ల}^{4}+252\text{గు}^{5}\text{ల}^{5}+210\text{గు}^{4}\text{ల}^{6}+120\text{గు}^{3}\text{ల}^{7}+45\text{గు}^{2}\text{ల}^{8}+10\text{గు}^{1}\text{ల}^{9}+1\text{ల}^{10}$$

1గు$^{10}$ అంటే 10న్ని గురువులే అయినవృత్తము ఒకటి
10గు$^{9}$ల అంటే 9గురువులున్ను 1 లఘువున్ను అయినవి 10
45గు$^{8}$ల$^{2}$ అంటే 8 గురువులున్ను 2 లఘువులున్ను ఉన్నవి 45

ఈలాగుననే కడమవి తెలుసుకోవచ్చును.

6. సగణలగక్రియ శకటచక్రము. (చూ.మూ.III.72-76)

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ఇది పాదములో అన్నీ గురువులే కలవృత్తము (1) | | | | | | | | | |
| 2 | 3 | 5 | 9 | 17 | ఇవి 1 లఘువుగలవృత్తములు (5) | | | | | |
| 4 | 7 | 13 | 25 | 6 | 11 | 21 | 10 | 19 | 18 | ఇవి 2 లలుగలవి (10) |
| 8 | 15 | 29 | 14 | 27 | 2[illegible] | 12 | 23 | 22 | 20 | ఇవి 3 లలుగలవి (10) |
| 16 | 31 | 30 | 28 | 24 | ఇవి 4 లలుగల వృత్తములు (5) | | | | | |
| 32 | ఇది 5 లలుగల వృత్తము. | | | | | | | | | |

ఈ చక్రము వేసేపద్ధతి:—

నిలువుగా ఉన్న మొదటిఆరుగళ్లలోను—1,2,4,8,16,32 ఇట్లు సంఖ్యలు ద్విగుణముగా వేయవలెను. తర్వాత అడ్డుగా ప్రతి సంఖ్య ద్విగుణముచేసి ఒకటి కొట్టివేస్తూ అట్లుచేయగా వచ్చిన సంఖ్యప్రక్కను మళ్లీ అట్లే చేస్తూ వేయవలెను. ఈఛందమున 32 వృత్తములకంటె ఎక్కువ పుట్టవు గనుక 32కు మించేసంఖ్య వేయరాదు. ఇట్లు చేసినతర్వాత పైచాలున ఉన్నసంఖ్యలు క్రింది చాలున ద్విగుణముచేసి వేయవలెను. ఈసంఖ్యలలో ప్రతిదాని ప్రక్కను అది ద్విగుణముచేసి ఒకటి కొట్టివేయగా వచ్చినసంఖ్య

వేయవలెను. దానిప్రక్కను మళ్లీ అదేవిధముగా సంఖ్యలువేస్తూ ఉండవలెను. ఎన్నో ఛందమునకు ఈ చక్రము వేస్తున్నామో చూచుకొని అందులో ఎన్నివృత్తములు పుట్టినవో ఆసంఖ్యకు మించకుండా అంకెలు వేసుకొంటూ వెళ్లవలెను.

కొన్నివృత్తముల లక్షణమును లాక్షణికులు వివిధముగా చెప్పినారు. చూడండి:—

## 1. క్రౌంచపదము.

1. క్రౌంచపదా భ్మౌస్భౌ ననా న్గా¹విషు శరవసుముని విరతిరిహ భవేత్

U I I  U U U  I I U  U I I  I I I  I I I  I I I  I I I  U

భ   మ   స   భ   న   న   న   న   గ

(ఇది సంస్కృతవృత్తలక్షణము.25వ ఛందము 16776391వ వృత్తము)

2. శీతకరోర్వీవాతశ+శాంకర్ యుగమితసురపురనివహాద కడెయోళ్ (ఇది కన్నడపద్యలక్షణము. ఇందులో విశేషము:— ప్రతిపంక్తిలోను ప్రాసయతి. తక్కినలక్షణము సంస్కృతమందున్నట్లే ఉన్నది)

3. పంచశరాభా+నంచితపుణ్యా+భమసభననయ+పరిమితమైనర్ (కవిజనాశ్రయము)

4. ప్రాంచిత తేజః + కుంచితవైరీ + భ్రమసభనననయ + పరిచితరీతిః (కావ్యాలంకారచూడామణి.)

5. కాంచనభూషా + సంచయ మొప్పఁ + ఘనకుచభరముచే + గవునసియాడఁ (ఛందోదర్పణము).

పై మూడింటిలో (౩, 4, ౫) లక్షణము మారినది. ఈ లాక్షణికులు దీనిని 24 వ ఛందమునందు పుట్టిన 419:479 వ వృత్తముగా చెప్పినారు. సంస్కృతములోను కన్నడములోను పాదాంతమున ఉన్న ।।౹ మార్చి ౹౹ చేసినారు. మాత్రలసంఖ్య ఒక్కటే గనుక నడకలో భేదము కనబడదు. కన్నడపద్యమువలెనే ప్రతిపాదమునందున్న ప్రాసయతి ఉన్నది; అంతేకాక తెలుగు పద్యముల సంప్రదాయ మనుసరించి మొదటి అక్షరముతో రెండు చోట్ల వడి ఉన్నది.

6. పంచమకేశుం డిచ్చినభాస్వ + ద్వరమున మనమున + బవరముగోరఁ

పంచనతో బాణాసురుహస్త + వ్రజములు. ... ...

(ఇది అప్పకవిది. తక్కిన లాక్షణికులు చెప్పిన ప్రాసయతి ఇతడు పాటించలేదు.)

7. తావులు గీరం + బూవులవానల్ + దలుచుగఁ గురియఁగ + దతఘనభేరుల్ (ఇది కంకంటి పాపరాజు ఉత్తరరామాయణములోనిది. అప్పకవి కాక తక్కిన తెలుగులాక్షణికులు చెప్పినట్టే ఉన్నది.

8. చంచలనాస్వ+దించుచు లేఁదూం+డ్ల కరువుప్రియ
లకు+నలఁచుచుమైరో
మాంచము. ... (నన్నెచోడుని కుమారసంభవము.)

ఇందులో విశేషమేమంటే అప్పకవికాక, తక్కిన తెలుగు లాక్షణికులున్ను కన్నడలాక్షణికులున్ను చెప్పినట్లు పాదములందు ప్రాసయతి ఉన్నది; కాని తెలుగు లాక్షణికులు చెప్పిన వడి నియమము పూర్తిగా లేదు. పాదద్వితీయార్ధమునగల విశ్రమస్థానముల రెంటను ఉన్నవడి అక్షరములు తమలో తాము మైత్రి గలవేగాని పాదాద్యక్షరముతో మైత్రి గలవి కావు గనుక నన్నెచోడునిపద్యము వృత్తముకాదనిన్ని మాత్రాపద్యమనిన్ని సీసమువలె నున్నదనిన్ని అందుచేత "ఇది నన్నెచోడుని ప్రాచీనతకొక గొప్పకానుక" మనిన్ని మా. రామకృష్ణకవిగారు వ్రాసినారు. వృత్తముల కుండవలసిన ముఖ్యలక్షణము ఉన్నది గదా ఇది వృత్తముకాదని కవిగారు ఎట్లు చెప్పగలరు? నాలుగుపాదములందున్ను గణము ఒకేరీతిన ఉన్నవి. (మాత్రాపద్యములందు అన్నిపాదములలోను గణము లొక్కరీతిగా నుండనక్కరలేదు.) తెలుగుకన్నడపద్యముల సంప్రదాయ మనుసరించి నాలుగుపాదములలోను ద్వితీయస్థలమున ప్రాసమున్నది. లయగ్రాహి మొదలయిన ఉద్ధురమాలావృత్తములలో ఉన్నట్లు ప్రతిపాదమున కొంతవరకు ప్రాసయతి ఉన్నది. జాత్యుపజాతులు మొదలయిన దేశ్యపద్యములలో చేరదు. ఇది ఒకరీతిక్రౌంచపదము; దీనికి సరియైనలక్షణము ఏలాక్షణికుడున్ను చెప్పలేదు.

## II త్రిభంగి.

ఈగ్రంథమందు మూలమున (చూ. II. 134) త్రిభంగి వృత్తము అచ్చుతప్పులతో నిండియున్నది. సరియైనపాఠము:—

ననన నససస+లను భమసగలును+
దనరి నటింపఁ గణాంకఁ నలువంకఁ బెంపు దొలంకఁ
మునుకొని నఖముఖ+మున వెడఁగ దలుపఁ+
జనుగడు నొప్పగువీణాల్ నెరజాణల్ వేలుపుగాణాల్
వనరుహజనితుని+తనయులు మొదలుగ+
ఘనమతు లాదటతోడఁ శ్రుతిగూడఁ వెన్నునిబాడఁ
వినగలిగిన నది+జననము ఫలమని+
మునిజను లిందు శుభాంగుఁ దగుభంగిఁ జెప్పఁ ద్రిభంగిఁ.

పాదమునకు 34 అక్షరములు; 42 మాత్రలు; పూర్వార్ధమున ప్రాసనియతి, పశ్చిమార్ధమున మూడుచోట్ల అంత్యప్రాసనియమము ఉన్నవి. కావ్యాలంకారచూడామణి అప్పకవీయములలోసైతము ఇట్లే ఉన్నది. కాని, కవిజనాశ్రయములోని త్రిభంగి ఇందుకు భిన్నముగా ఉన్నది.

నననసలును సవభములును సగయుక్తము లైనఁ
మృదువైనఁ బ్రస్తుతమైనఁ
వనరుహభవనిభ! మనమలరఁ ద్రిభంగిని జెప్పఁ
వడి దప్పఁ బ్రాసము లొప్పఁ.

ఇందులో పాదమునకు 28 అక్షరములు; 36 మాత్రలు ఉన్నవి. పాదమున ప్రాసయతి నియమములేదు; మూడుచోట్ల అంత్యప్రాసనియమము మాత్రమున్నది.

## నడక.

కోట్లకొలది వృత్తములుపుట్టినా లాక్షణికులు సుమారు 200 వృత్తములకంటె ఎక్కువ పేర్కొలేదు. వాటిలో సుమారు 30 కంటె ఎక్కువగా కవులు వాడడములేదు. ఎందుచేత ? లాక్షణికులు చెప్పిన లక్ష్యలక్షణపద్యములు చూచినా కొన్నివృత్తములనడక తెలియదు. పద్యములనడక ఏలక్షణముబట్టి ఉండునో ఆలక్షణరహస్యము తెలిసినయెడల వేలకొలది క్రొత్తక్రొత్తవృత్తములను ప్రస్తరించి తీయవచ్చును. ఆరహస్యము తెలియకపోవుటకు మన గణవిభజనసంప్రదాయము ముఖ్యమైనకారణము. మూడేసిఅక్షరములు గణమంటే గణవిభజన పద్యము నడకబట్టి ఉండడ మసంభవము. నడకబట్టి గణవిభజనము ఉంటేనేగాని గణవిభజనప్రయోజనము కనబడదు. కొన్నివృత్తములు చక్కగా నడిపించుటకు వీలున్నా లాక్షణికులు తమలక్ష్యపద్యములు వ్రాయవలసినట్లు వ్రాయకపోవడముచేత కవు లావృత్తములను చెప్పడములేదు. అందుకు అనేక ఉదాహరణములు చూపించవచ్చునుగాని ఈపీఠికలో అవకాశము చాలదు గనుక మూడు మాత్రమే చూపిస్తున్నాను.

(1) <u>పాలాశదళము</u> (దీనికే 'త్వరితగతి' యనికూడా పేరున్నది.

అదనదనున హరినుతు+లమరు ధరఁ జాలా
శదళ మనఁ దనరుఁ గవి+జనులు వచియింపఁగ
బదునొకఁ డగునెడ యతి+పదిలమునఁ జేరఁగ
గదియు నగణము లయిదు+గగము తుదనొందఁగ.(అప్పకవి)

ఇంతకంటె అనంతుడు చెప్పినది బాగున్నదిగాని అందులో రెండవపాదము నాల్గవపాదము నడకచెడి యున్నవి (చూ. మూ. II.84) ఎట్లుండినయెడల నడక బాగుండునో తెలియజేస్తున్నాను:-

అయిదులము లయిదులము;+లయిదులములుఁగా
లయుఁజనును ద్వరితగతి;+లములు పదిసాగఁగ
నియమమున వడియమర+నిలుచు శ్రుతికింపై
కయితలను దనరునిది+ఖగతురగశౌరీ.

## 2. విచికిలిత.

ప్రలయసమయమునను బద+పడి జలనిధినడుమ న
ద్భువనములు కడుపున నిడుక+భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకు వరదుఁ+డని విచికిలితఁ బదుమూఁ
డవ యెడ వడి యిరువదియొక+లఘువు గము బలుక నగుఁగ.
(అప్పకవి)

ఇటువంటి లక్ష్యలక్షణపద్యముబట్టి దీనినడక ఎట్లు తెలుసుకోగలము? ఇందులో 21 లఘువులున్న చివరను గురువున్న

ఉన్నవి గనుక "తిశ్రగతి"ని *నడిపించవచ్చును. ఏడుహగణము లున్నా గురువున్నా కలది సుగంధి ఏడునగణములున్నా గురువున్నా కలది విచికిలిత హగణనగణములలో ఏవైనా ఏడున్నూ గురువున్నూ కలది ఉత్సాహము. విచికిలిత నడక ఎట్లుండదగునో చూడండి:—

మునుల వలపు నబల బలము+ముదిమి సొగసు కలసిరుల్
చెనటి హితము విషము రుచియు+చెఱలసుఖము పగహితుల్
తనివి తృషను కపికి స్థిరత+తమికి వెలుఁగు సెగవగల్
శనికి సుకృతి శిలల రసము+నవతి చెలిమి కలుగునే.

౬. తురగము.

ననననసజజగలు తిథివిరమ+ణం బగు స్తురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన+గాంచి తానొక రుండెదు
రొక్కనిదవులకుఁగొనిచనిగిరిగుహఁ+గూర్కనాముచికుఁడుచే
తను యవనునిఁ బొరిగొని వని వసు+ధన్గణింతుసుభూసురుల్
(అప్పకవి)

దీని నడకతీరు ఈలక్ష్యమునుబట్టి కనుగొనుట శక్యమా?

నసల యుగళము హభము రగణము+నాల్గుపంక్తులొప్పగాఁ
దనరు విరమము నసల యుగళము+దాటగాఁ దుగంబునన్.

* అనగా మూడుమాత్రలకు విరుగుతూఉంటుందని భావము. త్రి+అస్ర=త్ర్యస్ర అని ఉండవలెనుగాని సంగీతపుస్తకములలోని వ్యవహారము ననుసరించి 'తిశ్ర' అని వాడినాను.

ఈలాగున లక్ష్యలక్షణపద్యమున్న యెడల ఈతురగవృత్తము తరళ మత్తకోకిల కరిబృంహిత వృత్తములవలె నడుచునని సులభముగా తెలుసుకోవచ్చును.

జాగ్రత్తగా విమర్శించి చూచినయెడల చక్కగా నడిచే పద్యములన్నీ ఏదో ఒకతాళమునకో ఒకలయకో సరిపడి ఉంటవి. విషయము బోధపడెవలెనని కొన్నిమాత్రమే ఉదాహరిస్తున్నాను.

1. త్రిశ్రగతిని నడిచేవి (అనగా మూడుమాత్రలగణములు గలవి) ఉత్సాహము, సుగంధి, విచికిలిత మొదలయినవి.

2. తిశ్రగతిని ఎదురుగా నడిచేవి (అనగా మృదంగ వాద్యములో ఎదురు వాద్యమువలె నడిచేవి) వీటిలో లఘువు తర్వాత గురువువచ్చును.

సుకాంతి, ప్రమాణి, పంచచామరము మొదలయినవి. ఉ. "ఇదే యసీ౯ మదాన్వితు౯ సుదేవుని౯ వధించెద౯"

౩. చతురస్రగతిని నడిచేవి (అనగా నాలుగుమాత్రల గణములు గలవి మత్త, తోదకము, ప్రకరణకలిత, మానిని, కవిరాజవిరాజితము, సరసిజము, క్రౌంచపదము మొదలయినవి; ఇవిగాక ఇంకా ఈగతిని నడిచే వృత్తములు వేలకొలదిప్రస్తరించి తీయవచ్చును.

ఇందుకు తార్కాణముగా పదియవఛందములో చతురస్రగతిని నడిచేపద్యము లెన్నిగలవో చూడండి:—

ఈ ఛందములో 16 మాత్రలుండి గుర్వంతముగా ఉండే వృత్తములు 126. వీటిలో నూరుపద్యములు చక్కగా నడుచును. అన్నీ ఇక్కడ చూపించుట కవకాశములేదు గనుక కొన్ని మాత్రమే చూపిస్తున్నాను.

వృత్తసంఖ్య.

(1) IIII UU UU UU నలగగగాగాల్ + నాళీకాక్షా (16)
(2) UII IIU UU UU క్రాలునుభసముల్ + గాగాల్ పంక్తిఁ (31)
(3) UU IIII UU UU గాపై నలగగ + గంబుల్ రెండుఁ (61)
(4) UU UII IIU UU ప్రాలుఁ గాభస + గగముల్ పంక్తిఁ (121)
(5) UU UU IIII UU గాగా నల్గాల్ + క్రమమున నిల్చుఁ (241)
(6) UU UU UII IIU పంక్తిఁ గాగా + భంబుసగణముఁ (481)
(7) IIU IIU UU UU ససగా గగముల్ + సాగుఁ శౌరీ (28)
(8) UII UII UU UU భాగగగాల్ చను + పాదంబందుఁ (5[illegible])
(9) UU II IIU UU గాసా గగముల్ + గలుగుఁ బంక్తిఁ (109)
(10) UU UII UII UU గాభా గాలయి + గ్రాలుఁ శౌరీ (217)
(11) UU UU IIU IIU శౌరీ గాగా + ససముల్ వరలుఁ (433)

4. చతురస్రగతిని ఎదురుగా నడిచేవి. (అనగా జగణములు గలవి) ప్రమితాక్షరము, జలోద్ధతగతి, మంజుభాషిణి మొదలయినవి.

5. ఖండగతినినడిచేవి (అనగా 5 మాత్రల గణములుగలవి). త్వరితగతి, పద్మనాభము, లయగ్రాహి, దండకము మొదలయినవి.



6. ఖండగతిని ఎదురుగా నడిచేవి. (అనగా యగణములు గలవి). భుజంగప్రయాతము ఇటువంటివి అనేకముగా లేవు.

7. రూపకతాళమునకు సరిపడే వృత్తములు (అనగా మాత్రలకు విరుగుతూ నడిచేవి).

మదరేఖావృత్తము:— ఇట్టివి అనేకముగా లేవు; గాని, కావలసినన్ని సులభముగా కల్పించవచ్చును. చూడండి:—

I. అనుసారిణి యనువృత్తం + బగునతిధృతి యనుఛందం
బున రూపక మను తాళం + బున నడుచును శ్రుతి కింపై
చను నాలుగుచరణంబుల్ + సన యనసన గము లొప్పన్
సనయంబులు చనునంతన్ + జరణములను వడి నిల్చున్.

II. రూపక మనుతాళంబున + ద్రుతలఘువులు చనుచుండున్

III. నలగము పై సగమొప్పన్ + నలగమముల్ జోడింపన్

IV. క్రాలున్ తల నలలల మస + గంబుల్ పాదములందున్

V. కల్యాణిన్ మనలలలస + గభగంబుల్ పాదములన్

ఈలాగున క్రొత్తక్రొత్తవృత్తములను ఎన్నైనా తీయవచ్చును.

8. మిశ్రగతిని నడిచేవి (అనగా 3+4 మాత్రలకు విరుగుతూనడిచేవి).

మత్తకోకిల, తరళ, తురగము మొదలయినవృత్తములు;

వృషభగమన, హరిణగతిరగడలు (గురుజాడ అప్పారావు గారి ముత్యాలసరములు మొదలయినపద్యము లీగతిని నడుచును).

9. త్రిపుటతాళమునకు (చతురస్రగతి తిశ్రజాతి త్రిపుట 4(3+2+2)=28)

ఉత్పలమాల, చంపకమాల నడుచును.

10. ఆదితాళమునకు (చతురస్రగతి చతురస్రజాతి త్రిపుట) కందము, సరసిజము, క్రౌంచపదము మొదలయినవి.

ఈలాగున ఇంకా విమర్శించి చెప్పవచ్చును.

పాదమందుండే అక్షరముల సంఖ్యబట్టి ఛందము లేర్పరిచి ఆఛందములలో ఒకొక్కటి ప్రస్తరించి వృత్తములు కల్పించడమువల్ల ప్రయోజనము విశేషముగా కనబడలేదు. అంతకంటె శ్రుతి కింపుకొలిపే నడకకు ఆధారమైనలక్షణముబట్టి తిశ్రగతిచ్ఛందము, చతురస్రగతిచ్ఛందము మొదలయినఛందములేర్పరిచి పద్యములు చెప్పుటవల్లను ప్రయోజనము విశేషముగా ఉండుననిన్ని అట్లు ఏర్పడిన పద్యములు తెలుగుభాషకు అమరి ఉండుననిన్ని నాయభిప్రాయము. వృత్తములలో ప్రతిపాదములోను గణములవగున ఒక్కలాగుననే ఉండవలెనన్న నిర్బంధ మున్నది. దానివల్ల ప్రయోజనమేమో!

అయితే లయకు సులువుగా విరిగేటట్లున్న పద్యములకంటె లయ ఉండిన్నీ కనబడకుండా ఉండేపద్యములు అప్రతిహత

మైన నడకకు అనుకూలముగా ఉంటవి. ఇటువంటివి ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము. ఇవి ఏదో ఒక తాళము నకు లొంగే ఉన్నవి.

ఉత్పలమాల చంపకమాలపాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపుటతాళమునకు సరిపోవును. శార్దూలమత్తేభములు మత్యతాళమునకు చదువవచ్చును.

ఇటువంటివృత్తములు విశేషముగా లేవు. ప్రస్తరించి కల్పించుట కూడా కష్టముగానే ఉన్నది. శోధనకోసము నేను వ్రాసినవాటిలో ఒకటి చూపిస్తున్నాను.

కవికాంత.

శూరుఁడు వీర్యపరాక్రమోన్నతుఁడు +
  సుశ్లోకుండు జనార్దనుండు కం
సారి మురాసురవైరి మాధవుఁడు +
  సౌమ్యుండంచు హరి న్నుతింపఁగా
భారనము స్జగ ముంచి విశ్వయతి +
  పాటింపన్ గవికాంత యాకృతిన్
సూరిజనస్తుతవృత్తమై తనరు +
  సొంపారన్ గవి చెప్పఁ గల్గినన్.

ఇది ఆకృతి యనే 22 వ ఛందమున పుట్టిన 141279 వ వృత్తము. ప్రతిపాదము చతురస్రగతి ఆదితాళమునకు సరిపోవును

పరిచితిగలవృత్తములవలె చదువబోయినవారికి నడక చెడినదన్న భ్రమకలుగునుగాని రెండుమూడుసార్లు చదివిన పిమ్మట దీనినడక పట్టుపడగలదు. దీనిలో మొదటనున్న భగణము నలముగాను యతి స్థానమందున్న మగణము సగముగాను మార్చి క్రొత్తవృత్తములు చేసుకోవచ్చును; దీనివలెనే నడిచేవృత్తములు మరికొన్ని చెప్ప వచ్చును.

ఈకవికాంతాపాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపు టతాళమునకు (అనగా క్రియకు నాలుగు అక్షరములు చొప్పున ఆదితాళము $4 \times (4+2+2)=32$ సరిగా నడుచును.*

టి ప్ప ణి.

I. 7. "లఘువగు...యొకమాత్ర; గురువు నొదవు ద్విమాత్రక" ఈవిషయమునుగూర్చి జయంతి రామయ్యపంతులుగారు వ్రాసినది అశాస్త్రీయము.

"వ్యంజన మర్ధమాత్ర యనున్యాయముచే 'వనితక' అను నప్పుడు 'తక' అనుగురువు సార్థమాత్రక మగును; 'అనగాక' అనుచో "గాక" అనుగురువు సార్థద్విమాత్రకమగును" అని వ్రాసినారు.

---

* ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో "ఛందోరహస్య దర్పణము—పద్యరచనావ్యవస్థ" అనుపేరుగలవ్యాసములో ఇక్కడ సంగ్రహించిచెప్పిన విషయములు కొన్ని విపులముగా చర్చించినాను.

ఈసందర్భమున "మాత్రా" పరిమాణము అచ్చునుగూర్చి చెప్పవలెనుగాని వ్యంజనమునుగూర్చి చెప్పకూడదు. అచ్చులబట్టి (syllables) అక్షరము లేర్పడునుగాని, వ్యంజనములబట్టి ఏర్పడవు. 'భ్రన్' లో ఎన్నివ్యంజనములున్నా అచ్చు ఒక్కటే గనుక అది ఒక్క (syllable) అక్షరమనే చెప్పవలెను.

'వనితన్' అనునప్పుడు చివరనున్న హ్రస్వాచ్చుపై నిల్చిన నకారహల్లు ద్విగుణోచ్చారణకలదియని చెప్పవలెను; గాని దానికి మాత్రాపరిమాణము చెప్పకూడదు. 'అనగాన్' అనునప్పుడు దీర్ఘాచ్చుపైనున్న నకారహల్లుకు ఈద్విగుణోచ్చారణములేదు. ఎంతమట్టుకు అజ్ దీర్ఘోచ్చారణప్రయత్నము ఎక్కువై ఉంటుందో అంతమట్టుకు వ్యంజనద్విగుణోచ్చారణప్రయత్నముతగ్గును. గనుక 'తన్' 'తాన్' 'తంత్రి' 'తాంత్రి'—వీటి అన్నిటిలోను తకారముపైనున్న అచ్చు రెండుమాత్రల గురువేగాని భిన్నముకాదు. అయితే వీటిలో వ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు ఎందుకు రెండుమాత్రల గురువైనదంటే:—ఎప్పుడైనా ఉచ్చారణప్రయత్నమును బట్టి అచ్చుకు మాత్రాపరిణామము చెప్పవలెను. 'తన్' అనునప్పుడు తకారముమీది అకారము ఉచ్చరించినప్పుడు వెంటనే నకారోచ్చారణ చేయవలసివచ్చుటచేత స్వరోచ్చారణ ప్రయత్నము ద్విగుణమైనది. అందుచేత 'తన్' రెండుమాత్రల గురువుగా చెప్పవలెను.

I. 20 ఈపద్యములో నాల్గవపాదము చక్కగా అర్థముకా లేదు. "నగణ పునరుక్తి నొక్కటి డిగియె" అంటే చంద్రగణ

ములు ప్రస్తరింపగా కడపటి ||||| (నలలము) ఒకలఘువు తక్కు-
వగా రెండునగణములని అర్థముకావలెను.

“ఇరువది తొమ్మిదింట” అంటే అర్థము పొసగలేదు.

21-22. “ఈపద్యములకు నర్థము సంశయముగా నున్న” దని 6 వ పుట అడుగున మూలములో ఉన్నది. అయితే 21 వ. పద్యము పరవస్తువారి ప్రతిలో.

క. జగణము నలమగు గగములు
భగణము లగుగలము నగణభావంబు గనన్
సగము నగణవగణము లగు
తగణము భలమగును సంయుతముఁ దీర్చినచోన్.

అని ఉన్నది. దీని అర్థము స్పష్టము. |∪|=||||; ∪∪=∪||; ∪|=|||; ||∪∪=||||∪; ∪∪|=∪|||.

22-వ పద్యము పైపద్యములోని విషయములకు ఉదాహరణములుగలదిగాని అర్థము పొసగలేదు.

మొగిళులు నలమగు, నిటులన్
నగణము నగణమగు నిటుల + నంగునితంద్రీ
భగణము పాళు లనంగా
తగణము వాకిళ్లు భలము వాకిళు లనఁగన్.

అని ఉంటే అర్థము కావచ్చును. పరవస్తువారిప్రతిలో మొదటిపాదమున్ను, రెండవపాదములో యతిస్థానమువరకున్ను

నే నుదాహరించినట్లే ఉన్నది; తర్వాత మూలములో ఉన్నట్లే ఉన్నది.

67. "దశరథాత్మజుఁడు స్వామి ధాత్రి కనఁగ" ఇందులో ద్విత్వమునకు పూర్వమందున్నది గనుక 'డు' ఊది పలుకవలెననిన్ని గురువుగా పలుకవలెననిన్ని అనంతుడు వ్రాసినాడు; గాని ఇది ఇతరలాక్షణికుల సమ్మతముఁ కాదు. తెలుగులో పదాదినున్న ద్విత్వమునుబట్టి వ్యస్తముగా ఉన్న పూర్వపదాంతవర్ణము గురువు కాదని తక్కినలాక్షణికుల మతము.

94. టీక వ్యావహారిక భాషలోనే ఉన్నది.

"....యిరువదిన్ని...స్వరయతిరైనాను, వ్యంజనయతియైనాను ప్రయోగించతగును" అనే ఉన్నది. ఇందులోనే కాదు. అప్పకవీయము మొదలయినలాక్షణిక గ్రంథము లన్నింటిలోను ఇట్లే వాడక భాషను టీకలు వ్రాసినారు. అనవసరముగా నిరాధారముగాను భాషమార్చి అచ్చువేయడము ఆచారమైనది.

101. ఈపద్యము మూలములో తప్పుగా ఉన్నది. సరియైనపాఠము:—

"తే. అట యనంగను బోవుట+కర్థమైన
సంధి నిత్యసమాసో క్తి+జరుగురెంట
ననుగవీరుల నెల్ల ను+క్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నే+పటిచె ననఁగ"

ఈ పాఠము అప్పకవీయములో ఉన్నది. (చూ. వావిళ్ల వారిప్రతి పు. 142)

IV. 22 వ పద్యమైన తర్వాత పరవస్తువారి ప్రతిలో ఈ క్రిందిపద్య మున్నది.

> కోమటేంద్రునాఁగ భూమితీరనఁ బలు
> గ్రహము లనఁగ వానకాల మనఁగ
> వైరివర్గమైన వదల రిట్టివి లోక
> రూఢిఁ జెల్లు నని సరోజనాభ.

IV. 107 "తనరఁగ అఆ ఇఈలనఁగా ఉఊలు నాఁగ...." ఈపద్యములో హ్రస్వాక్షరములే అయినా 'అ' 'ఇ' 'ఉ' 'ఋ' గురువర్ణములుగానే ఉచ్చరించవలెను. అది ఎట్లు జరుగునంటే: ఈ హ్రస్వాక్షరము లుచ్చరించిన తర్వాత ఏకలఘుమాత్రాకాలము ఊపిరి ఆపి, ఆ బిగపట్టి పైవర్ణము లుచ్చరించుటచేత, ఈహ్రస్వాక్షరోచ్చారణలో ద్విమాత్రోచ్చారణ ప్రయత్నము జరిగినది.

అంతేకాని పరమందున్న 'ఆ' అనే అచ్చు ద్విత్వాక్షరమువలె ఉచ్చరించుటచేత పూర్వమందున 'అ' గురువు అగునని జయంతి రామయ్యపంతులుగారు చెప్పినసమాధానము అశాస్త్రీయము. అచ్చువిషయమున ద్విత్వాక్షరోచ్చారణమంటే దీర్ఘోచ్చారణమని చెప్పవలెనేకాని వ్యంజనములవిషయమై చెప్పిన అ

క్షముపొసగదు. ద్విత్వవ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వా చ్చు గురువు కాగలదుగాని కేవల దీర్ఘాచ్చునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు గురువు కాలేదు.

ఈ ఛందోదర్పణమునకు ముఖబంధనముగా ఉపోద్ఘాతమును వ్రాయవలసినది అని నన్ను కోరి గౌరవించినందుకును ఛందోవిషయములగూర్చి నా యభిప్రాయములను తెలియజేయుటకు నాకవకాశము ఇచ్చినందుకును నామిత్రులు బ్రహ్మశ్రీ, వావిళ్ల. వేంకటేశ్వరులుగారికి నాకృతజ్ఞతావందనములను సమర్పించుకొంటున్నాను.

ఇట్లు,

పర్లాకిమిడి.
1—6—1921.

గిడుగు వేంకట సీతాపతి,
పర్లాకిమిడి రాజావారికాలేజీలో లెక్చరరు.

శ్రీరామాయనమః.

# ఛందోదర్పణము

## ప్రథమాశ్వాసము.

ఇష్టదేవతాస్తుతి

శ్రీరామాస్తనమండలీమిళితకా
శ్మీరాద్రివక్షంబుతోఁ
బారావారతరంగసంగతలస
త్పర్యంకనాగంబుపైఁ
గారుణ్యామృత పూరపూరితకటా
క్ష శ్రీలఁ బెంపొందుగం
భీరస్వాంతుఁ డనంతుఁ డాశ్రితజనా
భీష్టప్రదుం డెల్లెడన్. 1

చ. అతనిదశావతార విభవాతిశయంబున లోకమెల్ల శా
శ్వత మగుచాడ్పునన్ భజన సమ్యతరంగ దశాక్షరాభిశో
భితమగువాక్ప్రపంచ మది పెద్దయుఁ బ్రస్తుతి నొందునట్టిచో
నతఁడును నమ్మహాక్షర చయంబుజయంబునొసంగుఁగావుతన్.

క. శ్రీవల్లభుయతిగణసం
సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురునలఘుచ్ఛం
దోవినుతు ననంతశయను దోయజనాభున్. 3

క. ఛందోరీతిగవిమల
చ్ఛందుఁ డనంతుం డొగిం బ్రశంసించి కృపా
మందిరులగు శ్రీమద్గో
విందగురుప్రభులదయఁ బ్రవీణుండగుచున్. 4

ఛందః ప్రాశస్త్యము.

క. విద్యలలోపల నుత్తమ
విద్యకవిత్వంబు మఱి కవిత్వముఛందో
వేద్యము గావునఁ జెప్పెను
హృద్యంబుగఁ గవిశచందమేర్పడఁగృష్ణా! 5

---

# సంజ్ఞాప్రకరణము.

గద్యపద్యలక్షణము.

గీ. పరఁగుఁగవితగద్య పద్యంబు లన ; పాద
కల్పనంబువలదు గద్యమునకు ;
పాదనియతినొప్పుఁ బద్యంబు ; లవియు వృ
త్తములుజాతులనఁగ నమరుఁగృష్ణ. 6

### గురులఘునిర్ణయము.

క. వృత్తంబులుగణబద్ధము
లుత్తమమగుజాతులెల్ల నొనరఁగ మాత్రా
యుత్తంబులు లఘువగుఁ బురు
షోత్తమ యొకమాత్ర గురువు నొందదు ద్విమాత్రన్. 7

క. వివిధముగ జూపిపలికెడు
నవియును మఱియూఁదిపలుకునవియును గురువుల్
భువి నిలిపిపలుకువర్ణము
లవియెల్లను లఘువులయ్యె నంబుధిశయనా! 8

క. గురు వమరు నూర్ధ్వవంక్రము
ధరియించినరీతి లఘువు దనరును హరియొ
క్కరుఁడ పరతత్త్వ మనుచును
నురుచిరముగఁ జట్టిప్రేలఁ జూపినమాడ్కిన్ 9

క. గోవింద ప్రభుఁ డనినన్
గోవిదు లవి మూఁడుమూఁడు గురులఘువులుగా
భావింతురు గురులఘువులు
మోవఁగ మూఁడేసి నిక్కముగ గణములగున్. 10

### గణాష్టక లక్షణము.

క. భజనసమయరతగణములు
భజనసమయరతములై సభక్తికమతిఁ బం
కజనాభు నహర్నిశమును
భజించుదిక్పాలగణవిభాతిఁ దనర్పున్. 11

గీ. గురులఘువు లోలి మూఁడేసి కూడిన మన
లాదిమధ్యావసానంబులందు గురువు
లొంద భజసలు లఘువు లట్లొంద యరత
లనఁగ నయ్యష్టగణము లొప్పును ముకుంద. 12

క. చను మగణము శ్రీనాథా
యనిన ముకుందాయనంగ యగణము రగణం
బన నొప్పు మాధవా యన
నొనరఁగ వైకుంఠ యనఁగ నొగిఁ దగణమగున్. 13

క. భగణమగు విష్ణుఁ డనఁగా
నగణితముగ జగణ మగు మురారి యనంగా
నగణము విభుఁ డనిపలికిన
సగణము వరదాయనంగ సత్కృతులందున్. 14

క. గురువును లఘువును లఘువును
గురువును హావ లగును గలలు గురులఘుసంజ్ఞల్
వరుసను గగ లలగణముల
కరయఁగ వర్ణములు ద్విగుణమై యొప్పు హరీ ! 15

క. శౌరియనిన హగణంబగుఁ
జేరి హరీయనఁగ నుల్లసిల్లును వగణం
బారయఁ గృష్ణా యనినను
ధారుణి గగ మండ్రు లలము దాహరి యనినన్. 16

సీ. కమలనాథా సగఁగంబు; కమఠరూప
నహా మసురాంతక నాఁగసలల

మద్రిధరభలంబు, భద్ర కుశా యన్న
భగురు, వంభోజాక్షునగణలఘువు
భువనేశ్వరా యన్న సవ మఘవిద్వేషి
సహాము, పీతాంబరసంజ్ఞ తలము
కైటభారిరలంబు, గజవరదా యన్న
నవ, మహేశ యననా నలలమయ్యె
గీ. రగణగురువు దేవరాజాయటంచు బ
ద్మాపతీ యనంగ దగణగురువు
నరహరీ యనంగ నరహరి నరసింహా
నాంగ నొప్పు నగము నలము సలము. 17

ఇంద్రచంద్రాది గణభేదములు.

క. ద్విత్రిచతుర్గురుభవముల
ధాత్రీధర రెండు*మడుపం దక్కనగణముల్
మిత్రేంద్రచంద్రు లనంజను
మాత్రాదిగణంబు మొదల మాత్ర లిడంగ. 18
క. గలనగణము లినుం; డింద్రుండు
నలనగసలభరత, లింక నగగ నహా సలా
భల భగురు మలఘు సవ సహా
తల రల నవ నలల రగురు తగ లిందుం డజా. 19
సీ. ఒక్కనెలవున నెనిమిది యొకట నాల్గు
రెండి లఘువెక్కనవి నాల్గు వీనిలోన
నగణపునరుక్తి నొక్కటి డిగియె నాల
దొంతి పదునాల్గు నిరువదితొమ్మిదింట. 20

* నడుప ; నిలుప. అని పా.

### సంయుక్తవర్ణ గణంబులు.

*క. జగణము నలమగు, గ(ల)గములు
భ(వ)గణములగు, గలము నగణభావంబుఁగనుఁ
గగము, భగణ సగణములగుఁ
దగణము స(భ)లమగును సంయుతముఁదీర్చినచోఁ. 21

*క. మొగిళులు నలమగుసిటులని
న(హా)గణము సగణమగు నిట్లు నా హావగణముల్
భగణము లిట్లనఁ దండ్రీ
భగణముపాళ్లును భలంబువాకిళు లనఁగఁ. 22

### గణఫలములు.

ఉ. నవ్యసుఖప్రదాయి భగణంబు జకారము రుక్ప్రదంబగుఁ
ద్రవ్యముఁ జేయు నా,లయకరంబుసకారముమాశుభంబుయా
దివ్యసువర్ణకారి వెతఁదెచ్చును రేఫ విభూతినిచ్చుఁ దా
గావ్యములందు నాదినిడఁ గర్తకు భర్తకు నంబుజోదరా!

### గణాధిదైవతములు.

చ. భగణము నేలుఁ జందురుఁడు భానుఁడు దాజగణంబునేలుఁ దా
నగణము నేలు నిర్జరగణంబు సమీరణుఁ డేలు నెప్పుడుఁ
సగణమునుర్వియేలు మగణంబునొగిన్యగణంబుఁ దోయముఁ
రగణముఁ బావకుండుఁ దగణంబు నభంబును నేలుఁ గేశవా!

### కృత్యాదివర్జనీయగణములు నక్షరములును.

క. పురశరరసగిరిరుద్రుల
నరయ నకచటతప లిడుట యనుచిత మయ్యె

* 21, 22 పద్యములకు నర్థము సంశయముగా నున్నది.

క్షురములును రసభజంబులుఁ
బరిహారణీయంబు లాదిఁ బంకజనాభా ! 25

క. మొదలను కఖజలు చఛడలు
దధలును భయళక్షమసలు తగ దుపవర్ణా
స్పదములు గాకుండిన మే
లొదవించును స్వరములెల్ల నుశ్నవకారుల్. 26

క. మొదల నభంబులు రెండును
గదిసిన విభవంబు తభసగణసంగతి నొ
ప్పదు రయముల నధికశుభం
బొదవును భయములను హానిఁబొందు నృసింహా ! 27

క. ఒనరఁగ శుభవాచకములు
ఘనతరమగు దేవవాచకంబులు నై పే
ర్చినగణములు వర్ణంబులు
ననింద్యములు కృతుల మొదల నహోపతిశయనా ! 28

---

# ప్రాసప్రకరణము.

క. ప్రాసం బగు రెండవయది
వాసనగల మొదలివ్రాయి వడి యనఁబరఁగుఁ
బ్రాసంబు లన్నియెడలను
భాసురముగ వడులు పాదపాదముల హరీ ! 29

క. ఆదిని గురులఘువులలో
నేది నిలిపె నదియ మొదల నిడి పాదము లు
త్పాదింపవలయు నుపజా
త్యాదుల మిశ్రములఁ దక్క నంబుధిశయనా! 30

గీ. కుటిలకుంతలములు నిటలంబుపైఁ దూల
నోటు లేక ధేనువాటమునకు
నడి యశోదపట్టి కదలెఁ బొమ్మనినఁ బ్రా
సాది తేటపడుఁ బ్రసూద మెనఁగ. 31

గీ. నందసుతుఁడు నాఁగ సౌందర్యనిని యన
నమరు బిందుపూర్వకము మొదలను
బక్షిగమనుఁ డన నధోక్షజుఁ డన సంయు
తాక్షరాది చెల్లు నసమగురువు. 32

గీ. అర్ధబిందుసహిత మగువర్ణమునకుఁ బ్రా
సాది యరయ నిడుదయక్కరంబు
నేఁడు మనకుఁ గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేటి కింక నేఁడు మాట లనఁగ. 33

గీ. కుఱుచమీఁదినున్న మఱి తేలవ్రాయఁ బ్రా
సద్వయాది నిట్లు జరగు నచ్యు
తుఁడు నమస్తవల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుండనంగ. 34

**మఱియు ద్వాదశవిధప్రాసములు.**

క. సమనామప్రాసము ప్రా
స మైత్రి ఋ త్రిలును ప్రాది సమలఘువు వికల

ల్పము బిందు వర్గబిందా
ఖ్య ముభయ సంయుక్త సంధిగత సంజ్ఞకముల్. 35

సమప్రాసము.

క. అరసున్నలు నెఱసున్నలు
నొరసినవర్ణములు జడ్డయును [1]ప్రాసములై
బెరసినచో సమన్నము
లరసి నిలుపవలయుఁ దోయజాసనజనకా ! 36

1. సమప్రాసము:—

క. పరువడిఁ బ్రాసములు సమా
క్షరసంశోభితములయినఁ, జాలును మఱి త
త్స్వరవైసాదృశ్యంబులు
పరిహారణీయంబు లందుఁ బంకజనాభా! 37

గీ. వీఁడె కృష్ణుఁ డల్లవాఁడె ప్రలంబారి
కొండ యెత్తె నితఁ డతండు ద్రవ్వె
నొడ్డగెడవుగాఁగ దొడ్డరా జేలెడి
వీడుఁ నాఁగ బ్రాస మీడువచ్చు. 38

గీ. ఆయుపేంద్రుని బొడఁగాంచు టేయుపాయ
మనెడు దీర్ఘాదు లచట హ్రస్వాదు లయిన
నయ్యుపేంద్రుని బొడఁగాంచు టెయ్యుపాయ
మన సమప్రాస మగు నూఁదఁజనదు రహాల. 39

---

1 పా. దీర్ఘమునను.

౩. ప్రాసమైత్రి.—

గీ. లళలు రెండును నొండొంటఁ గలసి వచ్చు
నమరు నన్యోన్యమును ఋయుతాయుతములు
బిందుపూర్వమై తమలోనఁ బొందు బమలు
ప్రాసమైత్రికి నిది స్వరూపంబు దెలియ. 40

గీ. నీలవర్ణు గర్భగోళంబు నందు లో
కంబు లెల్ల నుండు నెమ్మి నోడ
శ్రీకినోడయుఁ డుజ్జ్వలాకృతి యితఁ డన్నఁ
బ్రాసమైత్రి యిట్లు పరఁగుఁ గృష్ణ 41

గీ. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగఁ
బరఁగు నచ్చపుజడ్డతోఁ బ్రాసమైత్రి
యకృపానిధి హరిఁ గని మ్రొక్కి రనఁగ
సంభృతాశ్రితుఁ డతిశయోజ్జృంభుఁ డనఁగ. 42

౪. ఋప్రాసము: —

క. అరయ స్వరగణ మయ్యు ఋ
కారము ఋప్రాస మనఁగఁ గదియును రేఫం
జేరి తనయురముఁ దన్నిన
యాఋషిపాదంబుఁ బిసికె నచ్యుతుఁ డనఁగన్. 43

గీ. తెల్లమిగ ఋకారము యణాదేశవశత
రేఫ యగుటఁ బ్రాసంబయ్యె రేఫ కిట్టు
లిదియె పరవర్ణయుత మయ్యెనేని ప్రాస
మైత్రి యగుఁ గాని రేఫసంబంధి గాదు. 44

4. త్రిప్రాసము:—

గీ. సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాససంజ్ఞ గలిగి
యత్రివిక్రముఁ డభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తు లనఁగ. 45

గీ. ఈత్రికారంబుకుఁ దృతీయ మొసఁగఁ గ్రింది
రేఫ సంప్రసారణమున ఋత్వ మగుఁ దృ
తీయయగు నీత్రికార మర్థించి చూడ
నాతకారంబునకుఁ బ్రాసమయ్యె నచట. 46

గీ. ఇ ఉ ఋ ఌ ల కచ్చు పరమగునేని సంధి
య వ ర లాదేశ మగునట్టి యవరలలకు
నడరి ఇ ఉ ఋ ఌ లాదేశ మయ్యెనేని
యది కృతుల సంప్రసారణ మండ్రు బుధులు. 47

5. ప్రాదిప్రాసము:—

గీ. ప్రాదియై యనశబ్దంబు ప్రాణ మగుటఁ
బరఁగ నాలకు వేర్వేఱ ప్రాసమయ్యె
క్షోణిధరుఁ డెత్తె నేనుఁగు ప్రాణ మనఁగ
దానవారాతి వేత్రిలప్రాణ మనఁగ. 48

6. సమలఘుప్రాసము:—

గీ. ఒలి రేఫతోఁ గూడియు నూఁదఁబడక
తేలి తెలుఁగునఁ దమయట్టి వ్రాలతోన
సమలఘుప్రాస మగు నొక్క లమరఁబట్టి
విప్రచె నసురఁ గృష్ణుఁడు దిక్కు లద్రువ ననఁగ. 49

7. వికల్పప్రాసము:—

గీ. సానునాసికలౌ వర్గహల్లులకుఁ దృ
తీయములు వికల్పప్రాసమై యెలర్చు
ప్రాఙ్నగంబుపై రవిదోఁచె నగ్నివోలెఁ
బ్రాఙ్ముఖుండై నుతించెనీవాగ్మి యనఁగ. 50

8. బిందుప్రాసము:—

గీ. పేర్చి పొల్లునకారంబు బిందు వగుచు
మీఁద నున్నధకారంబు నూఁదఁ బ్రాస
బంధమగుఁ గృష్ణుఁ డుదయించిన౯ ధరిత్రి
యంతయును నిరుపద్రవం బయ్యె ననఁగ. 51

9. అర్ధబిందుప్రాసము:—

గీ. సార్ధబిందువులై తేలినట్టి పటల
కరయఁ బ్రాసంబు నిర్బిందు వైనఁ జెల్లు
వీఁపు మూఁపులు మఱి తలమోపు లయ్యె
మాట లేటికి మేటి తాఁబేటి కనఁగ. 52

10. ఉభయప్రాసము:—

క. చూడఁగ లకార రేఫలు
గూడుడకారంబు చను నకుంఠితగతిఁ దో
డ్తోడన నుభయప్రాసము
జాడఁబడును సంయుతప్రసంగతిఁ గృష్ణా! 53

గీ. పాఁడి మరగి బ్రతుకువాం డిల వ్రేఁతలు
వాండ్ర వెన్న లేలఁ దండ్రి! యనఁటి

పండుకోలకు వింత యిండ్లకుఁ బోకు కృ
ష్ణుండవు నీకుఁ బ్రాఁతె పండ్లు నిచట.

గీ. రలయుతాయుత ప్రాస మార్గముఁ దలంచి
వాండ్ల లేఁ జూపు సోమములఁ దీండ్రమారె
ననుచు రెండును గూర్చిన ననువుఁ దప్పు
నండ్రు నిఖిలార్థవిదు లైన దండికవులు. 44

11. సంయుతప్రాసము:—

గీ. పాడు నూరు ప్రోలు బహువచనంబులై
పరఁగుచుండు నూఁది పలుకు నప్పుడు
తేల్చి పలుకునప్పుడు దీపించు సంయుత
ప్రాస మిరుదెఱఁగుల బద్మనాభ! 55

గీ. పాళ్లు మనుజు లెక్క నూళ్లు గాఁదోడఁగె న
య్యూళ్లు మిగుల బలసి ప్రోళ్లు గాఁగ
భాగ్యవంతుఁ డేలుపాళ్లను నూళ్లను
ప్రోళ్లు నయ్యె బ్రాఁతె కూళ్లిచటను. 56

గీ. తెలుగునందు లేదు లలిఁ గ్రిందిసుడి గ్రుచ్చె
గుమ్మె నాఁగ రేఫకొమ్ము గాని
ప్రాసమైత్రి చొరదు దా సంయుతప్రాస
మగును రేఫయుతము ననుసరించి. 57

క. ఈ క్రిందటి రేఫలు సమ, మైక్రాలుచుఁ దేలి ప్రాసమగు సంయుక్తం
బా క్రూరనక్ర భయమున, వాక్రువ్వ దెగజము భక్తవత్సలుననగన్

12. సంధిగతప్రాసము:—

క. ధ్రువముగ సంధిజనితరూ
పవిశేషప్రాస మనఁగఁ బరఁగు పకారం

బవిరళవకార మగు న
య్య వదాఱవపా లెఱుంగ ననఁగ ముకుందా ! 59

వ. అది యె ట్లనిన. 60

క. ప్రథమాంత విభక్తులపైఁ
గథితములగుకచటతపలు గసడదవలగున్
బృథివిని విగజడ దబలగుఁ
బ్రథమవు సున్న లగునాంత పదములమీఁదన్. 61

ఉదాహరణము:—

గీ. వాఁడు గనువాఁడు సేకొనువాఁడు డెక్క
లాఁడు వాఁడు దపోనిధి వాఁడు వెద్ద
చిక్కఁ గరి మ్రొక్కఁజెలి వాక్కుఁ డక్కవెట్టె
శౌరిఁ దలఁచె నిఁక బిలిచె నాసంధు లిట్లు. 62

గీ. ఆయచేతనద్వితీయ దానిజరూప
మయ్యు నుండుఁ బ్రథమయట్లు లుండుఁ
గ్రతువుఁ గాచె దాశరథి కృష్ణుఁ డోకపర్వ
తమును గొడుగుభంగిఁ దాల్చె ననఁగ. 63

గీ. అచ్చుమీఁదచ్చున యకార మాయుజుండు
కొమ్ము గలహల్లు ప్రథమైన గ్రుంకు నచ్చు
గురుఁ డుపేంద్రుఁడు పెఱచోటఁ గ్రుంకు నొండెఁ
జను నకారంబు జనుఃందు జనులయందు. 64

గీ. ఓలిఁ గర్మధారయమష్టు లుత్వమాలుగ
నచ్చు తుద నుండ టనము లో నాంధ్ర సంధిఁ

గఱకుటఁగచరు ల్గట్టి రక్కఁజపుటుదనె
వితతయశుఁ డైనరాజునానతి ననంగ. 65

గీ. నుఱులురులు పొల్లు తాను తెనుంగు నంది
హేమ మిది పదాఱ్వన్నె నల్మోము లతేఁడు
ప్రబలి హరిఁ గొల్చియున్నవా ర్పరమమునులు
గోటిలో నొప్పు సతికిఁ గన్గొన లనంగ. 66

గీ. ద్విత్వమున కాదివర్ణంబు తెనుఁగునందు
నూఁదఘుండును వలసిన నూఁదియుండు,
జానకీవల్లభుఁడు క్షమాశాలి యనఁగ
దశరథాత్మజుఁడు స్వామి ధాత్రి కనఁగ. 67

వ. మఱియు శబ్దాలంకారవిశేషంబులు ప్రాసంబులు నెట్టివనిన. 68

### షడ్విధప్రాసములు.

క. అమరఁ గడుదుష్కరము ద్వం
ద్వము త్రి చతుష్ప్రాసములును దగ నంత్యప్రా
సమును ననుప్రాసము ననఁ
గ్రమమున షడ్విధము లయ్యెఁ గంసవిదారీ ! 69

1. దుష్కరప్రాసము:—

క. దోఃకీలితమణి కటక యు
రఃకీలితరమాభిరామ రంజితసుజనాం
తఃకరణ ఖండితారిశి
రఃకందుక యనఁగ దుష్కరప్రాసమగున్. 70

2 ద్వంద్వప్రాసము:—

క. కంజనయన భవభీతివి
భంజన శుకశౌనకాదిబహుమునిచేతో
రంజన ద్వంద్వప్రాస ము
నంజను నిప్పాటఁ బల్కినం గృతు లందున్. 71

3 త్రిప్రాసము:—

క. తానవనీతప్రియుఁ డన
దానవనిర్మూలనైకతత్పరుఁ డన స
న్మానితవినుతుఁ డన నతసుర
ధేను వనం గృతులయందుఁ ద్రిప్రాస మగున్. 72

4 చతుష్ప్రాసము—

క. వారణవరద నిశాటవి
దారణ వీరావతార ధరణీతలరా
డ్ధారణ విరచిత సత్త్వవ
ధూరణ విజయ యనఁ దగి చతుష్ప్రాస మగున్. 73

5 అంత్యప్రాసము—

క. అగణితభవసూర్తీ!
నిగమాగమసతతవినుత నిర్మల మూర్తీ
జగదభిరక్షణవర్తీ
యగు నంత్యప్రాస మిట్లుదంచితకీర్తీ! 74

క. మొదలిటిప్రాసమె కానీ
యిదియంత్యప్రాస మనఁగ నేదటకానీ
కదియింపవలయుఁ దానీ
పదనెఱిఁగిన బుధుఁడు కృతులఁబరమ జ్ఞానీ. 75

అనుప్రాసము:—

క. విప్రప్రకరమునిప్రీ
తిప్రద సుప్రభవ యప్రతిమదోఃప్రభవా
విప్రణుత సుప్రసన్న య
నుప్రాసప్రవణ మిది మనుప్రియచరితా. 76

---

# యతిప్రకరణము.

యతిసంజ్ఞలు.

క. విరతులు విశ్రాంతులు మఱి
విరామములు విశ్రమములు విశ్రామంబుల్
విరమంబులు యతు లనఁగా
విరమణములు నాఁగ వళ్లు వెలయు మురారీ! 77

యతిపంచకము:—

క. స్వరయతులు వర్గయతులును
సరసయతు ల్ప్రకటమైనసంయుక్తయతుల్
పొరిఁ బ్రత్యేకయతులు ననఁ
బరఁగును యతిపంచకంబు పంకజనాభా! 78

యతిపంచకభేదములు:—

క. స్వరయతులు ప్రాది కాకు
స్వరనిత్యసమాసయతులు వర్గయతులు ని

ద్ధరఁబోలికవడి సంయుత
విరతి యనుస్వారయుతులు వెలయు ముకుందా ! 79

క. ప్రభునామాంతవిరతియన
విభాగవిరమణమును భిన్నవిశ్రమమును గా
స్తుభధర వికల్పయతి యన
నభేదవిరమణ మ్మనంగ నైదు తెఱంగుల్. 80

గీ. స్వరప్లుతోభయవృద్ధ్యను స్వరవికల్ప
ప్రాద్యభేదసంయుత భిన్న ప్రభువిభాగ
కాకు మాదేశనిత్యద్యఖండవర్గ
చక్కటెక్కటిపోలిక సరసయతులు. 81

టీ. స్వర, ప్లుత, ఉభయ, వృద్ధి, అనుస్వార, వికల్ప, ప్రాది, అభేద, సంయుత, భిన్న, ప్రభు, విభాగ, కాకు, మాదేశ, నిత్య, ది, అఖండ, వర్గ, చక్కటి, ఎక్కటి, పోలిక, సరస.

స్వరయతులు.

గీ. అగు నకారమునకు నైత్వౌత్వములు వడి
ఋకి బుత్వమునకు నేత్వ మమరు
నుత్వమునకు నోత్వ మొనరు నీగతి స్వర
యతులు విస్తరిల్లు నబ్జనాభ. 82

క. స్వరముల దీర్ఘము హ్రస్వము
నరయఁగ నొక్కవిధ మెన్న యతులకు సంధ్య
క్షరము లగునచ్చులందు ను
చరితా! హ్రస్వములు లేవు సంస్కృతభాషన్. 83

---

81-వ పద్యము ప్రక్షిప్తము.

క. అలఘుచతుస్సంధ్యక్షర
ములలో నైయౌలు దక్క మొదలిటిరెంటన్
తెలుఁగునను హ్రస్వదీర్ఘము
లొలయును నెపలనఁగ నోటి లనఁగన్. 84

క. క్రియ నైయౌలకు హ్రస్వ
ద్వయము నమరు నాంధ్రభాషితప్రకరములో
నయ్యిదనఁ దగు నై దనుచో
జయకీర్తి యవు నవంగఁ జను నౌ ననుచోన్. 85

గూఢస్వరయతి:—

గీ. స్వరయుతుద నుండి లుప్తవిసర్గకోత్వ
మైనస్వరవిరామంబు దాసోఽహ మనఁగ
నచ్యుతాశ్రితు లుర్వి నన్యోన్యమిత్రు
లనఁగ నమ్ముకుందుండు యశోఽర్థి యనఁగ. 86

ఋకారస్వరూపయతి:—

గీ. క్షితి ఋకారరూపస్వరయతులు పరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుఁడు దేవవృషభుఁ డనఁగ. 87

క. విలసదృకారమునువ
ట్రిల రీవిరమంబు శౌరి ఋషులకు శిశ్వ
త్సులభుఁ డనఁగ నీయేలకు
దలఁపఁగ రీతోడి విరతి తలఁకొన దెందున్. 88

గీ. తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫ యిత్వమునందుఁ గదసి యతికి
నట్టిరీకి నీయేలతో నన్వయించు
నట్టిస త్వంబు 'రే' దది హాల్లుగాన. 89

గీ. మును ఋకార మీ యేలతో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘునలకారంబ యగును ఌకారవిరతి
క్లప్తి లేదు శౌరిగుణావళికి ననఁగ. 90

క. స్వరములు కాదుల నొందిన
నరుదుగ స్వరయతులు దగును బ్రాదులు గాకు
స్వరములు నిత్యసమా సా
క్షరసంధులు రెండు నగు భుజంగమ శయనా! 91

గీ. ప్రాదినిత్యసమాసశబ్దములు గాక
పెరపదంబులపై నచ్చు బెరసినప్పు
డన్నియును స్వరయతులగు సాంబగురుఁడు
శ్రీశుఁ డమరాన్వయాబ్ధిపూర్ణేందుఁ డనఁగ. 92

ఉపసర్గలు.

క. ధర నుపసర్గలు ప్రాన్వవ
దురపాభిప్రతిసువిన్యు దుపపర్యధిసమ్
నిరతిపరాజపులిరువది
పరాజపులుచొఅవు తెలుఁగు బాసను నెందుఁ. 93

టీ. ప్ర, అను, అవ, దుర్, అప, అభి, ప్రతి, సు, వి, ని, ఉత్, ఉప, పరి, అధి, సమ్, నిర్, అతి, పరా, అఙ్, అపి, అను నివి యిరు

వది యుపసర్గలు. వీనిలో పరా, అప్, అపి, అన్నవిగాక మిగిలిన పదు నేడును బరస్వరసంధి యైనప్పుడు స్వరయతియైనను వ్యంజనయతియైనను బ్రయోగింపఁదగును.

వీని కుదాహరణము:—

ఉ. ప్రాంతనిరంతరాన్విత దురంతసమ స్తపరాక్రమంబున
త్యంతమదా ప్తిశోభన మపాయ మపాయము వీక్షణంబు ప్ర
త్యంత మభీష్ట మవ్యయము స్వాంతము నీత ముదంచితంబుప
ర్యంత మనంగ సంధిలుఁ దిరంబుగ రెంటను బ్రాదు లచ్యుతా!

కాకుస్వరయతి:—

క. కాకుస్వరయతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీర్ఘ మగు నితఁ
డే కవ్వడి రథముఁ గడపె నిమ్ముల ననఁగన్. 95

గీ. వలదు కృష్ణ యెఱుఁగవా మున్ను నన్ను నీ
వావిరుద్ధభావ లాడ నేల
లోన నెట్టియలుకలో నాఁగఁ గాకుస్వ
రో క్తి రెంటఁ జెల్లు నొగి ధరిత్రి. 96

గీ. వరుసదీర్ఘాంతసంబుద్ధి వచనయతుల
కమరుఁ గాకుస్వరంబు పరమసహస్ర
నామశోభిత గోపకృష్ణా యనంగ
నమరవందిత గోపకృష్ణా యనంగ. 97

నిత్యసమాసయతి:—

గీ. పదము విభజించిచెప్పఁ జొప్పడని యవియు
నన్యశబ్దంబుఁగాని విగ్రహంబుఁ జెప్ప

నవియు నిత్యసమాసమై యతిళయిల్లు
నట్టిసంధుల నచ్చు హల్లైన విరతి. 98

గీ. నాస్తియనక మహి ననంతసంపదలు నా
రాయణుం డొసంగు రమ్యమగుర
సాయనంబు బుధుల కతఁ డన్న నిత్యస
మాసయతులు రెంట నంటియుండు. 99

వ. ఈనిత్యసమాసయతిపే రఖండయతి. 100

గీ. అటయఱను పోవుటకు నర్థ మగుట నట్టి
సంధి నిత్యసమాసోక్తి జరగు వడులు
నసురవీరులనెల్ల నొక్కట వధించె
భానుకులుఁడు రావణునియే పఱ ననంగ. 101

వ. అట్లు మఱియును. 102

గీ. ఏని యనుపదంబుతో నాదిపద మంది
సంధి నిత్యయతుల జరగుచుండు
నెట్టికార్యకర్తుఁ డేని సద్గతి నొందు
నిన్ను నాత్మఁ దలఁచెనేని కృష్ణ. 103

గీ. కదియు వడులు స్వరముకై వడిఁ గాదులు
ఋత్వమునకు నెత్వమెనయు చోటఁ
గృష్ణుఁ డాజిఁ గంసుఁ గెడపె నం ద్రార్యులు
కూర్తరూప విమలకోమలాంగ. 104

వర్గయతి:—

క. తలకొని కచటతపంబులు
తలనొక్కొకవ్రాయి తొలఁగఁ దమతమనాల్గుఁ

విలసిల్లు వర్గయతు లనఁ
గలికల్మషతిమిరతపన ఘననిభవర్ణా! 105

పోలికవడి.—

క. వెలసినపుప్పుబుభువర్ణం
బులు పోలికవడి ఘుకారంబుగ నిడఁ దగు ని
మ్ములఁ హరిచరణసరోరుహ
ములు నాహృత్సరసియందుఁ బొదల్చు ననంగన్. 106

సరసయతి:—

గీ. నణలు చెల్లుఁ గమలనాథ యొండొంటికి
నయుహా లమరియుండు హస్తిగన
శషస లొందు నండ్రు చఛజఝంబులతోడ
సరసయతు లనంగ జలనిశయన. 107

సంయుక్తయతి.—

క. ఏ నిను వేఁడెద లక్ష్మీ
శ్నాయక నీవు నన్నుఁ గైకొని యిష్టం
బైనవి యొసఁగుము శుభల
క్ష్మీ నీవాఁడ నన నొప్పు సంయుక్తయతుల్. 108

క. ఒక్కఁడుగున విశ్రాంతులు
పెక్కగుచోసంయుతములు పెనుపకమును జ
డ్డక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యునుపవలయు నన్నిటఁ గృష్ణా!

క. వడినెలవులలోఁ జేరువ
యెడ నొకసంయుతము నొలయెడ నొకటినిఁ దా

నిడిరేని కవులు తప్పాట
యొడఁబడదు పృథగ్యతిప్రయోగముల హరీ! 110

ఉదాహరణము:—

ద్విరదగతిరగడ.

త్స్రావలయ మంతయు విషాణమున నెత్తుకిటి
మహిమ దలపోయ నక్కజ మనుచు నిట్లనక,
త్స్రావలయమంతయు విషాణమున నెత్తుకిటి
సత్త్వ మరు దన నొప్పు సంయుక్తయతి చెడక. 111

అట్ల మఱియొకవిధంబగు రగడ.

అంపమున వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపుని
వక్షము నృసింహుఁ డని రాయువడిసారదుకృతి
అంపమున వ్రచ్చుగతి వ్రిచ్చె నఖముల రిపును
రంబు నరసింహుఁ డనఁ గ్రాలు సంయుక్తయతి. 112

గీ. అప్రసిద్ధముల్ జఞలుశబ్దాదియందు
ఞాజసంయుక్తి తద్భవవ్యాజమునను
మూలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ
జలరుహోదరాశ్రితులు సుజ్ఞాను లనఁగ. 113

గీ. యజ్ఞమునకు జన్న మాజ్ఞప్తి కానతి
యాజ్ఞ కాన సంజ్ఞ కరయ సన్న
విన్నపంబు వెండి విజ్ఞాపనమునకు
జ్ఞాకుఁ దద్భవంబు నా ధరిత్రి. 114

రేఫయుతయతి.—

గీ. ఆంధ్రలిపిఁ జొప్పడదు ఋకారాన్వితంబు
క్రొత్తగాదు కృష్ణునివెన్నముచ్చి మనఁగ

స్రుక్కఁ డతఁ డాజి నెట్టి విరోధి నైనఁ
గ్రమ్ము నన రేఫయుతయతి గూడుఁ గాన. 115

**అనుస్వారయతి.—**

గీ. భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ
ణాకు నిట నాల్గు చెల్లుఁ బాండవసహాయ
నాకు నిట నాల్గు చెల్లుఁ గందర్పజనక
మాకు నిటనాల్గు చెల్లు సంపదలరాజ. 116

**మకారయతి.—**

గీ. యరలవలు శషసహాలును నాదిబిందు
యుతములై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిదిసంయమి యనంగ
మదనజనకుఁడు దనుజసంహారుఁ డనంగ. 117

**ఎక్కటియతి.—**

క. ధర నెక్కటివ ళ్లై తగు
ళరమఱవలు వానిలోఁ దొలంగక(తెలంగును) లాకుఁ
న్వరి ళా యన విశ్రమవే
శరమాధిప రెండునుం గలసి వర్తించున్. 118

గీ. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహ **మూ**ర్తిరక్షకుండు
ఱాఁగవేలు పనఁగ ఱంపిల్లు నెక్కటి
వళ్లు నాఁగ నిట్లు వనజనాభ. 119

గీ. ఒరుల నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు

మహి నయోధ్యకు రాజు గామన యనంగ
నతనిపట్టపుదేవి సీతమ యనంగ. 120

గీ. సంఖ్యకుం బరిమాణసంజ్ఞకుఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి సరణి సంఘ
టించినప్పుడు యతులు రెండేసియగు న
పేంద్రుఁ డిచ్చునర్థము మోపెఁడేసి యనఁగ. 121

క. అంచితతిలకము శౌరి ధ
రించె ననఁగ జగణమధ్యరేఫవిరతి యా
నంచితతిలకము హరి ధరి
యించె ననఁగ భిన్నవిరతి నిత్యము వచ్చున్. 122

గీ. అట ఇకారాంతపదముమీఁదటి దికార
మది యనంగ నవ్వల భిన్నయతికిఁ జెల్లు
దివిజవిభవంబు శౌరిచేతిది యనంగ
నసురనాశంబు హరిచేతియది యనంగ. 123

వికల్పయతి.—

గీ. హయుత మైపొల్లులవికల్పయతులు చెల్లు
దేవకీనందనుఁడు జగద్ధితుఁ డనంగ
హలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ
నవని మోచినయవి కకుబ్భస్తులనఁగ. 124

యుక్తవికల్పయతి.—

గీ. నలి జకారహల్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వికల్పవిరతి
గలుగుఁ జక్రి వల్లవసుదృఙ్మథుఁ డనంగఁ
గమలనేత్రుండు సకలదిఙ్మహితుఁ డనఁగ. 125

క. ప్రకటపకారవకార
ద్వికముకుం జను నభేదవిరతి నిశాట
ప్రకర మెరిసె రాముని పా
వకశరమున జనకసుతనెపంబున ననఁగన్. 126

గీ. చెల్లుబడిపల్లి ప్రాసము ల్చెప్పఁబడియె
నిందుఁ బూర్వప్రయోగంబు లెఱిఁగి యెవ్వి
బహుళమై తోఁచె నవి యొనర్పంగవలయు
నవ్యకావ్యప్రయోక్తల నలిననాభ. 127

క. వరగణవర్ణము దీర్ఘ
స్వరమగుచో గణయుగంబు చను యతుల సుధా
కరకరగుణగతి శరరుచి
గిరిగజరుద్రాదిసంజ్ఞ కేశవ నాథా. 128

క. ఎన్నిట యతి రావలె నని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతిరావలె నని
రన్నిటఁ దెలుఁగునకు మొదలియక్షర మమరున్. 129

గద్యము. ఇది శ్రీవాణీప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యతనూభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయ ప్రణీతం బైన ఛందోదర్పణమునందు గద్యపద్యాదికావ్యలక్షణంబును గురులఘునిర్ణయంబును గణనిరూపణంబును బ్రాసయతి విశేషంబులును, బరిగణనసంజ్ఞయు నన్నది ప్రథమాశ్వాసము.

శ్రీరామాయనమః.

# ఛందోదర్పణము

## ద్వితీయాశ్వాసము.

శ్రీరమణ భక్తలోకము
నోరమణ జగత్త్రయాభినుత రంజిత గౌ
రీరమణ సంభరితవా
ణీరమణ యనంతశయన నీరజనయనా. 1

### గద్యలక్షణము.

క. కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు గద్య మది దాఁ
దెనుఁగుకృతుల వచన మనఁగ దీపించుఁ గడున్. 2

గద్యము. స్వస్తిసమస్తభువనరక్షాదక్ష శ్రీపుండరీకాక్ష భుజగపతిసింహాసనారూఢ సురనికరమకుటతటఘటితసురుచిరమణిగణప్రభావిభాసితపాదపీఠ! వేద నినాదానుకారిగారవలలితనూపురాలంకృత చరణసరసిజయుగళ నవ్యపదాంగుష్ఠనఖమయూఖరేఖాయితసురసరిత్ప్రవాహ పీతాంబరధర నూత్నమేఖలాకలితకటితటప్రదేశ చతురాననజనక నాళీకశోభితనాభి

సరోవర, యఖండబ్రహ్మాండకలాప గోపననిపుణోదర, క్షీర సాగర తనయామనోజ్ఞ గేహీకృతవిపులవక్షస్థల కనత్కనక కటకకేయూరప్రముఖభూషణభూషిత చతుర్భుజ, శంఖపంక జసుదర్శన గదాధర కిరీటకుండలాభి రామ యనవరతప్రసన్న వదన కౌండిన్యవరద శ్రీయనంతపద్మనాభ నమస్తే నమస్తే నమః అని గద్యపఠనంబొనర్చునుత్తములకు నుత్తమాయు రారోగ్యంబు లొదవునని విశదవచనంబుల విద్వజ్జనంబు లభి నుతింతురు. 3

ఛందములు.

క. సమవృత్తము లనియెడును
త్తమరత్నంబులకు జన్మధామములై పెం
పమరు సముద్రములచం
దములై ఛందములు మహి సుదర్శనపాణీ. 4

సీ. ఉక్తయు నత్యుక్తయును మధ్యయును బ్రతి
ష్ఠయు సుప్రతిష్ఠయు సరళమైన
గాయత్రి యుష్ణిక్కు నాయనుష్టుప్పును
బృహతియుఁ బంక్తియు మహితమైన
త్రిష్టుప్పు నలజగతియు నతిజగతియు
శక్వరి మఱి యతిశక్వరియును
నష్టియు వెండి యత్యష్టియు ధృతియును
నతిధృతియును మఱి కృతియుఁ బ్రకృతి

గీ. యాకృతియును వికృతి యటుసంకృతియు నభి
కృతియు నుత్కృతియును గర్త్యమగుచు

జరగు నిరువదాఱుఛందంబు లోకోత్త
రాధికాక్షరముగ నబ్జనాభ! 5

ఛందోవృత్తసంఖ్య.

సీ. కరములు వేదముల్ కరులు రాజులు రాఁగ
సంఖ్య విద్యలు నిభ చక్షురిందు
లంగాస్త్రబాహువు లక్షీందుశరములు
గతిలోచనాంబరకమలరిపులు
నాఁగ వేదాంబరనయనముల్ ఋతునిధి
ఖాబ్ధులు కరవిరించాబ్జఫణులు
గతినాగగుణశాస్త్ర కైరవాప్తులు దిగ్గ
జాంగపర్వతలోచనానలములు
గీ. శాస్త్రివహ్ని బాణశరతర్కములు బాహు
శైలఖేందురామచంద్రసంఖ్య
గతిగతీందు బాహుఋతుబాహు లహినాగ
బాహువేదబాహుబాణచయము 6

సీ. ఋతుశైలశరగజగతిఖేందు లక్షిభూ
తేంద్వద్రినిధిగగనేక్షణములు
నిగమాభ్రగుణగతి నిధిచంద్రగతులు వా
రణఋతుగజదంతిరామకరులు
తర్కేందుకరమునిత్రయతర్కనిధు లక్షి
పావకాబ్ధిసముద్రబాణబాణ
వహ్నివహ్నులు బ్రహ్మవదనాంగభుజగేభ
ఖేందుశైలర్తులు ఛందములను

గీ. వేలువేలు పుట్టు వృత్తసమూహంబు
వెండి సర్వవృత్తవితతి యరయ
ఋతుకరాద్రిశైలసితదీప్తి నయనాబ్ధి
యధికృశానుచంద్రలబ్ధినయన. 7

సర్వసమవృత్తభేదసంఖ్య.

చ. ఒగిఁబదమూఁడుకోటులును నొప్పుగ నల్వదిరెండులక్షలున్
దగఁ బదునేడువేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచినఛందము లిర్వదాఱిటన్. 8

సమవృత్తలక్షణము.

క. హెచ్చును గుందును బొరయక
యచ్చొత్తినయట్లు నాలుగడుగులు సమమై
వచ్చును యతినియమంబును
జెచ్చెర సమవృత్తములకుఁ జిత్తజజనకా. 9

వ. సమవృత్తంబు లెట్టివనిన. 10

మొదలియుక్తాచ్ఛందంబునందు శ్రీయనువృత్తము.—

శ్రీ, భా, విం, తున్. 11

రెండవయత్యుక్తాచ్ఛందంబునందు స్త్రీయనువృత్తము.—

స్త్రీరూ, పారున్, ఘోరా, ఘూరీ. 12

మూఁడవమధ్యాచ్ఛందంబునందు వినయంబనువృత్తము.—

వినయం, బొనరింతు నసం, తునకున్. 13

నాలవప్రతిష్ఠాచ్ఛందంబునందు బింబమనువృత్తము.—

శ్రీకలితా, స్తోకభగల్, పైకొనుబిం, బాకృతికిన్. 14

అందు సుకాంతియనువృత్తము.—

అగుస్సుకాంతి గూర్పఁగా, జగంబులన్, జగత్పతీ. 15

అయిదవసుప్రతిష్ఠాచ్ఛందంబునందు అంబుజమనువృత్తము.—

పంబిభలగా, డంబరముగా, నంబుజము చెల్వం బగుహరీ. 16

అందు పంక్తియనువృత్తము.—

ఒక్కభకారం, బెక్క గగంబుల్,
నెక్కుఁ బంక్తిం, దక్కక శౌరీ. 17

ఆఱవగాయత్రీచ్ఛందంబునందు తనుమధ్యయనువృత్తము.—

గోపాలుని దేవే, నాపాలికి నాఁగాఁ
బైపై తనుమధ్యన్, బ్రాపించుఁ దయంబుల్. 18

ఏడవయుష్ణిక్ఛందంబునందు *మధుమతి యనువృత్తము.—

మధురిపుఁ డనినన్, మధురపుననగల్
మధురము లగుచున్ మధుమతి నమరున్. 19

అందు మదరేఖయనువృత్తము.—

రూపింప న్మగణాద్యం బై, పెంపార సగంబుల్
దీపించు న్మదరేఖన్, గోపస్త్రీహృదయేశా! 20

ఎనిమిదవయనుష్టుప్ఛందంబునందు విద్యున్మాలయనువృత్తము.—

మాద్యద్భక్తి న్మాగాయుక్తిన్, విద్యున్మాలావృత్తం బొప్పున్
చైద్యధ్వంసిన్ సంబోధింపన్, సద్యశ్శ్రేయోజాతం బయ్యెన్.

అందు చిత్రపదమనువృత్తము.—

వారక భాగురుయుగ్మం, బారఁగఁ జిత్రపదాఖ్యం
జేరిన వేడ్కఁ గవీంద్రుల్, గోరి నుతింతురు శౌరిన్. 22

---

* దీనిపేరే మదనవిలసితము (చూ. కవిజనాశ్రయము)

అందు ప్రమాణియనువృత్తము —

సరోజనాభుఁ డచ్యుతుం డరాతిభంజనుం డనన్
జరేఫలన్ లగంబులన్, ధరం బ్రమాణి యొప్పగున్. 23

తొమ్మిదవ బృహతీచ్ఛందంబునందు హలముఖియనువృత్తము.—

చిత్తజాతునిగురునికై యెత్తుఁ డంజలు లనినచో
సత్తుగా రనసములొగిస్, బొత్తుగా హలముఖి యగున్. 24

క. వదలక పంక్తిచ్ఛందము
మొదలుగ నిటమీఁది ఛందముల కందముగా
నుదయించువృత్తసమితికి
విదితంబుగ వళులు వలయు విధురవినయనా! 25

పదియవపంక్తిచ్ఛందంబునందు రుక్మవతియనువృత్తము:—

రూపితరీతిన్ రుక్మవతిసం
రూపభమంబుల్ రూఢి సగంబుల్
ప్రాపుగ భూతవ్రాతయుతు ల్గా
శ్రీపతిలీలల్ జెప్పఁగ నొప్పున్. 26

భ, మ, స, గ. (దీనిపేరు రుగ్మవతియని కవిజనాశ్రయము.)

అందు మత్తయనువృత్తము.—

మొత్తం బారు న్మభములు నితో
దాత్తంబై సన్ఫురితగకారా
యత్తంబై మత్సితయతి నొందన్
మత్తావృత్తం బగు మహిఁ గృష్ణా! 27

అంద ప్రణవమనువృత్తము.—

ఆరంగా మనయుగసంయుక్తిన్
సారోదంచితశరవిశ్రాంతిన్
శ్రీరాజుం బొరసిన సత్యాంత
స్ఫారంబై చను బ్రణవం బుర్విన్. 28

మ, న, య, గ. (దీనికి బణవమని పేరు. శ. జ.)

అంద మయూరసారి యనువృత్తము —

చూత మాయశోదసూను నంచున్
వ్రేత పల్కుఁ దర్కవిశ్రమంబుల్
భాతిగా రజంబుపై రగంబుల్
జాతిగా మయూరసారి జెప్పున్. 29

ర, జ, ర, గ. (దీనిపేరే మయూరభాషిణి.)

అంద శుద్ధవిరాటియనువృత్తము.—

శ్రీమంతుం డగు చెన్నకృష్ణునిన్
ధీమంతు ల్ప్రణుతింప బాణవి
శ్రామంబున్ మసజంబు గంబునై
రామా శుద్ధవిరాటి యొప్పగున్. 30

మ, స, జ, గ.

అంద మణిరంగమనువృత్తము.—

శ్రీమనస్సరసీరుహామిత్రున్
బ్రేమ మొప్పఁగ బేర్కొనుచోటన్
రాముస్త్రవిరామరసాగల్
కోమలంబు లగు న్మణిరంగన్. 31

ర, స, స, గ.

తోదకమనువృత్తము.—

తోరపువేడుకఁ దోదకవృత్తా
కారముగాఁ ద్రిభకారగగంబుల్
నీరజనాభుని నెమ్మినుతింపన్
జారువిరామము షణ్మితి నొందున్. 32

భ, భ, భ, గ, గ.

అంద పదునొకండవత్రిష్టుప్ఛందంబునందు ఇంద్రవజ్రయను వృత్తము.—

సామర్థ్యలీలన్ తతజద్విగంబుల్
భూమిధ్రవిశ్రాంతులఁ బొంది యొప్పన్
ప్రేమంబుతో నైందవబింబవక్త్రన్
హేమాంబరుం బాడుదు రింద్రవజ్రన్. 33

త, త, జ, గ, గ.

అంద ఉపేంద్రవజ్రయనువృత్తము.—

పురారిముఖ్యామరపూజనీయున్
సరోజనాభున్ జతజద్విగోక్తిన్
దిరంబుగా నద్రియతి న్నుతింపన్
ఇరానుప్రాణేశు నుపేంద్రవజ్రన్. 34

జ, త, జ, గ, గ.

అంద ఉపజాతియనువృత్తము.—

పినాకికోదండము బిట్టుద్రుంచెన్
జానొప్ప గెల్చెన్ జమదగ్నిసూనున్
అనంతసత్త్వుం డితఁ డంచు మెచ్చన్
జానైనవృత్తం బుపజాతి యయ్యెన్. 35

క. సమపదము లింద్రవజ్రవి
షమపదము లుపేంద్రవజ్రఁ జను నుపజాతిన్
సమవిషమాంఘ్రులు తద్వ్య
త్క్రమమైనను నదియ పేరు కమలదళాక్షా ! 36

అందు రథోద్ధతమనువృత్తము.—

నందగోపవరనందనుఁ రమా
నందుఁ బ్రస్తుతి యొనర్చి షడ్యతిన్
అందమై రనరవాహ్వయంబు లిం
పొందఁ జెప్పిన రథోద్ధతం బగున్. 37

ర, న, ర, లగ. (దీనిపేరే పరాంతికము.)

అందు గీతాలంబనమనువృత్తము.—

నాళీకభవామరనాథు లోగిన్
శ్రీలోలుని గీర్తన సేయు నోగిన్
బోలంగఁ దజావలఁ బొందిన గీ
తాలంబన మై చను నద్రియతిన్. 38

త, జ, జ, వ. దీనిపేరే కలితాంతము. (కాంత యని, క. జ.)

అందు స్వాగతమనువృత్తము.—

నారదాదిమునినాయకవంద్యున్
శౌరిఁ జేరుఁ డన స్వాగత మొప్పున్
సారమైనయతి షణ్మితి నొందన్
భూరిరేఫనభముల్ గగయుక్తిన్. 39

ర, న, భ. గగ.

అంద శాలినియనువృత్తము.—

చేతోరాగం బుల్లసిల్లన్మతాగా
ద్యోతంబై షడ్వర్ణయుక్తిన్ విరామం
బేతేరంగా నిందిరేశ ప్రభావా
న్వీతం బైనన్ శాలినీవృత్త మయ్యెన్. 40

మ, త, త, గగ.

అంద శ్యేనియనువృత్తము.—

ఆరమాధినాథుఁ డక్షయంబుగాఁ
జీర లిచ్చె యాజ్ఞసేని కంచుఁబెం
పారఁ జెప్ప శ్యేని యయ్యె షడ్యతిన్
స్ఫారమై రజంబుపై రవంబుగాన్. 41

ర, జ, ర, వ.

అంద వాతోర్మియనువృత్తము.—

దేవాధీశున్ హరిఁ దేజోవనధిన్
భావింపంగా ఋతుభాస్వద్విరతిన్
ఈవాతోర్మిన్ మభ లేపారుఁ దకా
రాశ్వాసంబై లగ మర్థిన్ గదియన్. 42

మ, భ, త, లగ.

అంద భద్రికయనువృత్తము.—

నగణయుగమునన్ రవంబులన్
బ్రగుణరసవిరామసంగతిన్
తగిలి హరికథాసమేతమై
నెగడు కృతుల నిండె భద్రికన్. 43

న,న, ర,వ. (దీనికి జంద్రికయని పేరుగలదు. క. జ.)

పండ్రెండవజగతీచ్ఛందంబునందు భుజంగప్రయాతమనువృత్తము.—

భుజంగేశపర్యంక పూర్ణానురాగుఁ
భుజంగప్రభూతాఖ్యఁ బూరించుచోటఁ
నిజంబై ప్రయాతావనీభృద్విరామం
బజస్రంబుగాఁ గూర్ప యాద్యంద్య మొప్పున్. 44

య,య,య,య.

అంద తోటకమనువృత్తము.—

జలజోదరనిర్మలసంస్తవముల్
విలసిల్లెడుఁ దోటకవృత్తమునఁ
బొలుపై సచతుష్కముఁ బొందగ నిం
పలరారఁగఁ బల్కుదు రష్టయతిన్. 45

స,స,స,స.

అంద తోవకమనువృత్తము.—

చెలఁగి నజాయలఁ జెందిన నారీ
తిలకము లద్రియతిన్ మృదురీతిన్
వెలయఁగఁ దోవకవృత్తవిభాతిఁ
బలుకుదు రిమ్ములఁ బంకజనాభున్. 46

న,జ,జ,య. (దీనిపేరే తామరసము.)

అంద స్రగ్విణీవృత్తము.—

దేవకీనందనుఁ దేవచూడామణిఁ
భూవధూవల్లభుం బుండరీకోదరుఁ
భావనాతీతునిం బల్కఁగా స్రగ్విణీ
భావ మాద్యంత రేఫంబగున్ షడ్యతిన్. 47

ర,ర,ర,ర.

అంద ఇంద్రవంశమనువృత్తము.—

సొంపార నీదేవునిసూనుఁడై కదా
యింపిల్లఁ బుష్పాస్త్రుఁడు తాఁగ నాననన్
బెంపార భూభృద్వతి నింద్రవంశమున్
బెంపారఁ దాజంబులఁ జేర్చు రేఫతోన్. 48

త,త,జ,ర.

అంద వంశస్థమనువృత్తము.—

నమోనమో దేవ జనార్దనాయ తే
నమోనమః పంకజనాభ నావుడున్
రమించు వంశస్థవిరామమదుల్లన్
సమంచితంబై జతజంబు రేఫయున్. 49

జ,త,జ,ర.

అంద ద్రుతవిలంబితమనువృత్తము.—

శ్రుతి మతాంగని రూఢమహాయతిన్
యతివరప్రముఖార్యజనం బొగిన్
ద్రుతవిలంబిత తోషితరీతులన్
క్షితిధరున్ నుతిసేయు నభారిలన్. 50

న,భ,భ,ర.

అంద జలధరమాలయనువృత్తము.—

శ్రీతన్వీశుందగిలితిఁ జిత్తం బారన్
మాతా యంచున్ జలధరమాలావృత్తం
బేతేరంగా మభసమ లింపొందంగాఁ
బ్రీతిం బల్కన్ నిరతి కరిన్ బ్రాపించున్. 51

మ,భ,స,మ.

అందు ప్రియంవదంబనువృత్తము.—

త్రిభువనాభినుతు దేవదేవుఁగా
బ్రభు ముకుందు నిటు ప్రస్తుతింపఁగా
నభజర ల్గదిసినం బ్రియంవదా
విభవ మొప్పు గిరివిశ్రమంబులన్. 52

న,భ,జ,ర.

అందు ప్రమితాక్షరమనువృత్తము.—

కమనీయ తేజుని నగణ్యయశుఁ
గమలాధిపుం బలుకఁగా సజసల్
క్రమ మొప్పఁ గూడఁగ సకారముతోఁ
బ్రమితాక్షరం బహివిరామ మగున్. 53

స,జ,స,స.

అందు జలోద్ధతగతి యనువృత్తము.—

సరోరుహదళాక్ష శాశ్వతయశా
పురారినుత యంచు భూధరయతిం
సరాగ మగుచున్ జసల్ జసలతో
నురుప్రభ యగున్ జలోద్ధతగతిన్. 54

జ,స,జ,స.

అందు విశ్వదేవియనువృత్తము.—

జానొందం గావ్యశ్రీకి సంప్రీతితోడన్
మానాథు న్నాథుం జేసి మాయాగుణంబుల్
దీనిత్యుల్ ధాత్రీభృద్యతిం గూర్తు రింపుల్
తేనెల్ సోనల్ గా విశ్వదేవీసమాఖ్యన్. 55

మ,మ,య,య.

ఇదుమూఁడవయతి జగతీచ్ఛందంబునందు మత్తమయూరమనువృత్తము.—

భోజాధీశుం డంచుఁ బ్రభూతాత్మకుఁ డంచున్
భ్రాజిష్ణుం డంచున్ యతి బాగా గిరి సంజ్ఞన్
ఓజస్స్ఫీతంబై మతయోపేతసగంబుల్
ఓజం బల్కు న్మత్తమయూరం బలరారున్. 56

మ,త,య,స,గ.

అందు జలదమనువృత్తము.—

మ్రొక్కుల కెల్ల నెల్ల యగుమూర్తిగదా
యక్కమలాక్షుఁ డంచుఁ జతురాస్యయతిన్
దక్కక ప్రస్తుతింప జలదం బగు ని
ట్లొక్కటియై భరేఫనభ లొందు గురున్. 57

భ,ర,న,భ,గ.

అందు మంజుభాషిణి యనువృత్తము.—

దివిజేంద్రుఁ డాదియగు దేవసంఘముల్
భువి మంజుభాషిణికి భోగిరాడ్యతిన్
సవరింపఁగా సజసజంబు గాంతమై
భువనోదరస్తుతి యపూర్వమై చనున్. 58

స,జ,స,జ,గ.

అందు ప్రహర్షిణీయనువృత్తము.—

ముక్తిశ్రీకరు భవమోచను స్మరారిన్
భక్తిం బ్రోడజనులు ప్రస్తుతింప నొప్పున్
వ్యక్తగ్రావయతిఁ బ్రహర్షిణీసమాఖ్యన్
యుక్తంబై మనజరగోజ్జ్వలద్గణాప్తిన్. 59

మ,న,జ,ర,గ.

అందు ప్రభాతమనువృత్తము.—

సరసిజనాభ భుజంగరాజతల్పా
శరణము నీవని సన్నుతిం దలంపఁగ
బెరయు నజారలు పేర్మి నొప్పఁగఁ గఁ
జరగుఁ బ్రభాతము శైలవిశ్రమంబున్. 60

న,జ,జ,ర,గ.

అందు రుచిరమనువృత్తము.—

అనంగకోటివిలసదంగవైభవుఁ
మనంబులో నిలిపిన మాను నాపదల్
అనఁ జభంబులు సజగానుసంగతిఁ
దనర్చు నీరుచిరకు దంతిరాడ్యతిన్. 61

జ,భ,స,జ,గ.

పదునాలుగవశక్వరీచ్ఛందంబునందు వనమయూరమనువృత్తము.—

ఉన్నతము లై వనమయూరకృతు లోలిఁ
ఎన్నఁగ భజంబులపయి న్ననగగంబుల్
చెన్నొదవ దంతియతిఁ జెంది యలరారుఁ
వెన్నుని నుతింతురు వివేకు లతిభక్తిన్. 62

భ,జ,స,న,గగ. (ఇదే యిందువదనయనువృత్తము.)

అందు వసంతతిలక మనువృత్తము.—

గౌరీసితాంతజపకారణనామధేయుఁ
దూరీకృతప్రణతదుష్కృతు నంబుజాక్షుఁ
ధీరోత్తము ల్గిరియతిఁ దభజాగగ ల్పెం
పార వ్వసంతతిలకాఖ్య మొనర్తు రొప్పన్. 63

త,భ,జ,జ,గగ. (దీనిపేరె సింహోన్నతమును, వృద్ధర్షిణియును.)

అందు ప్రహరణకలితయనువృత్తము.—

వనరుహసఖుఁడున్ వనరుహరిపుఁడున్
గనుఁగవ యగునాకరివరదునకున్
ననభనలగము న్నగయతిఁ బలుకన్
బనుపడుఁ గృతులం బ్రహరణకలితన్. 64

న,న,భ,న,లగ.

అందు సుందరవృత్తము.—

కోరినకోరిక లిచ్చుఁ గోమలి చూడవే
మారునితండ్రి యనం గ్రమంబున నీక్రియన్
భారసవంబుల నొప్పుఁ బన్నగరాడ్యతిన్
సూరిజనంబులు సెప్ప సుందరవృత్తముల్. 65

భ,భ,ర,స,వ.

అందు అపరాజితయనువృత్తము.—

మునిజనవినుతుం డమోఘుజఘోన్నతుం
డనితరసదృశుం డనంగగురుం డనం
జను ననయుతమై రసంబు లగంబులై
తనరఁగ నపరాజితం బహిరాడ్యతిన్. 66

న,న,ర,స,లగ.

అందు అసంబాధయనువృత్తము.—

సౌమ్యంబై విష్ణుస్తుతులను నతి సవ్యంబై
రమ్యస్ఫూర్తిన్ రుద్రవిరమణము రమ్యంబై
గమ్యాకారం బొప్పు మతనసగగప్రాప్తిన్
సమ్యగ్భావంబై పొలుపమరు నసంబాధన్. 67

మ,త,న,స,గగ.

అంద భూసుతమనువృత్తము.—

శ్రీనివాస పురుషోత్తమ సింధువిహారా
పూని మమ్ముఁ గృపఁ జేకొని ప్రోవు మనంగా
భూసుతంబు రనభాగలఁ బొందిగయుక్తిన్
పూని సొంపుగ గ్రహాంకురముల్ వడినొందన్. 68

ర,న,భ,భ,గగ.

అంద కమలవిలసిత మనువృత్తము.—

నగణము నగణము నగణముఁ జేరన్
నగణము గగము నొనర నటమీఁదన్
దిగిభవిరమణము దిరమగునేనిన్
దగుఁ గమలవిలసితము కమలాక్షా! 69

న,న,న,న,గగ.

పదునేనవయతిశక్వరీచ్ఛందంబునందు మణిగణనికర మనువృత్తము.—

కనకపువలువలుఁ గరకటకములున్
నును పగుతురుమును నొసలితిలకమున్
దనరెడుహరిఁ గని తగననననసల్
నినిచిన మణిగణనికర మిభయతిన్. 70

న,న,న,న,స.

అంద మాలినియనువృత్తము.—

సకలనిగమవేద్యున్ సంసృతివ్యాధివైద్యున్
మకుటవిమలమూర్తిన్ మాలినీవృత్తపూర్తిన్
నకలితనమయోక్తి న్నాగవిశ్రాంతియుక్తిన్
సుకవులువివరింపన్ సొంపగున్విస్తరింపన్. 71

న,న,మ,య,య.

అందు సుకేసరమనువృత్తము.—

యతియవతారసంఖ్య నిడి యాదరంబుతో
నతిశయమై నజంబులు భజాంతరేఫలు౯
వితతముగా నొనర్చి యరవిందలోచను౯
క్షితిధరు సంస్తుతించిన సుకేసరంబగు౯. 72

న, జ, భ, జ, ర.

అందు మణిభూషణమనువృత్తము.—

హస్తిరాజభయనిర్హర యండజవాహనా
ధ్వస్తసంసరణ యంచుఁ బితామహవిశ్రమ
ప్రస్తుతంబుగ రనంబుల భారగణంబుల౯
విస్తరింప మణిభూషణవృత్తము చెల్వగు౯. 73

ర, న, భ, భ, ర.

అందు మనోజ్ఞయనువృత్తము.—

అజశివశక్రనిరంతరార్చితపద్ద్వయు౯
భుజగకులాధిపతల్పుఁ బూని నుతింపఁగా
నజయుతి నొంది నజాభరార్చిత మై చను౯
ఋజు వగు నుర్వి మనోజ్ఞ ముష్ణనురాగమై. 74

న, జ, జ, భ, ర.

పదునాఱవయష్టిచ్ఛందంబునందు ప్రియకాంతయనువృత్తము.—

అవనియు శ్రీయు నతులజుఁ డాత్మోద్భవుఁ డా పుత్రుల్.
దివిజులు దామోదరునకు దేవళ్ళిఁ కనేరీ
సవతు గ నాగా నయనయసమ్యక్సగయుక్తి౯
గవినుతమై దిగ్యతిఁ బ్రియకాంతాకృతి యొప్పు౯. 75

న, య, న, య, న, గ.

అంద పంచచామర మనువృత్తము.—

జ రేఫలుం జ రేఫలుం జసంయుతంబులై తగం
గురూపరిస్థితిం బొసంగి గుంఫనం బెలర్పఁగా
విరించిసంఖ్య నందమైనవిశ్రమంబులం దగం
బ్రియాఢ్యమైనఁ బద్మనాభ పంచచామరం బగుం. 76

జ,ర,జ,ర,జ,గ.

అంద పద్మకమనువృత్తము.—

నకలితంబు నభజాజగణంబులు గాంతమై
సకలదిగ్విరమణంబులు సన్నుతమై చనం
శకటదైత్యమదభంజన సన్నుతిసేయఁగాఁ
బ్రికటమైకృతులఁ బద్మము పద్మకుఁ బట్టగుం. 77

న,భ,జ,జ,జ,గ.

అంద ఫలసదనమనువృత్తము.—

ననలును ననలును దనరఁగ సగయుక్తిం
వనరుహాభవయతు లనహితమతితోడం
నినుపుచు సుకవులు మణివిలసదురస్కుం
గొనకొని పొగడఁగ నగు ఫలసదనంబుల్. 78

న,న,న,న,స,గ.

అందచంద్రశ్రీయనువృత్తము.—

జగన్నాథుం లక్ష్మీహృదయజలజపోద్యద్దర్కుం
ఖగాధీశారూఢుం సుకవిజనకల్పద్రుమంబుం
దగ నవ్వర్ణింపంగా యమనసయుతంబై రగంబుల్
మొగిం జంద్రశ్రీకిన్నిలుచు యతి ముక్కంటి నొందుం. 79

య,మ,న,స,ర,గ.

అంద మేదినియనువృత్తము.—

నగణముతో జకారభగణంబులుఁ జకార
ప్రగుణితరేఫయుఁ గురువు భాతిగాఁగ నోలిఁ
దగ నవతారవిశ్రమము దండిగా నొనర్పఁ
మృగమదవర్ణఁ డీయకొను మేదినీసమాఖ్యన్. 80

న,జ,భ,జ,ర,గ.

పదునేడవయత్యష్టిచ్ఛందంబునందు నర్కుటమనువృత్తము.—

కొలిచెద నందగోపసుతుకోమలపాదములఁ
దలిచెదఁ బూర్వసంచితపుదోషములన్ సుఖినై
నిలిచెద నన్న నర్కుటము నిర్మలవృత్తి మగుఁ
సలలితమై నజంబుల భజావల దిగ్విరతిఁ. 81

న,జ,భ,జ,జ,వ.

అంద శిఖరిణియనువృత్తము.—

గజేంద్రాపధ్వంసిఁ ముదిరసదృశుం గంజనయనుఁ
భజింతుం దాత్పర్యంబున ననిశో భాస్కరయతిఁ
ప్రజాహ్లాదం బైనఁ యమనసభవప్రస్ఫురితమై
ద్విజశ్రేష్ఠు లెచ్చఁ శిఖరిణి గడుఁ విశ్రుతమగుఁ. 82

య,మ,న,స,భ,వ.

అంద మందాక్రాంతమనువృత్తము.—

చెందెం బాదాంబుజరజముచే స్త్రీత్వ మారాతికిం జే
యందెం జాపం బిరుతునుకలై యద్భుతం బావహిల్లఁ
జుల్చిందె న్నారొడ్డి దశముఖుఁడుఁ రాముచే నంచుఁ జెప్పఁ
మందాక్రాంతఁ మభనతతగా మండితాశాయతుల్గాఁ. 83

మ,భ,న,త,త,గగ.

**అంద పాలాశదళమనువృత్తము.—**

పదినయిదులఘువులును బరఁగ గగ మొందఁ
బదియగు నెడ విరతులు బలసి పాడనూఁప
బాదలి హరినుతులఁగడుఁ బొలుపగుచుఁ బాలా
శదళ మనఁబరఁగుఁ గవిజనులు గొనియాడఁ. 84

15 లఘువులు గగ.

**అంద పృథ్వీయనువృత్తము.—**

జసంబులు జసంబులుఁ యులగసంగతిఁ సాంగమై
పాసంగ నమృతాంశుభృద్యతులు పొందఁ బాదంబులై
బిసప్రసవలోచనావినుముపృథ్వినాఁబృథ్వలో
న సంశయముగుఁ భవద్వినుతులందు నింపొందినఁ. 85

జ, స, జ, స, య, లగ.

**అంద హరిణీయనువృత్తము.—**

జరగు ననమపోద్యదేఫల్ ననంగతమై లగల్
పారయుఁగ మురద్వేషిఁ సద్భక్తితో వినుతించెదఁ
సరసిరుహాగర్భశానాదిత్యసత్తము నన్నచో
హరిణీ యనువృత్తం బొప్పారుఁ బురారి విరామమై. 86

న, స, మ, ర, స, లగ.

**పదునెనిమిదవధృతిచ్ఛందంబునందు మత్తకోకిలయనువృత్తము.—**

ఒక్కచేత సుదర్శనంబును నొక్కచేతను శంఖముఁ
ఒక్కచేతఁ బయోరుహంబును నొక్కచేత గదం దగఁ
జక్కడం బగుమూర్తికిఁ రసజాభరంబులు దిగ్యతిఁ
మక్కువం దగఁ బాడి రార్యులు మత్తకోకిలవృత్తమున్. 87

ర, స, జ, జ, భ, ర.

అందు కుసుమితలతావేల్లితయనువృత్తము.—

శ్రీనాథుఁ బ్రహ్మాద్యమరవరసంసేవ్యపాదారవిందుఁ
దీనానాథవ్రాతభరసుగుణోదీర్ణునిం బాడి రోలిఁ
గానారూఢాత్ముల్ మతనయయయుల్ కామజిద్విశ్రమంబై
వీనుల్ నిండారం గుసుమితలతావేల్లితావృత్త మొప్పఁ. 88

మ,త,న,య,య,య.

పందొమ్మిదవ యతిధృతిఛందంబునందు శార్దూలవిక్రీడితమనువృత్తము.—

పద్మప్రోద్భవసన్నిభుల్ మసజసప్రవ్యక్తతాగంబులుఁ
బద్మాప్తాంచితవిశ్రమంబుగ సముత్పాదింతు రుద్యన్మతిఁ
బద్మాక్షాయనిజాంఘ్రిసంశ్రితమహాపద్మాయ యోగీంద్రహృ
త్పద్మస్థాయ నమోస్తు తే యనుచు నీశార్దూలవిక్రీడితన్.

మ,స,జ,స,త,త,గ.

అందు తరళమనువృత్తము.—

జలరుహాహితసోదరీముఖ చంద్రచంద్రిక లాదటన్
గొలఁదిమీఱఁగ లోచనంబుల గ్రోలి యొప్పుమహాసుఖిఁ
బలుకుచో నభరంబులుం బిదపఁ నజంబు జగంబులుఁ
జెలువుగా దరళంబునోలి రచింతు రంధకజిద్యతిఁ. 90

న,భ,ర,స,జ,జ,గ.

అందు మేఘవిస్ఫూర్జితమనువృత్తము.—

రమానాథునాథుఁ యదుకులశిరోరమ్యరత్నాయమానుఁ
సముద్యత్తేజిష్ణుఁ దనుజయువతిస్ఫారహారాపహారుఁ
మిము బ్రీతింజేరో గొండ్రిరుణవిరతిఁ మేఘవిస్ఫూర్జితాఖ్యన్
గ్రమంబొప్పఁ బెద్దల్ యమనసములుఁ రాగముల్గాముకుందా.

య,మ,న,స,ర,ర,గ.

అంద భూతిలకమనువృత్తము.—

వాఁడె వధూమణి చూడవె త్రిదివద్రుమంబు ధరిత్రికిన్
బోఁడిమి దెచ్చినశూరుఁ డితనిఁ బోలలే రిల నెవ్వరున్
వీఁ డధికుం డని భీమవిక్రమవృత్తి భూతిలకం బగున్
వేఁడి నుతింతురు భారసంబుల వెంట జాగము లొందఁగన్.

భ, భ, ర, స, జ, జ, గ.

అంద చంద్రకళయనువృత్తము.—

వీనులారఁ బ్రసిద్ధపదంబుల్ వేడుకఁ గూర్చి దిశాయతిన్
గాన వచ్చి రసాతజజంబుల్ గల్గ దిటంబుగఁ జెప్పఁగన్
జానకీవదనాంబుజశశ్వత్సౌరభలోలమధువ్రతా
దానవాంతక చంద్రకళావృత్తంబు సభం గడు నొప్పుగున్.

ర, స, స, త, జ, జ, గ

ఇరువదియవ కృతిచ్ఛందంబునందు మత్తేభవిక్రీడిత మనువృత్తము.—

భవరోగ ప్రవినాశనౌషధకలాప్రావీణ్యగణ్యుండు శై
లవిభేదిప్రముఖాఖిలామరదరోల్లాసుండు గోవిందుఁ డం
చు వివేకు ల్సభరంబులు న్నమయవస్తోమంబు గూడన్ సమ
ర్మవిధిం జెప్పుదు రాత్రయోదశయతి న్మత్తేభవిక్రీడితన్. 94

స, భ, ర, న, మ, య, వ.

అంద అంబురుహంబను వృత్తము.—

తారతుషారపటీరమరాళసుధాసమానమహాయశా
నీరదభృంగతమాలదళాసితనీరజేంద్రమణిద్యుతీ
హారకిరీటముఖాభరణాంచిత యంచు శ్రీపతిఁ గూర్చి భా
భారసవంబుల భానువిరామముఁ బల్కు నంబురుహం బగున్.

భ, భ, భ, భ, ర, స, వ.

## ద్వితీయాశ్వాసము.

అందు ఉత్పలమాలయనువృత్తము.—

శ్రీరమణీముఖాంబురుహసేవనషట్పద నాథ యంచు శృం
గారరమేశ యంచు ధృతకౌస్తుభ యంచు భరేఫనంబులన్
భారలగంబులుం గదియఁ బల్కుచు నుత్పలమాలికాకృతిన్
గారవ మొప్పఁ జెప్పుదురు కావ్యవిదుల్ యతితొమ్మిదింటగాన్.

భ,ర,న,భ,భ,ర,లగ.

అందు ఖచరప్లుతమనువృత్తము.—

వరద కేశవ దైత్యవిదారీ వారిజనాభ జగన్నిధీ
కరుణఁ జూడుము మమ్ముఁ బ్రసన్నాకార హరియనిపల్కన
వరుసతో నభభంబు మసావల్ వాలఁగ రుద్రవిరామ మై
యరుదుగా మునిపుంగవవర్ణ్యంబై ఖచరప్లుత మొప్పగున్.

న,భ,భ,మ,స,స,వ.

ఇరువదియొక ప్రకృతిచ్ఛందంబునందు చంపకమనువృత్తము.—

త్రిభువనవంద్య గోపయువతీజనసంచితభాగధేయ రుక్
ప్రభవసముత్కరోజ్జ్వలశిరస్థితరత్నమరీచిమంజరీ
విభవసముజ్జ్వలత్పదరవింద ముకుంద యనంగ నొప్పునా
జభములు జాజరేఫములుఁ జంపకమాల కగున్ దిశాయతిన్.

న,జ,భ,జ,జ,జ,ర.

అందు స్రగ్ధరయనువృత్తము.—

తెల్లంబై శైలవిశ్రాంతిని మునియతినిం
దేజరిల్లున్ దృఢంబై
చెల్లం బెల్లై మకారాంచితరభనయయుల్
చెంద మీఁదన్ యకారం

బుల్లం బారఁ బుధారాధ్యు సురగశయనుఁ
యోగివంద్యుం గడున్ రం
జిల్లం జేయంగవీంద్రుల్ జితదనుజగురుం
జెప్పుదుర్ స్రగ్ధరాఖ్యన్. 99

మ, ర, భ, న, య, య, య.

అంద వనమంజరియనువృత్తము.—

హరి పురుషోత్తమ కృష్ణకృపానిధియాదిమూలమయంచు నా
కరిపతి పల్కఁగఁ గాచె నితం డని కౌతుకంబునఁ బల్కరుఁ
జరగుఁ ద్రయోదశవిశ్రమముల్ నజజాజభాంచితరేఫలఁ
మరుగురునిం బ్రణుతింతురిలఁ వనమంజరిం గవిపుంగవుల్. 100

న, జ, జ, జ, జ, భ, ర.

అంద మణిమాల యనువృత్తము.—

శరణాగతార్తిహర ణాంబుజాతదళసన్నిభాంబక యుగా
కరుణాసముద్ర జగదాదికారణ పురాణమూర్తి యనుచుఁ
వరుసఁ సజత్రితయముఁ ద్రివార మొనరుఁ సకారముతుదిఁ
దిరమొంద దిగ్యతిఁ గవు ల్నుతింపమణిమాలవృత్తమమరున్.

స, జ, స, జ, స, జ, స.

అంద లాటీవిట మనువృత్తము.—

సగణంబులు నాల్గిటిపై మతయల్ సమ్యగ్భావంబై యరుదేరఁ
బగలింటికి నేలిక యెవ్వఁడు నా భావింపంగా నమ్యోవడుల్
మిగుల న్మధురంబగుశబ్దములఁ విశ్రాంతిఁ లాటీవిటవృత్తం
బగు నిందుకళాధరసన్నుతనామాంకా శంకాతంకవిదారీ! 102

స, స, స, స, మ, త, య.

ఇరువదిరెండవ యాకృతిచ్ఛందంబునందు మానిని యనువృత్తము.—

క్రొన్నెలపువ్వను గోఱలపాఁగయుఁ
    గూర్చినకెంజడకొప్పునకున్
వన్నె యొనర్చినవాహిని యీతని
    వామపదంబున వ్రాలె ననన్
జెన్నుగ శద్రిభ సేవ్యగురు న్విల
    సిల్లు రసత్రయ చిత్రయతుల్
పన్నుగనొందఁ బ్రభాసురవిశ్రమ
    భంగిగమానినిభవ్యమగున్. 103

భ,భ,భ, భ,భ,భ,భ,గ.

అంద మహాస్రగ్ధరయనువృత్తము.—

కొలిచెం బ్రోత్సాహవృత్తిం
    గుతలగగనముల్ గూడ రెండంఘ్రులం దా
బలిఁ బాతాళంబు చేరం
    బనిచెఁ గడమకై బాపురే వామనుం డ
స్ఖలితాటోపాఢ్యుఁ డంచుం
    గరిగిరివిరమాకారి మారన్ సతానో
జ్జ్వలసోద్యద్రేఫయుగ్మా
    శ్రయగురుల మహాస్రగ్ధరం జెప్ప నొప్పున్. 104

స,త,త,న,స,ర,ర,గ.

అంద భద్రకమనువృత్తము.—

ఆది భఁ జేసియవ్వలరనద్వయంబునొగిమూఁడుతానకములన్
బాదుకొనంగ నొక్కగురువొంద బై విరతి రుద్రసంఖ్య నిడినన్

గాదనరాదుభద్రకమునాఁగగాఢమగువృత్తమొప్పఁగృతులన్
శ్రీదనరార నాశ్రితవితానచింతితఫలప్రదాన నృహరీ! 105

భ,ర,న,ర,న,రన,గ.

ఇరువదిమూఁడవ వికృతిచ్ఛందంబునందు కవిరాజవిరాజితమనువృత్తము.—

కమలదళంబులకై వడిఁ జెన్నగు
    కన్నులు జారుముఖప్రభలున్
సమధికవృత్తకుచంబులునొప్పఁగ
    శైలరసర్తువిశాలయతిన్
సముచితనాన్వితషడ్జలగంబుల
    జానుగఁ బాడిరి చక్రధరున్
రమణులు సొంపలరం గవిరాజవి
    రాజితమున్ బహురాగములన్. 106

న,జ,జ,జ,జ,జ,జ,లగ.

అందు అశ్వలలితమనువృత్తము.—

ఇనవిరమంబున న్నజభజంబులింపుగ భజంబులున్ భవములై
చనఁ జన నొప్పునశ్వలలితంబుసత్కృతుల జెప్పఁగావిశదమై
యనుపమవైభవోజ్జ్వల హరీ సహస్రకరదోర్ద్విదారణచణా
నినుఁగొనియాడధన్యుఁడుగదయ్య నీకరుణదాననంతమగుటన్.

న,జ,భ,జ,భ,జ,భ,వ.

అందు పద్మనాభమనువృత్తము.—

మున్నెవ్వరున్ లేనికాలంబునన్ సృష్టి
    మూలంబుగా బద్మగర్భున్ సృజించెన్
మున్నీటిలోఁ బాఁపతల్పంబు పై వెన్ను
    మోపెం ద్రిలోకంబులుం గుక్షి నుండన్

ఎన్నంగ నీతండనాద్యంతుఁ డంచుఁ ని
రీక్షింతురెవ్వాని వాఁ డెల్లనాడుఁ
నన్నేలు నా నర్క విశ్రాంత మై పద్మ
నాథం బగుఁ స్తుతంబు ల్గగంబున్. 108

త, త, త, త, త, త, త, గగ.

ఇరువదినాలుగవసంకృతిచ్ఛందంబునందు అష్టమూర్తియనువృత్తము.—

శ్రీనాథుఁ సరసిజాక్షుఁ సితసరోజాతనాథుఁ
జితనిశాటవరేణ్యుఁ
గానోదంచితరసజ్ఞుం గరిభయధ్వాంతభానుఁ
గనకవస్త్రవిలాసుఁ
జానొందన్ నతయుక్తిఁ సరభజల్ యాంతమై కుం
జరయతిద్వయ మొప్పం
గా నిట్లింపెసఁగఁ జెప్పం గవిజనం బష్టమూర్తిఁ
ఘనసమామ్నాయరీతిఁ. 109

మ, న, త, స, ర, భ, జ, య.

అంద సరసిజమనువృత్తము.—

మాళిం బిల్లంగోలాకచేత
న్నటియొకకరమునమణిమయలతయుఁ
బాలశ్రేణు ల్స్రోలిల వసింపఁ
బసులనొడిగిచనుపసగల ప్రభువుఁ
జాలంగొల్వంజాలినకోర్కుల్
సఫలములగుననసరసిజమమరుఁ

భోలఁ బ్రహ్మఁ భోగివిరామ
స్ఫురదురుమతయనములుననసలుఁ. 110
మ, త, య, న, న, న, న, స

అందు క్రౌంచపదమనువృత్తము.—

కాంచనభూషాసంచయ మొప్పఁ
ఘనకుచభరమునఁ గవ నసియాడఁ
జంచలనేత్ర ల్వంచనతోడఁ
సముచితగతి వెనుచని తనుఁగొల్వఁ
అంచితలీల న్మించినశౌరిఁ
హరిదిభపరిమితయతు లొనఁగూడఁ
ముంచి రచింపం గ్రౌంచపదం బి
మ్మొగి భమసభననముల నయ మొందుఁ. 111
భ,మ,స,భ,న,న,న,య.

ఇరువదేనవయతిక్కృతిచ్ఛందంబునందు బంధురమనువృత్తము:—

ఋభువులు దితితనయులు సమబలులై
యెంతయు మత్సరము ల్బెరయఁ
రభస మలరఁ గలశనిధిఁ దఱవఁగం
గ్రక్కున గ్రవ్వఁపుగొండకు నీ
ప్రభు వనువుగ గుదురుగ నిలిచె ననం
పంచదశాక్షరవిశ్రమమై
ప్రభ మిగులఁగ నననననసభభభగల్
బంధురవృత్తము జెప్పఁదగున్. 112
న, న, న, న, స, భ, భ, భ, గ.

అంద భాస్కరవిలసితమనువృత్తము:—

గోపనికరముల నేలినవానిన్
గోవృషదనుజుల నడఁచినవానిన్
గోపికలను భ్రమయించినవానిన్
గుబ్జకు విలసన మొసఁగినవానిన్
గోపకులము వెలయించినవానిన్
గొల్చెద మని బుధు లినయతిఁ బల్కన్
బ్రాపుగ భనజయభాశ్రితనాసల్
భాస్కర విలసిత మగు గురుయుక్తిన్. 113

భ, న, జ, య, భ, న, న, స, గ.

ఇరువదియావయుత్కృతిచ్ఛందంబునందు భుజంగవిజృంభితమనువృత్తము.—

స్వారాజారివ్రాతారాతీశశితపనసమనయన
సర్వదామునివందితా
గౌరీశాద్యామర్త్యస్తుత్యా కమలభవజనక మధు
కైటభాసురమర్దనా
శ్రీరామాహ్వా త్స్వామీ యంచున్ జెలఁగి మమతననల
జెంద రేఫసలున్ లగన్
ఘోరాఘౌఘా భిద్వేషిం బేర్కొనఁగవసుదశయతియు
గున్ భుజంగవిజృంభితన్. 114

మ,మ,త,న,న,న,ర,స,లగ.

అంద మంగళమహాశ్రీయనువృత్తము.—

చిత్తములఁ జూపులను జిత్తజునితండ్రి పయిఁ
జెంది గజదంతియతు లొందన్

వృ త్తములతోడఁ దరుణీమణులు గానరుచు
లింపుగను మంగళమహాశ్రీ
వృ త్తములఁ బాడిరి సువృ త్తకుచకుంభముల
వింతజిగి యెంతయుఁ దలిర్పఁ
మ త్తిలుచు నబ్జజననంబు లిరుచోటులఁ ద
నర్పఁగఁ దుదఁ గగ మెలర్పన్. 115

భ,జ,స,న,భ,జ,స,న,గగ.

ఇవి సమవృ త్తభేదములు.

వ. మఱియు నర్ధసమవృ త్తవిషమవృ త్తంబు లెట్టివనిన.— 116

క. ధర నొకటియు మూఁడును నగు
చరణంబులు మఱిద్వితీయచాతుర్థికవి
స్ఫురితాంఘ్రులుఁ దమలోనను
సరి యగునర్ధసమవృ త్తచయమునఁ గృష్ణా! 117

గీ. జరగు నందు స్వస్థానార్థ సమమనంగ
ఛందమొకటన నిట్టిలక్షణముదగుల
నమరు నట పరస్థానార్థసమము నాఁగ
నెలమిఁ దరువాతి ఛందంబు గలయఁ గృష్ణ. 118

సీ. విషమవృ త్తంబుల వెలయుపాదంబుల
గణములు వేర్వేఱుగా నొనర్ప
నవియ స్వస్థానంబు నటపరస్థానంబు
సర్వపరస్థానసంజ్ఞికంబు

నొక్కచందంబున నొగిఁ గొని పాదముల్
వేత్రైన స్వస్థానవిషమ మయ్యె
నొకపాద మొక్కట నున్నపాదంబులు
క్రిందటిఛందంబునందు నైన
తే. మీఁది ఛందంబునందైన మెఱయఁ జెప్ప
నవి పరస్థానవిషమవృత్తాహ్వయములు
వెండి సర్వపరస్థానవిషమమునకు
నన్నియును జెప్పఛందంబు లబ్జనాభ. 119

స్వస్థానార్ధసమవృత్తములలో నారీప్లుతమనువృత్తము.—
క్షీరోదన్వన్మధ్యగేహా మతాగా
సారంబు నుద్యత్తతజ ల్గగంబుల్
బూరింపంగాఁ బాదముల్ రెంట రెంటన్
నారీప్లుతం బయ్యె ననంతమూర్తీ! 120

పరస్థానార్ధసమవృత్తంబులలో మనోహరమనువృత్తము.
శ్రీరాజ రమేశ తజావము లు
ద్ధుర మైనసకారచతుష్కముతోఁ
గూరంగ సగంబులు గూడి మనో
హారవృత్తము చెల్వగు నద్రిధరా! 121

స్వస్థానవిషమవృత్తంబులందు అంగజాస్త్రమనువృత్తము.—
భూరిభమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్థంబై యటసామ్ముల్
శౌరీ వినుసజంబు గాంతమై
యారూఢం బగు నంగజాస్త్రమున్. 122

అందు వరాంగియనువృత్తము.—

నరిత్పదాబ్జా జతజల్ గగల్ బం
ధురం బగుఁ రెంటఁ జతుర్థకాంఘ్రిన్
గారాముతోఁ దాజగగల్ వరాంగిన్
హారార్చితా మూఁడవయంఘ్రి నొందున్. 123

అందు నదీప్రఘోషయనువృత్తము.—

నాగతల్పా మొదల్ల్లు రేఫంబులున్
జగన్నివాసా జతజంబు రేఫయున్
దగంగ నమ్మూఁడుపదంబులందు జా
తిగాఁ బ్రవర్తించు నదీప్రఘోషన్. 124

పరస్థానవిషమవృత్తంబులందు శ్రీరమణమనువృత్తము.—

ధాత్రి భమంబుల్ తత్సగ మూఁడిన్
భత్రయగాగణపద్ధతి మూఁటన్
గోత్రధరా యిటు గూర్పఁ బదంబుల్
చిత్రగతిం జను శ్రీరమణంబుల్. 125

అందు రథగమనమనోహరమనువృత్తము.—

రథగమన మనోహరంబు రెండవాంఘ్రిఁ
బ్రథితం బగుఁ సజజంబు రప్రయుక్తయుంబుఁ
బ్రథమపదమునందుఁ బైసగంబునందుఁ
గథితననరజంబు గద్వయంబుఁ గృష్ణా! 126

సర్వపరస్థానవిషమవృత్తములందు వీణారచనమనువృత్తము.—

వీణారచనం బయ్యెఁ భువిన్ తయసాగల్
బాణప్రహరా తజనభభవ్యగగంబుల్

చాణూరహారా తజనభస ల్ప్రికటయతిన్
వేణుధర భనసభసవి శ్రుత మగుచున్. 127

ఇతెలుంగు గాక సమవృత్తంబులలో పంచపాది యనువృత్తము.—

క. పాదచతుర్వృత్తంబున
నాదరమునఁ బంచపాది యనుసమవృత్తం
బై దవపదంబు గలిగిన
మాదయితా కృతులయందు మహనీయ మగున్. 128

ఉ. శ్రీసతిఁ బేరురంబున ధరించినభోగి చతుర్ముఖుండు నా
భీసరసీరుహంబునకు బిడ్డఁడుగా విలసిల్లుమేటి కై
లాసనగాలయుండు జడలన్ సవరించినయేటిపుట్టినిల్
భాసురపాదపద్మ మగుబల్లిదుఁ డీవ్విభుఁ డంచు సన్నుతుల్
సేసిరి సన్మునీంద్రు లనఁ జెన్నగువృత్తము పంచపాది యై.

క. పరఁగఁగ నిరువదియాఱు
క్షరములకును నధిక మగుచుఁ జరణంబుల ను
ద్ధురమాలావృత్తంబులు
జరగు లయగ్రాహిమొదలు జలరుహనాభా! 130

ఏకోనచత్వారింశ త్సాత్రాగర్భితంబుఁ ద్రింశదక్షరంబు లైన
లయగ్రాహి.—
ఎందు నిల నేజనులకుం దలఁపరానితప
మందికొనిచేసిరొకొ నందుఁడు యశోదా

సుందరియుఁ బూర్ణనిధిఁ బొందిరి కడున్దొరసి
పొందగునుముప్పుతఱి నందనునిగా శ్రీ
మందిరుని నంచు నిఱు లందముగఁ బ్రాసములు
గ్రందుకొని చెప్పెనునిబృందములయుగ్రా
హిం దనర నబ్భజసలుం దగ నకారమును
బొంద నిరుచోట్లను బిఱుంద భయ లొందన్. 131

ఏకోనచత్వారింశన్మాత్రాగర్భితపాదంబును చతుస్త్రింశదక్షరంబునయిన లయవిభాతి.—

పడయరె తనూభవులఁ బడయుదురు గాక పెర
పడఁతులును భర్తలును బడసిరె తలంపన్
బుడమిఁ గలనందుఁడును బడఁతుక యశోదయును
గడుపున జగత్త్రయము నిడికొనినపుత్త్రున్
బడసిరఁట యంచు బెడఁ గడరుననసత్రివృతి
గడనసగముల్ పొసఁగ నిడ లయవిభాతిన్
నొడువుదురు సత్కవు లెపుడును విరితేనియలు
వడియు పగిదిన్ రసము గడలుకొనుచుండన్. 132

ఏకోనచత్వారింశన్మాత్రాగర్భితపాదంబును సప్తత్రింశదక్షరంబునయిన లయహారియనువృత్తము.—

చదువులును గిదువులును జదువ ధన మొదవు నని
మదిఁ దలఁపవలదు మును జదివిరె ధరిత్రిన్
సదమలసహృదయుఁ డనఁ బొదలుదితిసుతసుతుఁడు
మొదలఁ బలికినపలుకు చదువఁగ ముకుందుం

డద నెత్తిఁగి కదిసెఁ గద! చదివినభృగువుకొడుకు
    చదువుతుది నొకపనికి నొదవెనె యటంచున్
పదునొకఁడు నగణములు గదిసి సగమెనయు భువి
    విదితముగ బుధులు వలుకుదురు లయహారిన్. 133

అంద త్రిభంగియనువృత్తము.—
నననననననసనశుభమసగలును
    దనరి నటింపఁ గణంక నఁలువంకం బెంపుదొలంకన్
మునుకొని నఖముఖములు వెడఁగదలుపఁ
    జను గడునొప్పగువీణ నెరజాణల్వేలుపుగాణల్
వనరుహజనితునితనయులు మొదలుగ
    ఘనమతు లాదట తోడ శ్రుతిగూడ న్వెన్నునిఁబాడన్
వినఁ గలిగిన నది జననముఫల మని
    మునిజను లిందు శుభాంగుఁ దగుభంగిఁ జెప్పఁ ద్రిభం
[గిన్.

అంద అనియతాక్షరంబైన దండకము.—
సిరి నేలురసికుండు శ్రీవత్సవక్షుండు నీరేరుహాక్షుండు నిత్యా
సదృక్షుండు త్రైలోక్యసంరక్షణోపాయదక్షుండు మాపాలి
దేవుండు ధీరుం డుదారుం డితం డిచ్చు మాయిచ్చకు న్వచ్చు
సౌఖ్యమ్ము లంచు న్మదిం గోరి పెద్దల్ సకారంబుతో సంగ
తంబై నహం బాది నొండేఁ దకారాదిగా నైన; లో నెల్ల
చోటఁ దకారంబులం బెల్లు చెందఁ గకారావసానంబు నై
దండకాకార మేపారఁ గీర్తింతు రెల్లప్పుడున్. 135

గద్యము. ఇది శ్రీవాణీవర ప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య తనుసంభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయ ప్రణీతంబైన ఛందోదర్పణంబునందు నుభయభాషానురూపంబు లగు గద్యపద్యంబులవిధంబును షడ్వింశతిచ్ఛందోనామంబులును, తదుద్భవంబు లగుసమవృత్తంబులును, వృత్తమిశ్రంబు లగు నర్ధసమవిషమవృత్తంబులును, ఛందోఽతిరిక్తంబు లగుమాలావృత్తంబులును, దద్భేదం బగుదండకంబు నన్నది ద్వితీయాశ్వాసము.

శ్రీరామాయనమః.

# ఛందోదర్పణము

## తృతీయాశ్వాసము.



మదనంతశయన భవ
భీమదహన నిఖిలహరణభీషణవర్షా
సామజభీతినివారణ
కామజనక శిష్టలోకకామితవరదా! 1

### కందములు.

క. నలనగభజనలు కందం
బుల మూఁడును నైదు షష్ఠముల నలజలు జే
నుల జగణరహిత మంత్యగ
మలఘుపద త్రిగణవిరతి యర్ధముల హరీ! 2

గీ. కంక మరయ నార్యాగీతికడగణంబు
నపరషష్ఠంబు గురులఘు లైననార్య
నలఘు లాఱింట గిరిశరస్థలుల నున్న
నగు ద్వితీయ ప్రధానలఘ్వాదియతులు. 3

ఈచెప్పిన యతినియమంబులు సంస్కృతాదులకయ్యె. మఱియుఁ
దెలుఁగున కెట్లనిన:—

క. వడి యగు నార్యకు రెండవ
యడుగునఁ ద్రిగణంబుమీఁద నంధ్రకవితకున్.

గడపటిపాదమునకు వడి
యడరును ద్విగణయుతలఘువు కవ్వలిచోటన్. 4

గీ. సరవిఁ బథ్య విపుల చపలార్య ముఖజఘ
నాఖ్యచపల లనఁగ నార్య లైదు
నొనర గీతి యనఁగ నుపగీతి యుద్గీతి
యార్యపేరిగీతి యనఁగ నాల్గు. 5

పథ్యార్య.

క. బేసులు త్రిగణయుతము లై
యాసమపాదములఁ బొరసి యార్య యనఁ గడున్
భాసిల్లుఁ బథ్య యనఁగా
వాసవముఖసకలదివిజవర్గప్రణుతా! 6

విపులార్య.

క. ప్రకటసమపాదముల నిలు-
వక శబ్దమునవలఁ జొచ్చి వచ్చె ననం ద
క్కక విపులార్య యగును సే
వకజనమందార ధీర వనజదళాక్షా! 7

చపలార్య.

క. వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురణ న్మధ్యగజకారములును దగన్ రెం
డరయఁగఁ దనర్చునేనిన్
సరవి నదియ హరి మురారి చపలార్య యగున్. 8

ముఖచపలార్య:

క. చపలాగణప్రకారం
బపారకారుణ్యసాగర ప్రథమార్థం

బవరం బగు*చున్నది ముఖ
చపలార్య యనంగఁ జనును జక్కఁగఁ గృతులన్. 9

జఘనచపలార్య.

క. మొదలిసగము చపలార్యా
స్పదగణలక్షణము సొరక చరమార్థం బం
దుదితప్రకారరేఖన్
గదాధరా చను గృతుల జఘనచపలార్యన్. 10

గీతి.

క. లసదార్య మొదలిసగమున
నెసఁగఁగ రెండరలుఁ జెప్పిరే నదియే గీ
తిసమాహ్వయ మగుఁ గృతులన్
వసుధాధర కృష్ణ యాదవస్వామి యనన్. 11

ఉపగీతి.

క. ధర నార్యమీఁదిసగమున
నిరుసగమున నట్ల చెప్పిరేని యదియ దాఁ
బరఁగు నుపగీతి యనఁగా
సరసిజదళనేత్ర కృష్ణ శార్ఙ్గధర హరీ! 12

ఉద్గీతి.

క. విదితార్యచరమదళమున్
మొదలిసగము చేసి యందు మొదలింటిసగం
బది యపరార్థముఁ జేసినఁ
బాదు పగు నుద్గీతి భుజగభుగ్వరగమనా! 13

* నే తన్నది.

### ఆర్యాగీతి.

క. కందములకుఁ గలనియమము
లం దేమియుఁ గడమ వడక యడరిన నది యిం
పొందఁగ నార్యాగీతి య
నం దగు ని ట్లురగభూషణ ప్రణుతగుణా ! 14

### సమ విషమగీతులు.

క. అమర మఱిగీతులందు వి
షమగీతులు మూఁడు రెండు సమగీతులు నై
సమము లగు నవకలి ప్ర
సముల యతుల విషమములఁ బొసఁగు ప్రావళ్లున్. 15

విషమగీతులందు ఎత్తుగీతి.—

ఆదిప్రాసంబు వారియు
నాదిత్యయుగము నగుచు
నిదె సమయతుల నెత్తు
గీదియ నెగడుఁ గృష్ణ. 16

పవడగీతి.—

పవడగీతియందుఁ బ్రాసంబు నిలిచి మూఁ
డవగణంబుమీఁద నమరు విరతి
రవులు మువ్వురుఘు బురందరు లిద్దఱు
నవుల నేగు రినులు నర్థముఁలకు. 17

కొలనగీతి.—

నగణమొండె వగణమొండె నగణవగణయుగము
తగిలియొండె న స్తసంఖ్య తత్పదంబు లమరఁ

దగఁ జతుర్థగణముపై నుద్దాత్తవిశ్రమంబు
నిగుడుమేలనాఖ్యగీతి నేయుఁబ్రాస మొదవి. 18

సమగీతులందు ఆటవెలఁది.—

ఇనులు మువురు పాద నిద్ద రింద్రులు మృదం
గములు దాల్ప వంశకాహళాదు
లేగురర్కు లూఁద నిరుమేళగతి నాట
వెలఁది యొప్పుచుండు విష్ణుసభల. 19

తేటగీతి.—

ఒక్కఁ డర్కుఁ డిద్దఱుజిష్ణు లొనర మఱియు
నిద్ద అర్కు లిచ్చొప్పున నేగురేసి
నాల్గువంకలఁ గదిసి వర్ణన మొనర్పఁ
దేటగీతి విష్ణునిపేర్మిఁ దేటపఱుచు. 20

క. పెనఁగి గణత్రితయముపై
నొనరఁగ వడియొండెఁ బ్రాసమొండెను నిలుపన్
జను నాటవెలఁది యందును
ననువొందిన తేటగీతియందు ముకుందా! 21

మఱియు సీసంబులు.—

క. నలనగసలభరతిలలో
పల నాఱును మీఁద రెంటఁ బద్మాప్తగణం
బులఁ దగి నాలుగుపదములఁ
జెలు వగు నొకగీతితోడ సీసముకృష్ణా!

క. సీసము రెండుగణంబులఁ
బ్రాసంబేనియును మఱి విరామంబైనన్

భాసిల్లుఁబృథివివిమీఁదన్
జేసిననియమములఁ బ్రాసనీసాదు లజా. 23

సీ. వృత్తంబులకుఁబోలె వెలయు నాల్గడుగులఁ
బ్రాసముల్నిల్పి విరతులు నునుపఁ
బ్రాసనీసము లగుఁ బశ్చిమార్ధములట్ల
భాసిల్లు నక్కలిప్రాసనీస
మగు, మునుగ్గకొన్న యతిపాదమందెల్ల
నడరిన వడిసీస మనఁగఁ బరఁగు
నర్ధమర్ధమునకు యతులు వేత్తెచనఁ
జెప్పు నక్కలివడి సీసమయ్యో
గీ. నవకవికి నిట్లు ప్రాసంబు లవతరిల్లు
యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడవ
వది యనమసీస ముత్సాహ తుదనుగీది
వరలగ విమమసీసం బగుఁ బద్మనాభ! 24

గీ. అగు సమప్రాసనీస మూఱడుగులందు
నాలుగింట వృత్తప్రాసనామసీస
మన్నిచోటులఁ బ్రాసంబు నందెనేని
సర్వతప్రాసనీసంబు జలజనాభ! 25

అందు వమ సీసము.—

ఇంద్రులు తమలోన నిద్దఱిద్దఱుఁగూడి
యతులకు నాధార మై తనర్చి
సీ. ప్రూ
న. రఁడుచోటుల నుండ మొగి నిద్ద ఱర్కులు
తగిఁ గదియ నాక్రియ నొక్కపదము మెఱయ

నిటువంటిపదము లింపెసఁగంగ నాల్గింట
సమధర్మగతి నతిశయము నొందు
నట్టిధర్మమునకు నాస్పదంబై పేర్చి
యాతతచ్ఛందోవిభాతిఁ దనరి
గీ. ఆట వెలఁది యొండెఁ దేటగీతియు నొండె
విమలభావ మమర విష్ణుదేవుఁ
డొప్పు ననుచుఁ బొసఁగఁ జెప్పిన సీసంబు
పసిఁడి యగు ధరిత్రిఁ బద్మనాభ! 26

ప్రాసనీసము.—

భామినిచే నున్నపట్టుతోరముఁ జూచి
ప్రల్లదంబునఁ ద్రెంచి పాఱవైచి
యామునిద్రోహ మత్యంత మై తనుఁ బట్టి
యతిదరిద్రునిఁ జేయ నార్తి నొంది
భూమి వెల్వడి పోయి పురపురఁ బొక్కుచుఁ
బుండరీకాక్ష యోభువనవంద్య
స్వామినాయపరాధశతసహస్రంబులు
సైరింపవే కృపాజలధి యనుచు
గీ. ప్రేము డించుకౌండిన్యునిభీతిఁ బాపి
పృథులసౌఖ్యంబు లొసఁగి గాంభీర్యమమరఁ
బామువైఁ బవ్వళించినప్రభుఁడ వనినఁ
బ్రాసనీసంబు విలసిల్లుఁ బద్మనాభ. 27

వృత్తప్రాసనీసము.—

శ్రీశ్రితవత్సుండు సింధురవరదుండు
చింతిత ఫలదానశీలుఁ డితఁడు

ఆశ్రితావనలోలుఁ డాభీరకాంతాకు
చాగ్రకుంకుమభూషితాంగుఁ డితఁడు
అశ్రాంతజయధాముఁ డాశాంతవిశ్రాంత
యశుఁడు ధారాధరశ్యాముఁ డితఁడు
విశ్రుతవిభవుండు విపులబలాఢ్యుండు
వికసితవదనారవిందుఁ డితఁడు
గీ. అనుచు మునులును దివిజులు నభినుతింపఁ
జూపుచెవులపాన్పున నెన్ను మోపియుండు
నంబుజోదరుఁ డంచు ని ట్లాంధ్రకృతులఁ
జెప్పి రేని వృత్తప్రాససీస మగును. 28

సర్వతఃప్రాససీసము.—

నీరదవర్ణుండు నీరేరుహాక్షుండు
నీరధిబంధనోదారబలుఁడు
కారుణ్యరసరాశి గౌరీరసజ్ఞాని
హారిశోభితనామగౌరవుండు
ధీరుండు త్రిభువనాధారుండు దశరథ
క్ష్మారమణేంద్రకుమారవరుఁడు
మారీచదమనుండు నారాచవిద్యావి
శారదుం డసురవిదారణుండు
గీ. ధారుణీసుత నయనచకోరసరసి
జారి యన సర్వతఃప్రాసచారుసీస
మారయఁగ సత్కవిజనవిస్ఫారనుతులఁ
దేరు శ్రీపద్మనాథ శృంగారసార ! 29

అక్కిలిప్రాససీసము.—

ఉరగతల్పుని గాని యుల్లంబులో నిల్ప
శరధితల్పుని గాని సన్నుతింప
మురసంహారుని గాని మ్రొక్కులఁ గయిసేయ
నరమృగేంద్రుల గాని నమ్మి కొలువ
గరుడవాహను పేరుఁ గాని వీనులఁ జొన్ప
బురుషోత్తముని గాని పూజసేయ
హరిప్రసాదముఁ గాని యర్థిమైఁ గొననొల్లఁ
బరమాత్మునిఁ గాని భక్తిఁ బూన
గీ. ధరణి నివినాదు నిత్యవర్తనము లనుచుఁ
బరఁగు వ్రతిఁగాని నీవు చేపట్టవనిన
జరగు నక్కిలిప్రాససీసంబు కృతులఁ
బరభృతాతసిపుష్పాభ పద్మనాభ! 30

పదిసీసము.—

కరుణాసముద్రుండు గజరాజవరదుండు
గర్వితాసురశిరఃఖండనుండు
విహగేంద్రవాహుండు విబుధేంద్రవంద్యుండు
విశ్వరక్షాచణవీక్షణుండు
రతిరాజజనకుండు రఘువంశతిలకుండు
రణబలోదగ్రుండు రమ్యగుణుఁడు
గోకులాధీశుండు గోపికారమణుండు
గోవిందుఁ డురుకళాకోవిదుండు

గీ. అనుచు వడిసీసముల నిన్ను నభినుతింతు
రఖిలవిద్యావిశారదు లైనమునులు
పన్నగాధీశతల్ప నాపాలివేల్ప
భక్తజనకామ్యలాభ శ్రీపద్మనాభ! 31

అక్కులివడిసీసము.—

పద్మాక్షి యాతఁడే బలి రసాతల మేలు
మని పంపనేర్చిన యధికబలుఁడు
హరిణాక్షి యాతఁడే యులవిభీషణు లంకఁ
బట్టంబుగట్టినబల్లిదుండు
తోయ్యలి యాతఁడే ధ్రువుని నున్నతపదఁ
బునుఁ బ్రతిష్ఠించినభూరి యశుఁడు
ధవళాక్షి యాతఁడే ధనువుద్రుంచినయట్టి
రఘువంశతిలకుండు రాఘవుండు

గీ. బాణబాహావిఖండనప్రముఖుఁ డితఁడు
నీలగళసుప్తికరబాణనిపుణుఁ డితఁడు
ననుచు నక్కులివడిసీస నుమర వేల్పుఁ
బడఁతు లభినుతింతురు నిన్నుఁ బద్మనాభ! 32

అవళిప్రాసనీసము.—

వరదుఁ డుద్యద్గుణాకరుఁడు వియన్నదీ
పాదుఁడు భక్తప్రమోదకరుఁడు
సింధుబంధనుఁ డబ్జబంధుతారాధిశ
నేత్రుఁడు కాశ్యపగోత్రజుండు

సుగ్రీవవిభుఁడు దశగ్రీవదమనుండు
లలితకంబుగ్రీవవిలసితుండు
పూతనాజీవితనూతనస్తన్యపా
నాభిలోలుఁడు నిత్యశోభనుండు
గీ. భువనవంద్యుఁ డనుచు నవకలిపాసనీ
సముల నిన్నుఁ బొగడు నమరసమితి
శరణభరణనిపుణ వరయోగివిమలహృ
త్పద్మసద్మదేవ పద్మనాభ! 33

మఱియు నుత్సాహము.—
సాహచర్య మమర సప్త సవిత్పవర్గమును సము
త్సాహ మెక్క నొక్కగురుఁడు చరణములు భజింపఁగా
నీహిత ప్రదానలీల లెసఁగుకమఠమూర్తి ను
త్సాహరీతు లుల్లసిల్ల సంస్తుతింతు రచ్యుతున్. 34
గీ. పాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాటవెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహ మది నిల్ప
విషమసీస మమరు విషధిశయన! 35
క. ద్వాదశపదముగ మఱి య
ష్టాదశపాదముగ గీతి సహితంబుగఁ దా
నేదియగు సీసమాలిక
శ్రీదయితా నిలుపవలయు సీసపునియతిన్. 36
క. సర్వలఘుసీసమునకు న
ఖర్వాంఘ్రిలనడుమ నింద్రగణములు మూఁడై

యార్యంచలఘుగణంబులు
నుర్వీధర త్రిలఘుయుగము నొకగీతితుదన్. 37

సర్వలఘుసీసము.—

మృగమదము తిలకమును నగు మొగముచెలువమును
నలఁతిపవడముఁ దెగడు నధరపుటము
వలుదజఘనమును బొలుపలరుకనకపువలువ
కలితకరచరణమణికటకములును
విరులతురుమును నమిలిపురిసొబగుమకరిక ను
రచన నెసఁగినచెవులరవణములును
కరకమలయుగళధృతమురళియును ద్రివిధమగు
నిలుకడయు నిటలతటి నెఱయుకురులు

గీ. తెల్లదమ్మి రేకులభంగి నుల్లసిల్లు
వెడదకన్నులు గలగోపవేషశౌరి
నాశ్రయించెద ననుచు ని ట్లమరఁ జెప్ప
సర్వలఘుసీస మగు నంధ్రజలజనాభ! 38

శరభోజ.—

ముగురు జిష్ణులు త్రయీమూర్తియు మఱియు
ముగురు జిష్ణులు త్రయీమూర్తియుఁ గూడి
యొగి నుండ గిరియతి నొక్కొక్కచరణ
ముడుగక సేవింప నుజ్జ్వలం బగుచుఁ
దగ నుల్లసిల్లు పాదములు నాల్గింటఁ
దనరు వరాహావతారోదయునకు

నిగురొత్త భావంబు లెసఁగఁ దరోజ్వజ
నీరజా నొనరింతు రెల్లసత్కవులు. 39

**మఱి యక్కరజాతులందు మహాక్కర.—**

ఆదివార మాదిగ నను క్రమమున
నన్ని వాసరముల నొక్కనుండు
నాది తేయాధినాథు లేగురు నల
రారంగ నొక్కసుధాకరుండు
నాది హరిఁ గొల్వ రెండును నాలుగు
నగు వాసరంబున నర్కుఁడైన
నాదరంబున నెడసొచ్చు నని మ
హాక్కరం బలుకుదు రార్యు లెల్ల. 40

**మధ్యాక్కరము.—**

ఓజతో నిద్దఱింద్రులు నొక్కయాదిత్యుండు మఱియు
రాజితంబుగ నిద్ద ఱమరరాజులు నొక్కసూర్యుండు
పూజింతు రత్యంతభక్తిఁ బుండరీకాక్షు ననంతు
భాసిల్లు బుధులు మధ్యాక్కరంబు నొప్పారఁ బల్కుదురు. 41

**మధురాక్కరము.—**

రవియు నింద్రులు మువ్వురు రాజొకండును కలసి
రవిసుధాకరలోచను రాజితాననసరోజు
రవికులేశుఁ గొలుతు రని ప్రస్తుతింతురు ధరిత్రి
నవిరళం బగుమధురాక్కరాఖ్యచే సత్కవులు. 42

**అంతరాక్కరము.—**

ఇనుఁ డొకండును నింద్రు లిద్దఱు నొక్క
వనజవైరియుఁ గూడి వైభవ మొనర్ప

గనకవస్త్రుని గృత్తికెటభుని గొలుతు
రనుచుఁ జెప్పుదు రంతరాక్కర బుధులు. 43

అల్పాక్కర.—

ఒగి నిద్దఱింద్రులు నొకవిధుండు
జగతీధరుని పదాబ్జములు గొల్తు
రగణితభక్తి నం చభినుతింప
నెగడు నల్పాక్కర నియతితోడ. 44

అక్కరలయతినిర్ణయము.—

విరతిచతుర్గణము మహా
క్కర కేకోనాక్షరత్రిగణ మంతరకున్
వరగణయుగయతి నల్పా
క్కర మధ్యయుమధురయుం ద్రిగణయుతుల హరీ! 45

మత్త షట్పద.—

మెఱయుచుంగ నిద్దఱి
ద్దఱు సురేంద్రులు మూఁడు
తెఱఁగులఁ శశిఁగూడ నర్థంబులన్
నెఱిఁ గ్రాలఁగా వళ్లు
దొఱఁగ షట్పదరీతి
వఱలుఁ జక్రిపదాబ్జవర్ణనంబు. 46

త్రిపద.—

సరవిఁ బ్రాసమునొంది సురపతుల్ నలువురు
హరియు గ్రైకొర్కులు గలియ
జరగు నిప్పగిది నొప్పుఁ ద్రిపద. 47

మఱి ద్విపద.—

ఇంద్రులు మువ్వురు నినుఁ డొక్కరుండు
సాంద్రమై యొక్కొక్కచరణంబుఁ గొలువ
నలరుఁ బద్మోదరుఁ డంచు ధీరోత్త
ములు విస్తరింతురు ముదముతో ద్విపద. 48

మంజరీ (ప్రాసరహిత) ద్విపద.—

శ్రీమందిరాకారు జితదైత్యధీరుఁ
గీర్తించుచోఁ బుణ్యావర్తనుం డనుచు
యతిమాఱుప్రాస మిట్లచ్చోట నిడక
సరసిజనాభాయ సముదగ్రసాహ
సాయ నమోయంచు శబ్దమొక్కటియు
రెండుపాదముల నీక్రియఁ బంచియిడక
వెలయు ప్రాసములేనిద్విపద యై పరఁగఁ
బూజింపవలయు వాక్పుష్పమంజరుల. 49

మఱియుఁ జౌపదము.—

కలసి చతుర్లఘుగణములయందు
నలిఁ ద్రిగణం బైన నగణము వొందు
నలరుగణద్వయ యతిగోవిందుఁ
బలుకఁ గృతులఁ జౌపద చెలువందు. 50

అందు విశాళమనుచౌపదము.—

అర్కనామగణ మనువుగ రెండు
దాకొని లఘువొందఁగ నిట్లుండుఁ

దర్కింపఁగ ను వితాళము నందు
పేర్కొనఁ దగుఁ హరిబిరుదులపిండు. 51

రగడలు.—

క. ఆద్యంతప్రాసంబులు
హృద్యంబుగ రెంట రెంట నిడి పాదములు
ద్యద్యతులఁ గూర్పఁ దగు నన
వద్యంబగు రగడలందు వారిజనాభా! 52

అందు హయప్రచారరగడ.—

హానచతుష్టయంబు ఋతుల
జనితయతుల జరగుఁ గృతులఁ
జన హయప్రచారరగడ
వినుతశాస్త్రవిధులు వొగడ. 53

అందు తురగవల్గనమనురగడ.—

శ్రీసతీశుఁ బరమపురుషుఁ జిత్తమునదలంచువారు
వాసవాదినిఖలదివిజవంద్యు నాశ్రయించువారు
నిట జనింప రనఁగ నన్వయించుఁ దురగవల్గనంబు
పటుదినేశలఘువిరామభానుమద్గణాష్టకంబు. 54

అందు విజయమంగళమను రగడ.—

శ్రీధరాయ శిష్టజననిషేవితాయ భక్తలోక
జీవితాయ గర్వితోరుసింధురాజబంధనాయ
గాధిపుత్రయజ్ఞవిఘ్నకరమహాసురీమహోగ్ర
కాయశైలదళననిపుణఘనసురాధిపాయుధాయ

కేశవాయ తే నమోఽస్తు కృష్ణ పాహిపాహి యనుచుఁ
గేలు మొగిచి మౌళి మునిచి కృష్ణుఁ బలికె ననుచు నిట్లు
దేశభాషణములఁ జెప్ప ద్విగుణతురగవల్గనమునఁ
దేరు విజయమంగళంబు తీయచెఱకు రసమునట్లు. 55

అందు ద్విరదగతి యనురగడ:—

శ్రీయువతి నిజయువతిఁ జేసి యెంతయు మించి
కాయజునిఁ దనసూనుఁ గా నెలమిఁ బాటించి
సకలదేవతలఁ బరిజనులుగా మన్నించి
ప్రకటగతి శ్రుతుల నుతిపాఠకులఁ గావించి
హరి యొప్పు నన నొప్పు నవతారలఘువిరతి
శరధినగనలలభలసలతరలద్విరదగతి. 56

అందు జయభద్రరగడ.—

శ్రీకి నొడయం డనఁగఁ జిత్తజునిగురుఁ డనఁగ
శేషశయనుం డనఁగఁ జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసుల నేలు నముచిసూదనుపూజ
నతఁడు దాఁ గైకొన్న నందగోపాత్మజుఁడు
ఇతని గొల్చినఁ గాని యిహపరంబులు గలుగ
వితరసేవల ననఁగ నెసఁగు నివ్విభుఁ డనుచుఁ
జతురమతు లొనరింప జయభద్రరగడలిటు
సద్ద్విరదగతి రెంటఁ జాటింపులం బెంచు. 57

అందు మధురగతి యనురగడ.—

శ్రీవనితాధిపుఁ జేరి భజింపుఁడు
భావజజనకుని భక్తిఁ దలంపుఁడు

అని గగనలభసలను నాల్గిటఁ గృతి
జను గజలఘువిశ్రమము మధురగతి. 58

అందు హారిగతి యనురగడ.—

శ్రీరామాకుచకుంకుమపంకము
చేఁ బొలుపగువిపులోరఃఫలకము
తారతుషారపటీరసమానో
దకవాహిని యొదవినపదకమలము
సతిశయ మై యలవడు నేదేవుని
ననవరతోదారత నాహారిగతి
యితరుల కలవడ దని నృప లఘుయతి
నిభనలగగభసల నగును హారిగతి. 59

అందు వృషభగమన మనురగడ.—

శ్రీమనోహరు నంబుజోదరుఁ
జగత్రిజాతగురుం దలంచెద
గామితార్థవిధాయి నిర్జిత
కాళియాహిని నాశ్రయించెద
ననువుగా *భగణములు భానుస
మన్వితద్వితయములు నాలుగు
ననిమిషాధిపలఘుయతినిడఁగ
నలరువృషభగమనము మేలగు. 60

అందు హరిణగతి యనురగడ.—

శ్రీనివాసు భజింతు నే నని
పూని కుజనులపొంత బోరని

* భసనల. పాఠాంతరము.

భానుయుతనలభసగగంబుల
లోననిరుదోలుననగంబుల
నిరవుగా నిరునూఱులఘువుల
నెల్లవారును నొగి గణింపఁగ
విరతులనుగావింపనిమ్ముల
హారిణగతిచెలువగుజగమ్ముల. 61

మఱియు చాటుప్రబంధలక్షణము.—

సీ. ఒకపద్య మైనము క్తకము రెండును మూఁడు
ద్వికమును ద్రికము నై విస్తరిల్లుఁ
బంచరత్నము లైదు పఁగ నెన్మిది గజా
వళికి నామావళి ద్వాదశంబు
నెన్నంగ నిరువదియేడు తారావళి
యెనయు ముప్పదిరెండు నేఁబదియును
నూఱునూటెనుబది నుతికెక్క ద్వాత్రింశ
దభిధాన పంచాశదాఖ్యనాఁగ

గీ. వెలయు శతక మన వెండి యష్టోత్తర
శతక మనఁగ నిట్లు సకలసుకవి
సమ్మతిముగ నెగడుఁ జాటుప్రబంధము
లభిమతార్థరచన నబ్జనాభ. 62

మఱియు ఉదాహరణలక్షణము.—

సీ. భాసిల్లు సప్తవి భక్తులందునుమఱి
సంబోధనంబున సరవిఁగాఁగఁ

ప్రభునామయుతముగాఁ బద్యమొక్కటియును
దగఁ జెప్పి రగడభేదంబులందుఁ
గళికలు ప్రత్యేకదళము లెన్మిది చేసి
తత్పరార్ధముల నుత్కళిక లనఁగ
నేకసమానమై యేనుదళంబులు
తుదవిభక్త్యర్థంబు దోఁపఁబలుక
గీ. దాని కెనగాఁగఁ జిక్కనదళ మమర్చి
ఫణితు లొండఁగూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టి కడపటిపద్య మొక్కటి రచింప
నది యుదాహరణం బగు నబ్జనాభ!

సీ. ప్రథమవిభక్తికిఁ బరఁగు విరావళి
మఱి ద్వితీయకుఁ గీర్తిమతి దలంప
సుభగాభిధాన మచ్చుగఁ దృతీయకుఁ జతు
ర్థికి భోగమాలిని దృఢముగాఁగ
శ్రీతిఁ బంచమికిఁ గళావతి కాంతిమతి షష్ఠి
కమరు నుదాత్త సప్తమికిఁ గమల
సంబోధనమునకు జయవతి యాగతిఁ
దగు విభక్త్యధిదేవతాచయంబు
గీ. నెలమి నయ్యైవిభక్తుల నెసఁగఁ జెప్ప
గావ్యములను సంతోషించి కరుణతోడ
నాత్మనామాభిరూపఫలాభివృద్ధి
భర్తలకుఁ గర్తలకుఁ జేయుఁ బద్మనాభ!

షట్ప్రత్యయంబులు.—

క. క్రమమునఁ బ్రస్తారము న
ష్టము నుద్దిష్టమును వృత్తసంఖ్యయు మఱి పెం
పమరు లగక్రియయును న
ధ్వము లన షట్ప్రత్యయములు దనరు ముకుందా! 65

క. చాలుగ సర్వగురువు లిడి
లాలితముగ గురువుక్రింద లఘువును వలప
ల్లోలి సమంబులు డాపలి
వ్రాలకు గురువులను నిలుపఁ బ్రస్తారముగున్. 66

నష్టలబ్ధి.—

క. సరు లర్ధించినచోటుల
నరయఁగ లఘువులను చేసులం దొక టిడి చె
చ్చెర నర్ధించిన చోట్లన్
గురువుల నిడ నష్టలబ్ధి కుంజరవరదా! 67

ఉద్దిష్టము.—

క. ఒక్కటిమొదలుగ నినుమ
డ్లెక్కినచో లఘుయుతంబు లిన్నియుఁ బ్రోగై
యొక్కటి కలియఁగఁదోఁచును,
గ్రక్కున నుద్దిష్ట మిక్షుకార్ముకజనకా! 68

వృత్తసంఖ్య.—

క. చేకొని ఛందోవర్ణము
లేకాదిద్విగుణితముగ నిడి కడులెక్కం

ప్రాకటముగ రెట్టించిన
శ్రీకరముగ వృత్తసంఖ్య శ్రీనరసింహా! 69

లగక్రియ.—

క. ఒక్కటి గలసిన ఛందపు
టక్కరముల దొంతి యిడి యుపాంతములతుదన్
జక్కఁగ నొక్కొక్కటిలోఁ
గ్రక్కున నొడఁగూర్ప నగు లగక్రియ కృష్ణా! 70

గణలగక్రియాంకమగుచక్రము.—

క. తొలుత ప్రతి సర్వగురువగు
లని నేకద్విత్రికాదిలఘుయుతవృత్తం
బులు పరప్రతు లగుఁ జక్రా
కలితము తానెలవు లగు లగక్రియఁ గృష్ణా! 71

సగణలగక్రియాంక మగుచక్రము.—

చ. సగణల గక్రియాంక మగుచక్రము నం దొకఁ డాదిగాఁగఁ ద
ద్ద్విగుణము లడ్డవీథి నొదవింపఁగ వామగృహాంకసంఖ్యతో
నొగిఁదరువాతియిండ్ల ప్రతులొందనధోఽంకము లన్ సమాధికం
బగు ప్రతిమానుచుం గడమకాల ప్రతుల్ దొరలించినిల్పఁగాన్.

గీ. ఇందు సమమగునది తొల్తయిండ్ల వ్రాయఁ
బడినసంఖ్యతో సమమైనఁ బ్రతికిఁ జేరు
నధిక మగునది వృత్తసంఖ్యాధికంబు
వ్రాయ రివి రెండు ప్రతులచక్రములయందు. 73

వ. సుప్రతిష్ఠకు లగక్రియాచక్రోద్ధారం బెట్టిదనిన. 74

చ. మునుగలయొండు రెండునిటమూఁడుగమూఁడును రెండునై ద్వినై
దును నట నాల్గు తొమ్మి దగుఁ దొమ్మిది నెన్మిదియుంబ దేడుగా
ననువగు పంక్తి రెండుమొదలైనవి నాల్గిట నాలుగాదిగా
నెనిమిదియుం దదాదికము లెల్లఁ బదాఱిటఁ గూడగానగున్.

అగక్రియాచక్రము అధ్వప్రక్రియ.—

క. తిరముగ ఛందోఽకుగములు
నురుతరముగ వృత్తసంఖ్యయును ద్విగుణము లై
పొరి నొక్కొక్కఁడు తొలఁగఁగఁ
బరిశిష్టాంగుళము లధ్వభాగ ముపేంద్రా! 76

సమవృత్తంబుల వెఱసు.—

క. కడపటివృత్తంబులయిను
మడి లోపలఁ బ్రథమవృత్తమండలిఁ దీర్పన్
వడినిష్టచ్ఛందంబులఁ
బొడమినవృత్తములు వెఱసు పొలుపగుఁ గృష్ణా! 77

మఱియు ఛందోవృత్తముల వెఱసు.—

చ. ఒగిఁ బదుమూఁడుకోటులును నొప్పుగ నల్వదిరెంకులక్షలున్
దగఁ బదుమూఁడువేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచినఛందము లిర్వదాఱిటన్. 78

గద్యము. ఇది శ్రీవాణీచరణప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య
తనుసంభవ సుకవిజనవిధేయ యనంతనామధేయప్రణీతం బైన
ఛందోదర్పణంబునందు జాతిలక్షణలక్షితంబు లగుకందంబు

లును, మాత్రాలక్షణయుక్తంబు లగుగీతులును సీసంబుల నుత్సాహము దరువోజయు నక్కరయు షట్పదయుఁ ద్రిపదయు ద్విపదయు మంజరియుఁ జౌపదయు రగడలును జాటుకావ్యప్రమాణంబులును, ఉదాహరణంబులును, షట్ప్రత్యయంబులును, సప్తమప్రత్యయం బైనసమవృత్తముల వెలిసు తెలుంగు నన్నది తృతీయాశ్వాసము.

శ్రీరామాయనమః.

# ఛందోదర్పణము

## చతుర్థాశ్వాసము.

### దోషాధికారము.



ధర తనురుచివిజితప
యోధర యనవరతఘోషయోషిత్పరిపీ
తాధర తల్పీకృతవసు
ధాధర రిపుభయద ఘనగదాధర కృష్ణా! 1

క. జగమున దోషవివర్జిత
ముగఁ జెప్పఁగవలయుఁ గావ్యములు సత్కవు ల
ట్లగుటఁ దశదోషమ్ములు
తగఁ జెప్పెదఁ బూర్వకవిమతంబుగఁ గృష్ణా! 2

### దశదోషములు.

గీ. పదియుఁ గీడుఛందోయతిభంగములు వి
సంధికము పునరుక్తి సంశయ మపక్ర
మంబు వ్యర్థ మపార్థము మఱి విరూపి
తాపశబ్దవిరోధంబు లనఁగఁ గృష్ణ! 3

1. ఛందోభంగము.—

క. ఛందోభంగం బగు గురు
వొందెడునెడ లఘువుగాఁ బ్రయోగించుట గో
వింద యనిపలుకుచోట ము
కుంద యనుచుఁ బలుక నిట్లు కుంజరవరదా! 4

2. యతిభంగము.—

గీ. విమలకమలనేత్ర విశ్వలోకస్తోత్ర
విమలదైత్యకులవినాశ యనుచు
వలయుచోట లేక వడి యొండుచో నుండఁ
బలికిరే నది యతిభంగ మండ్రు. 5

3. విసంధికము.—

గీ. అమృతఉదధిశయన అమరఈశానుజ
అబ్జమందిరాన్య అబ్జమిత్ర
అనుచు నిట్లు సంధి నెనయకునిశబ్దముల్
దొరయుటయు విసంధిదోష మండ్రు. 6

4. పునరుక్తికము.—

గీ. తొలుతఁ దా నెద్దియైనను బలికి మఱియు
నదియ పలికినఁ బునరుక్తి యండ్రు బుధులు
శబ్దపునరుక్తి పూర్వోక్తశబ్దమైన
నర్థపునరుక్తి యేకార్థ మైనఁ గృష్ణ! 7

గీ. శబ్దపునరుక్తి యగుఁ గాంతిచంద్రుఁ డని వ
చింప మఱి కీర్తిచందురుఁ డనుచుఁ బలుక

నర్థపునరు_క్తి యగుఁ గాంతి నమృతకిరణుఁ
డని యశోమృగాంకుం డన నజ్జనాభ! 8

క. పునరు_క్తిదోష మొందదు
దనరుపదావృ_త్తి నభిమతంబున వీప్సన్
జనువినుతాభీక్ష్ణ్యంబునఁ
బొనరు క్రియాసమభిహారముననం ద్రుహారీ! 9

సీ. ఈ వెన్న ముచ్చు దా నిల్లిల్లు దప్పక
చొచ్చుఁ బొమ్మన వీప్స సొంపుమిగులు
ఇటువచ్చివచ్చి నీవేల నిల్చితి కృష్ణ
యనిన నాభీక్ష్ణ్యంబు పొనరియుండు
ఇమ్మిమ్ము శౌరికి నిమ్మపం డనఁ గ్రియా
సమభిహారంబు ప్రశంస కెక్కు
నీచక్కఁగనమును నీమంచితనమును
జూతుఁ గన్గొని ధాత్రి వేడ్కఁ దై రి

గీ. దండకావనంబుతాపను లనఁ బదా
వృ_త్తి యుల్లసిల్లు విమలకృతుల
భూరిపుణ్యశీల పునరు_క్తిలాలన
ప్రకటపుణ్యశోభ పద్మనాభ! 10

**౬. సంశయము.—**

కడఁగి వానిఁ గదియఁగాఁ గదా నేఁడు నీ
కింతనట్టుగలిగె నిందువదన
యూరకున్నఁ గలదొకో యని సంశయా
ర్థముగఁ బలుక సంశయము ముకుంద! 1

6. అపక్రమము.—

క. పదమున నాభికమలమున
హృదయమునఁ బయోజభవ రతీశ్వరదివిష
న్నమ లుదయించెం గమలా
ప్తుదునకు నను వ్యుత్క్రమం బపక్రమ మయ్యెన్. 12

7. వ్యర్థము.—

క. మును దాఁ బలికినమాటకు
ననుగుణములు గాక వ్యర్థ మగుమాటలతోఁ
బెనఁచిన నది వ్యర్థంబనఁ
జనుదోషం బనిరి కావ్యచరితులు కృష్ణా! 13

గీ. త్యాగి వగుదు నీవు తారంబు వెట్టవు
చేరి నిన్ను నగరు వారు పెద్ద
యింక గీతి భ్రాంతియే యని యొరుఁ బల్క
వ్యర్థదోష మండ్రు వనజనాభ! 14

గీ. ప్రేమ మెఱిఁగి వాఁడు బిగియుచు నున్నాఁడు
వాని గననియొల్ల వాఁడు నాకుఁ
గూర్పఁ దెఱఁగు లేదొకో నాఁగ విరహిణి
యందు నిల్లు వ్యర్థ మమరుఁ గృష్ణ! 15

8. అపార్థము.—

క. కరిచర్మము గైరికశిల
సురగిరి యని సముదయార్థశూన్యపదంబుల్
బెరసిన నపార్థ మగు నది
జరగు మదోన్మత్తబాలచరితలఁ గృష్ణా! 16

అపశబ్దము.—

గీ. కనుఁగొనంగ నాదకవులకావ్యంబుల
లలితమైనలక్ష్యలక్షణములు
రూఢిగానిపెఱవిరోధోక్తు లపశబ్ద
సంజ్ఞికంబు లండ్రు జగతిఁ గృష్ణా! 17

వ. అవి యెయ్యవియనినం గుసంధి, దుస్సంధి, చుట్టుంబ్రావ, వైరి వర్గంబు, కాకుదోషంబు, కుఱుచకాకు, తెనుంగునకుఁ జొఱని సంస్కృతక్రియలం బెఱయుదుష్ప్రయోగంబులు. మఱియు నిట్టిగ్రామ్యంబు లెన్నిగల వన్నియు నపశబ్దంబులు వాని వివరించెద. 18

కుసంధి.—

క. మొదల నికారముపై న
చ్చొదవి యకారముగ దీనియొడయం డిది యె
ట్లొదవె ననక దీనొడయం
డిదెట్లొదవె ననఁ గుసంధు లినశశినయనా! 19

దుస్సంధి.—

క. క్షితి స్వరసంధి నకారం
బతిశయముగ నతఁడు నతఁడు ననుచో నతఁడు
న్నతఁడు నని యూఁది పలికిన
సతతము దుస్సంధి యండ్రు సత్కవులు హరీ! 20

చుట్టుబ్రావ.—

క. మొదల లాఱు వడ్డి మూఁ డనఁ
గదియింపక యెత్తి కట్టి కరమున నగువాఁ

డిదె వచ్చెడి నన నెగ్గై
యొదవిన యీచుట్టుఁ బ్రావ లొల్లరు కృష్ణా! 21

వైరివర్గము:—

గీ. తుదలు తెలుఁగుఁ జేసి యదికి పుష్పవిల్లు
పరఁగ భూరుహంపుఁబండ్లు నాక
పుష్పవిల్లు నాఁగ భూరుహపండ్లు నా
వైరివర్గ మండ్రు వనజనాభ! 22

గీ. మొదలితెలుఁగుపై సంస్కృతపద మొకండు
జరగ లోకరూఢిని సమాసంబు చొఱదు
పూని ముజ్జగంబులు ననఁ బోలుఁ గాని
యతఁడు ముజ్జగద్వందితుఁ డనఁగఁ జనదు. 23

కాకుదోషము:—

క. పోలుపుగఁ బొగాడదండలు
లలన ముడిచినన్ మకార లాంఛనుఁ డొందెన్
జలమునఁ జెఱాకువి ల్లన
నల నిడుదలఁ గాకు దోషమండ్రు ముకుందా! 24

కుఱుచకాకు.—

క. ఎలుఁగుపడ సీవు చెపుమా
మెలిక వనుచు ననపడితిమి మెమి నివు నమెడా
చలుఁజలు ననునిడుపులు కుఱు
చలు సేసినఁ గుఱుచకాకు చను నిది కృష్ణా! ౨౫

దుష్ప్రయోగము:—

క. సత్వము స నృపస్య పదం
గత్వా యాతఁడు నివాత్వ కంటకుల సఖ

భూతాత్వ మెలఁగెడు నన్నఁగ
విత్వవిదులు దుష్ప్రయోగవిధ మంద్రు హరీ! 27

వ. సంస్కృతవిభక్తు లయ్యును దెనుఁగునకుఁ జెల్లు నుప్రయోగం బెట్టిదనిన:—

క. నిక్క మగు సుప్రయోగము
ధిక్కృతదురితాయ భగవతేఽస్తు నమో యం
చక్కడ నీకును నమరులు
మ్రొక్కెదు రని తెబ్బుబంతములఁ గూర్ప హరీ! 28

విరోధములు:—

క. సమయవిరోధమ్మును నా
గమలోకవిరుద్ధములును గాలవిరోధ
క్రమము కళాదేశవిరో
ధములును జొఱకుండఁ జెప్పఁదగుఁ గృతుల హరీ! 29

సమయవిరోధము:—

క. సందులఁ గుండలముల్ గుడి
సందిని శివలింగమున్ నొసల భూతియుఁ బెం
పొందఁగ నొకదఱిచేసి మ
రుం దెగడెదు నన సమయవిరోధము కృష్ణా! 30

ఆగమవిరోధము:—

క. ఎక్కడిధర్మము హింసయ
నిక్క మనుచు వృత్రవధకు నిర్జరపతియుం
ద్రొక్కె దయపేర్మి ననవుడు
నక్కడ నాగమవిరోధ మండ్రు ముకుందా! 31

కళావిరోధము:—

క. తాళము పట్టక చదువుఁ
బోలఁగఁ బుస్తకము చేత ముట్టక పాడుఁ
మే లితనిజాణతన మన
నోలి నిది కళావిరోధ ముదధివిహారా! 32

దేశవిరోధము:—

క. బహుళకూపతటాకోదక
మహితము మరుదేశ మని సమర్థించిన ని
మ్మహి నది దేశవిరోధా
వహ మండ్రు కవీంద్రు లమృతవారిధిశయనా! 33

క. ఇట్టివి దశదోషము లనఁ
బట్టగుఁ గృతులందు నివియ భాసురముగఁ జే
పట్టుదురు ధీరు లొక్కొక
పట్టున డెందమ్ము లలరఁ బల్కినఁ గృష్ణా! 34

క. పదిదోషంబులఁ దెలిపెద
నదనఁ బ్రయోగించినట్టి యపయోగములం
దొదవవు దోషంబులు నీ
సదమలనామములఁ గూడఁ జలుపుటఁ గృష్ణా! 35

క. క్రమమున నిటుచెప్పినదో
షములం దత్యుత్కటము విసంధిక మని రా
దిమునులు తత్పరిహారా
ర్థము సంధి సమాసములు దిరంబుగఁ జేర్తున్. 36

క. సంధిఁ దెలిపెడుచో సూత్రసమ్మతముగఁ
దొలుతఁ బలికి చూపెడువర్ణముల విసంధి
నాటుకొనదు శ్లిష్టోచ్చారణంబుఁ జేసి
చూపునదియ నిశ్చయసంధిసూచకంబు. 37

షట్సంధులు.—

గీ. పరఁగుఁ దుక్సంధి స్వరసంధి ప్రకృతిభావ
సంధి వ్యంజనసంధి విసర్గసంధి
స్వాదిసంధి నా షట్సంధు లందులోనఁ
బ్రకృతిసంధి యన్నది యాంధ్రిభాషఁ జొరదు. 38

తుక్సంధి.—

క. పదమధ్యదీర్ఘలఘువులు
పదాంతలఘువులు ఛకారపరమై యూఁదుఁ
మది మ్లేచ్ఛుఁడు తుచ్ఛం డనఁ
ద్రిదశ చ్ఛత్త్ర మన నిగతిని దుక్సంధిన్. 39

గీ. లలిఁ బదాంతదీర్ఘము వికల్పంబు నొందుఁ
బు త్రికాచ్ఛత్త్ర మాఙ్మైజాఛత్త్ర మనఁగ
నటఁ బదాంతదీర్ఘం బయ్యు నాఙ్ప్రియుక్తి
నిత్య మాచ్ఛాదనం బని నెఱయ నూఁదు. 40

స్వరసంధి.—

క. ధర అఇఉఋలు సవర్ణము
పర మగుచో దీర్ఘ మగు సువర్ణాద్రి యనఁ
శరధీంద్రుఁ డన బహూదక
సరసి యనఁ బితౄణములు వెసం దీర్పు మనన్. 41

క. చెచ్చెర ఇఉబులు మూఁటికి
నచ్చు పరం బైన యవర లాదేశ మగుఁ
మెచ్చుగ దధ్యన్నం బనఁ
బెచ్చుగ మృద్యన్న మనఁగఁ బిత్రర్థ మనన్. 42

క. తగునేలన మన నయనం
బగు బోలన మనఁగఁ బవన మగు నైలక నా
నగు నాయక పౌలకయన
నగుఁ బావక ఏజవాప్తి నయవాయావల్. 43

గీ. సరవి నీనాల్గుపదమధ్యసంధులందు
నప్రసిద్ధ మేకారాంత మైత్వమునకు
నోత్వమునకు నౌత్వమునకు నొగిఁ బదాంత
సంధి నగు విశేషంబు లేచంద మనిన. 44

క. గోశబ్దముపై నవజా
దేశమున గవాక్ష మనఁగ దీపించు నవా
దేశము ద్యోశబ్దముపై
నాశక్రుఁడు ద్యావధీశుఁ డన నత్సంధిన్. 45

క. రైశిఖరాచ్చున రాయా
దేశం బగుసంధి రాయధీశ్వరుఁ డనఁగా
గ్లౌశిఖరాచ్చున గ్లావా
దేశం బగుసంధిగ్లావుదీర్ణ యనంగన్. 46

క. మొదలియకారము నిఉబులు
పొదవిన నేత్వమును నోత్వమును రేఫయుఁ బెం

పాదవు సురేంద్రుఁ డనఁగ నీ
ఁదోత్కరం బనఁగ సంధి బ్రహ్మర్షు లనన్. 47

గీ. ఇత్వ ముత్వ మోత్వ మైత్వ మౌత్వం బైదు
నాది యై ఋకారము పరమైనచోట
మహితకవ్యృద్ధి మనవృద్ధి మతిదర్వృద్ధి
యద్ధి రాయృద్ధి గ్లౌవృద్ధి యనఁగఁ బరఁగు. 48

క. వశగతి ఋణపద మధికవు
దశఁ బ్రవసనకంబళార్ణదశవత్సతరా
ఖ్యాశిఖరిసంఖ్యపదంబులు
రశిరస్కాకార మొంది ప్రార్ణాదు లగున్. 49

క. ఐలగు నేఐ లోష్ఠా
ఔలగు నాద్యంతమునకు నఖలై కవిభుం
డాలలితై శ్వర్యుఁడు స
త్యాలాపాదనుఁడు భవమహౌషధ మనఁగన్. 50

గీ. అత్వమున కోతు నోష్ఠమంత్వమునఁ గదియఁ
గలుగు నోత్వౌత్వయుగ్మ వికల్పసంధి
ఆడఁ జెందె ఘనోతు వతౌతు వనఁగ
నాఁగె బింబోష్ఠి నొక్క బింబౌష్ఠి యనఁగ. 51

అబ్ప్రియోగచతుష్టయము.—

క. అందముగ నీషదర్థము
నం దాతుద నుత్వ మాత్వ మై యోష్ఠ మగుఁ
జెంది క్రియాయోగము తుద
యందలియత్వ మది యాత్వ మాలిన మనఁగన్. 52

క. ఇల మర్యాదాదులయం
దలియత్త్వం బాత్వ మై పొదలు నాద్రి యనన్
లలి నభివిధ్యాదులయం
దలియత్వము నాత్వమై పొదలునాద్రి యనన్. 53

గీ. ఈషదర్థ మనఁగ నించుక యగుఁ గ్రియా
యోగ మనఁగ సత్క్రియోపయుక్తి
యంతదాఁక యనుట యై చను మర్యాద
యదియు ననుట యర్థ మభివిధికిని. 54

క. ఈనాల్గిట నుపసర్గయు
కానఁ గలిగె సంధి యట్లుగావు ప్రకృతిభా
వానుగతాకారము లవి
జానుగఁ దెలుఁగునకుఁ జొఱవు సంధుల నెలమిన్. 55

క. ప్రతిషేధాకారోత్తర
గతశబ్దాద్యచ్చు లవి నకారము లగునా
శ్రితులకుఁ బంకజనేత్రుఁ డ
నతిదూరుం డనఁగ నతఁ డనాద్యంతుఁ డనన్. 56

వ్యంజనసంధి :—

క. పొడవగు దిగిభ మజంతము
షడంగములు జగదరిష్టశాంతి సుబంతం
బడరె ననఁ దృతీయము లల
వడు వర్గవ్యంజనములపై సత్సంధిన్. 57

గీ. షడ్ఋతుధర్మభూషిత తరుమండలశ్రీ
నిర్మలాబ్బుద్ధదీర్ఘిక నిజవిశిష్ట

వాగృజుత్వంబు భవదృషిత్వమున కమరె
నాఁగ ఋత్వవర్గ వ్యంజనముల సంజ్ఞ. 58

గీ. అజఝఞనమముల పొల్లు లచ్చు లంట
స్వస్వరూపంబ యగు ఋత్వసంధి నైన
నడఁగు గుడి హాలంతము నాఁ దిజంతమన ని
కోయణచి నా నన్ృజువనఁ గూడుఁ గాన. 59

క. పన్నగ మకారహల్లగు
సున్న మకార మగు నచ్చు పోఁక సమగ్రం
బన్న మన ఋకారం బా
సన్నమ్ముగ మృత్వ మగు రససమృద్ధి యానన్. 60

క. తమతమవర్ణంబుల ద్వి
త్వము లగుఁ దత్తరుణి తత్తదర్థము తద్ధా
నము తద్ధనంబు తన్నయ
నము నా నిటు వర్గములఁ దనరు వ్యంజనముల్. 61

సీ. వర్గహల్లులచేరువను హకారము చతు
ర్థాక్షరం బై సంధి నడఁగు నొండె
మూఁడవ వ్రాలతోఁ బోఁడిగ దీపింప
స్రగ్ఘార మనఁగ నజ్ఝల్లు లనఁగ
షడ్ఢలంబులునాఁగ సకలజగద్ధిత
ప్రౌఢిమనాఁగకుబ్భస్తు లనఁగ
నవియ స్రగ్ హారంబు లనఁగ నజ్ హల్లు ల
నంగ షడ్ హలములు నా జగద్ హి
తానువర్తను లనఁ గకుబ్ హస్తు లనఁగ
శపరమైన వాక్ శాంతి వాక్ఛాంతి యట్ల

చపటహల్లులు మూఁటను జను విభాష
ఛత్వమగుఁ దకారమునఁ దచ్ఛాఖయనఁగ. 62

గీ. లలిని దద్వ్యంజనంబుపై లత్వమునకు
ద్విగతి తల్లీల యనఁగఁ దల్లీల యనఁగ
నంచితసకార మడఁగును నడఁగకుండు
నుత్థితం బుత్ స్థితం బన నుండుఁ గాన. 63

క. అనునాసికవర్గవ్యం
జనముల నిజరూప మొండె జరగుఁ దృతీయం
బునఁ బ్రాఙ్ముఖంబు ప్రాఙ్ముఖ
మన వాఙ్మయహంబు వాగ్మయమ మనుచోటన్. 64

గీ. కచటతపహల్లు పంచవర్గద్వివర్ణ
నలనిజాకృతి మీఁదియకారయుగముల
యరలవలఁ దృతీయంబు వాక్తరుణివాక్స
రంబు లనఁగ దృగ్దీప్తి దృగ్రావత మనఁగ. 65

గీ. కపల ప్రథమయుగ్మసకారగతులఁ దాన
అపరయుగయరలవతృతీయంబు తత్కృ
తంబు తత్ప్రతి తత్సతి తద్గతియు జ
గద్గురుఁడు సద్యశము నాఁ దకారహల్లు. 66

గీ. తచ్ఛమత్కృతి తచ్ఛాయ తజ్జలంబు
తజ్ఝషము తట్టణాంకృతి తట్ఠకార
ఘనతతడ్డోల తఢ్ఢక్క యనఁగ రెండు
వర్గములు ద్విత్వమొందుఁ దద్వ్యంజనమున. 67

విసర్గసంధి.—

క. కపముఖయుగ్మములు విస
ర్గపయిం బొడసూపి నిర్వికార మగు మనః

కపట మనఃఖేదము లనఁ
దపఃఫలం బనఁ దపఃప్రతాపం బనఁగన్. 68

గ. కపల మొదలిరెం డ్లగు దుర్నిరుపరిసంధి
మత్వ మగు దుష్పదంబు నిష్ఫల మనంగ
జరగు దుష్కర్మ మనఁగ నిష్కర్మ మనఁగఁ
జెల్లు దుష్ప్రీత మనఁగ నిష్ప్రీత మనఁగ. 69

క. పొలుపు కచటతాదియుగం
బుల శషస లెనయ విసర్గ పొందు నన వా
శ్ఛలనము ఛందష్టీకలు
లలితయశస్థితి ఋధశ్ఛలంబు లనంగన్. 70

క. అలరు నికారాదిపిస
ర్గలపై వర్గాపరాక్షరద్వయగణముల్
యలహావలు గదియ రేఫల్
గలియు హావిర్భుజఘనుర్బలంబు లనంగన్. 71

క. మొదలివిసర్గలమీఁదఁ
బొదలినశషస లవి యూఁదు భూరియశస్సం
పద యనఁ గాసుమనష్ష
ట్పదము లనఁగ నధిక మగు తపశ్శక్తి యనన్. 72

గీ. అవ్యయాంతవిసర్గవర్గాక్షరముల
రెంట ణనమయులనహాల రేఫ రేఫ
గాక పెఱవర్ణములఁ గారకంబువట్లఁ
గదియు స్వర్గజం బనఁగ స్వఃకాంత యనఁగ. 73

క. ప్రకటవిసర్గాదిస్వర
మకారమునఁ గలసి యోత్వ మగు సంధిఁ దపోఁ
ధికుఁ డన విసర్గ చెడి వా
కృ౯కార మాప్రభృతిఁ గదిసి రజఱ ప్తి యగున్. 74

క. కలితేకారాదివిస
ర్గలు స్వరముఁమీఁదఁ గదియఁగా రేఫలు సం
ధిలు నర్చిరగ్ర మనఁగా
నలవడు నుఱి చక్షురింద్రియం బనఁగ మహిన్. 75

గీ. వర్గములఁ దృతీయచతుర్థవర్గములును
ఙనములును యరలహావలు నొనరఁ గూయ
వామపదవిసర్గాంతవర్ణ మోత్వ
మగు రజోగుణమన మనోహర మనంగ. 76

క. వెలయు నివర్ణాదివిస
ర్గంమీఁదను రేఫ గదియఁగా దీర్ఘము వ
ట్రిలు నర్చరాజి యనఁగ
నలిఁ జక్షూరాగ మనఁ దనర్చును సంధిన్. 77

క. ధర నవ్యయపువిసర్గకుఁ
బరమున నచ్చున్నఁ గుఱుచపై రేఫ యగున్.
పరరేఫ గదియ దీర్ఘ
స్వర మగు స్వరధీశుఁ డనఁగ స్వారాజ్య మనన్. 78

గీ. ప్రథమ శబ్దాంతదీర్ఘవర్ణములమీఁద
జతనమైనరేఫాంతివిసర్గ యుండి

రేఫయగుఁ దుది నచ్చున్న రేఫయున్నఁ
గ్రాఁగు వారాకరంబు వారాశి యనఁగ. 79

క. అత్వాంతవిసర్గ యుడుగు
నిత్యాదుల రత్వమెుందు నుత్వము తుదరా
నత్వము తపబుద్ధి యనఁగ
సత్వయుతా నిబుతియనఁ బ్రశస్తం బగుటన్. 80

క. తల మఁగు రేఫాంతవిస
ర్గలమీఁద నువర్ణ మొనరఁగా సంధి విస
ర్గ లుడిగి రేఫయు నుత్వము
గలియుఁ బునర్భుతు నమేత కమలాక్షి యనన్. 81

గీ. స్వాదిసంధిలోపలివిసర్గాంతవర్ణ
సంధు లెన్ని యన్నియును విసర్గసంధి
యందె కలిసివచ్చుటఁ జేసి స్వాదిసంధి
వేఱ యొనరింపఁబడదు వివేకరూఢ. 82

వ. మఱియు నొక్కవిశేషసంధి. 83

క. ఉపరిని హల్సంయుతమై
నవు డూఁదును స్వరసమన్వితాక్షర మగునే
నవు డూఁద దాదివర్ణము
ప్రపాద్యయమ్ము పరిష్కృతంబు పరిక్షిప్తి యనన్. 84

మఱి సమాసంబులు:—

క. లలితచ్ఛందద్వబహువ్రీ
హులు తత్పురుషము నలుకుక్క నుద్యద్ద్విగువుల్

నలిఁ గర్మధారయము ని
ర్మలావ్యయీభావమును సమాసము లరయన్. 85

వ. అందుఁ బూర్వపదార్థప్రధానం బవ్యయీభావంబు నుత్తర
పదార్థప్రధానంబు తత్పురుషంబు నుభయపదార్థప్రధానంబు
ద్వంద్వంబు నన్యపదార్థప్రధానంబు బహువ్రీహియు నగు
నందుఁ ద్వంద్వంబు. 86

క. పెక్కైనను రెండైనను
జొక్కపుశబ్దములు గదియుచో ద్వంద్వ మగున్
మ్రొక్కెద బలకృష్ణుల కన
నక్కటికమతాదు లుర్వి కాధార మనన్. 87

గీ. వ్యస్తపద మయ్యెనేని సమస్తమైన
ద్వంద్వమున కంత్య పదము ఛందము విభక్తి
అంబువులు గోవు ద్విజుఁడు శుద్ధాత్ము లనఁగ
నంబుగోద్విజుల్ శుద్ధాత్ము లనఁగ నిట్లు. 88

గీ. సేయవలయు మాతాపితృసేవ యనఁగ
మహితరుచులు సూర్యాచంద్రమసు లనంగ
నాదిమునులు మిత్రావరుణాఖ్యు లనఁగ
ద్వంద్వమున సందిదీర్ఘము ల్వచ్చు నిట్లు. 89

క. అల సంస్కృతమునఁ బోలెన్
వల దల్పాచ్చునకు నిచట ద్వంద్వపునియతుల్
తెలుఁగు లనుగ్రహనిగ్రహ
ములు నాఁగను బుణ్యపాపములు నాఁ జనుటన్ 90

బహువ్రీహి.—

క. ఏవస్తు వెవ్వనికిఁ గల
దావస్తువుకలిమి యతని కలవడఁ బలుకం
గావలయు బహువ్రీహి శ్రీ
రోవిలసద్బర్హిబర్హ గూఢవివేకా! 91

తత్పురుషము:—

గీ. ప్రథమపదమున కెద్ది విభక్తి దాని
చే విశేషింపఁబడినది యావిభక్తి
సంజ్ఞఁ బరఁగును దత్పురుషంబు కృతుల
నదియు నఙ్పూర్వసహిత మెన్మిదివిధములు. 92

క. తగఁ బ్రథమాతత్పురుషం
బగుఁగాయముయొక్కపూర్వమపరము దెల్లం
బుగఁ బూర్వకాయ మనఁగా
నగణితముగ నపరకాయ మనఁగా వరుసన్. 93

క. కమలాశ్రితుండు ధనకృ
త్యాఢ్యు కుండలకాంచనంబు ధామాగతుఁ డ
ర్థ్యమనుతుఁ డుపరిస్థించి
త్రి మన ద్వితీయాదు లాఱు తత్పురుషంబుల్ 94

క. క్షితి నఙ్ తత్పురుషం బగుఁ
బ్రతిషేధనకారమునకుఁ బ్రతియై మొదలన్
వితతాకారము చొప్పడి
యతఁ డబ్రాహ్మణుఁ డనంగ నవృషలి యనఁగన్. 95

క. ద్విగు వగు సంఖ్యాపూర్వక
మగుచు సమానాధికరణ మగుచుఁ బ్రసిద్ధం
బుగఁ గర్మధారయాహ్వయ
మగుఁ దత్పురుషంబ యాక్రియన్ భిన్నగతిన్. 96

క. ఏయది సంఖ్యాపూర్వక
మై యలవడఁ బలుక ద్విగుసమాసం బది దా
నీయనుపత్తిఁ ద్రిం దెలు
పాయెఁ ద్రిలోకి యన నీసమాహారోక్తిన్. 97

కర్మధారయము.—

క. ఏమిటి కేయ్యది గుణమై
తామెఱయుచు నుండు నది మొదల నిడి పలుకన్
భూమి నది కర్మధారయ
మౌ మధురోదకము మేచకాభ్రం బనఁగన్. 98

క. అందముగఁ గర్మధారయ
మందు మహాత్మునకు నగురు నభియోగము గో
విందుఁడు మహాత్ముఁ డనఁ జే
యందు ఫలితకల్పలత మహాలక్ష్మి యనన్. 99

అలుక్సమాసము.—

క. ఏక్రియ యెవ్వనికిం దగు
నాక్రియఁ దేరఁ బదమధ్యమందు విభక్తి
ప్రక్రియఁ గూర్ప నలుక్కగు
నీక్రియ ఖేచరవనాచరేశ్వరు లనఁగన్. 100

అవ్యయీభావసమాసము.—

క. ఎక్కడ నెయ్యది లే దది
యక్కడ లే దనిన నవ్యయీభావము దా
నక్కొను నిర్మక్షిక మని
యక్కజ మగుఁ దీర్థ మహిమ నభినుతి సేయన్. 101

వ. మఱియు నుత్తరపదోపమానసమాసం బెట్టి దనిన.

క. ఓలిఁబురుషసింహో యని యుగ్గడించు
చోటఁ దా సింహాఇవపురుషో యనంగఁ
దనరు విగ్రహ మగుట నుత్తరపదోప
మానసమాస మం డ్రిది శాస్త్రమహిమవిదులు. 102

మఱియుఁ గారకశబ్దంబులు.—

గీ. సంస్కృతము తెనుఁగైనఁ దత్సమపదంబు
దానం బుట్టి తెనుంగైనఁ దద్భవంబు
దేశితెనుఁగు దేశజ మచ్చతెనఁగు తెనుఁగు
నిర్మలుఁడు సిరి యొడయఁడు నిక్క మనఁగ. 103

గీ. సర్వనామముల్ యుష్మదస్మత్పదంబు
లావిభక్తులక్రియ లవ్యయములు మాను
తెలుఁగు లగుచోటఁ గారకాదిని వసించి
సర్వనామాశ్రియంబులు జరఁగుఁ గొన్ని. 104

సీ. ఏనన్న నీవన్న నితఁడన్నఁ బ్రథమాఖ్య
నను నిన్ను నాతని నన ద్వితీయ
నతనిచే నతనితో ననఁగఁ దృతీయ యీ
తనికొఱ కతనికై యన చతుర్థి

పంచమి యగు దీనబట్టుండి యందుండి
వానికంటెను వానివలన ననఁగఁ
వానియొక్క కులంబు వానికిఁ బ్రియ మది
జనులతో నితఁడు మేలనఁగ షష్ఠి

గీ. జలధియందు లక్ష్మి గలుగుచుండఁగ దన్ని
మిత్త్ర మన గ సప్తమీవిభక్తి
జలజనాభ యనఁగ సంబుద్ధి యిల్లు వి
భక్తు లలరు గారకోక్తి గతిని. 105

క. స్త్రీపుంనపుంసకము లన
నేపగు లింగములమీఁద నెసఁగు విభక్తుల్
దీపించు నవియు వచన
వ్యాపారనిరూఢి నక్షరాంతరములతోన్ 106

క. తనరఁగ అఆఇఈ
లనఁగా ఉఊలు నాఁగ నంబుజదళలో
చన ఋౠ లన ఓఔ
లనఁగ నజంతాహ్వయంబు లగు నీపదియున్. 107

క. చజలు తవర్గము పబమలు
స్వజనప్రియ రవలు శషలు సహాలు పదార్థుఁ
నిజమగుహలంతములు హరి
యజంతములు గూడ నిరువదా అంతంబుల్. 108

క. అంతము తెలుఁగగు నెడ నే
యంతముతలసూప దైన నచట నమాసా

ధ్యంతరములందు సంధ్యాచి
తాంతము లగుఁ గాన ధీవియద్విష్ణులనన్. 109

క. య త్తత్ప్రభృతు లోకటితోఁ
జో త్తెంచును శుద్ధగుణంబు చూచి మహాత్ముల్
మెత్తురు తత్పురుషుఁడు లో
కోత్తరుఁ డన నీదృశ ప్రయోగబలమునన్ 110

మఱి క్రియాపదంబులు.—

క. పరుఁ బలుకు ప్రథమపురుష మెం
దిరి మధ్యమపురుషపలుకు ధృతి దనుఁ బలుకున్
ధర నుత్తమపురుష క్రియ
వరుస నలింగకము లైనవచనము లెసఁగున్.

క. కారకపదములు తెనుఁగై
నారి నరుఁడు రత్న మనఁ దనర్చుగతి క్రియా
కారవిశేషము లలరవు
వారలు వచ్చెదరు దండు వచ్చెద రనుచోన్. 112

క. ద్వివచనము లేదు తెలుఁగున
ప్రవిమలగతి నేకవచనబహువచనము లౌఁ
దివిచెద ననఁ దివిచెద మనఁ
గవి యనఁ గవు లనఁగ క్రియలు కారకఫణితిన్. 113

మఱి అవ్యయశబ్దంబులు.—

క. ఇలఁ గారకమట్టుల ను
జ్జ్వలరూపము లయ్యు లింగవచనములు విభ

క్తులు లేకవ్యయశబ్దం
బులు సకలము నముచితార్థములు విలసిల్లున్. 114

క. నెఱియ నవ్యయపదములన్నియు సమాస
రూపమున నాంధ్రకవికిని రుచి యొనర్చు
నర్వధూమణి యన వృథాశంక యనఁ బు
నః ప్రణతి నాఁగ నుచ్చైర్నినాద యనఁగ. 115

గీ. వృథ యను నవ్యయ మొక్కఁడు
పృథితంబై చెల్లు గృతులఁ బ్రత్యేకము తా
వృథ సేయక యెపుడు మనో
రథములు మాకిచ్చు నీ మురద్విషుఁ డనఁగన్. 116

క. తారకజనితక్రియలును
నారఁగ ల్యప్త్వప్రత్యయాంతు లవ్యయము లగుఁ
దూరంజిలఁ బూజించి వి
చారించి యుదాహరించి సంధించి యనన్ 117

మఱి విశేష్యవిశేషణంబులు.—

క. హరి కరుణాకరుఁ డనఁగా
హరి యనుశబ్దము విశేష్య మగు మఱి కరుణా
కరుఁ డనుట విశేషణ మి
ట్లురుతరగతిఁ గారకప్రయోగము లమరున్. 118

మఱి క్రియావిశేషణంబులు.—

క. పగతునితమ్ముని శాశ్వత
ముగ నిల్పెను దశరథేంద్రపుత్త్రుండనుచో

శగమునఁ గ్రియావిశేషణ
మగు నీయెడ శాశ్వతముగ నని పల్కుట దాన్. 119

గీ. శబ్దసిద్ధికొఱకు సంధిసమాసరూ
పంబు లిట్లు కొంతపలుకఁబడియె
మఱియు నుచితరీతి నెఱుఁగంగవలయు ర
హస్యలక్షణంబు లాంధ్రకవులు. 120

మఱియుం బంచాశద్వర్ణంబులు.—

క. భూమిఁ బదాఱచ్చులు నాఁ
గా మెఱసి అకారమాదిగా స్వరము లగుఁ
కా మొదలు క్షకారముతుద
యై ముప్పదినాల్గుహల్లు లగువ్యంజనముల్. 121

క. తగు హ్రస్వంబులు దీర్ఘము
లగు అఇఉఋఌలును వెండి హ్రస్వాభావం
బగు ఏఐఓఔలు నె
సఁగు అం అః యనఁగ షోడశస్వరము లగుఁ. 122

క. కచటతపవర్గవర్ణము
లెచటఁ స్పర్శ లగు నిరువదే నై మఱి యుం
దుచితగతిఁ జఞఙణనమ
ప్రచయం బనునాసికాఖ్యఁ బ్రస్తుతినొందున్. 123

క. యరలవ లంతస్థలు నాఁ
బరఁగును శషసహలు తేటపడు నూష్మ లనఁ

సొరిది ఱకారముఁ గూడఁగ
సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. 124

క. కలలకు భేదము లే దను
పలుకున ళాఁ దొలఁగి యైదుపదులగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి
తెలుఁగున ఱళ లనఁగ రెం డధిక మంద్రు హరీ! 125

గీ. రాఁదొలంగి సమస్తాక్షరముల మీఁదఁ
గార మగుఁ గకారంబు ఱకార మనఁగ
నట రవర్ణంబుపై నిఫ యనఁగఁ బరఁగుఁ
గాన నిది రేఫ యని పలుకంగవలయు. 126

క. వర్ణం బన నక్షర మన
వర్ణం బన మాతృక యన నక్కర మనఁగా
నిర్ణీతసమాహ్వయములు
వర్ణితములు కృతులయందు వ్రాలకునెల్లన్. 127

క. ఆదులు వర్గత్రయమును
భూదేవతలు తపవర్గములు రవలును ధా
త్రీదయితులు యలశషసహ
లాదటనూరుజులు శక్షరాఖ్యలు శూద్రుల్. 128

ఇతి షడ్వర్గంబులు.—

క. ఏకాదిషడంతముగఁ
బ్రాకటపాదములు గలుగు మంజరి మొద లా

లోకితమద్వర్గంబులు
శ్రీకలితచ్ఛంద మవధరింపుము కృష్ణా ! 129

ఉ. శ్రీనిధి చక్రవర్తిగురుశేఖరపుణ్యకటాక్షలబ్ధసు
జ్ఞానుఁ డనంతధీమణిలసన్మణి భోజచరిత్ర చెప్పి ల
క్ష్మీనరసింహుఁ గూర్చిన ప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛం
దోనుతి యోగిహృద్విమలతోయజవర్తి కనంతమూర్తికిన్.

ఉ. రాజులు పాడిఁ దప్పక ధరావలయం బఖిలంబు నేలెడిన్
భూజనరాజి సంపదలఁ బొంపిరివోనిసుఖానుభూతిచే
నోజఁ జరింపుచుండెడిఁ బయోజసముద్భవకల్పశాశ్వతం
బై జలజోదరాంకితమహాకృతి సన్నుతి నొందుచుండెడిన్. 131

గద్యము. ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్య తనూభవ సుకవిజనవిధేయ యనంతయనామధేయప్రణీతం బైనఛందోదర్పణంబునందు వర్జనీయంబు లగుదశదోషంబుల నేర్పఱచుటయు, నందు దోషరహితంబులై యాదరణీయంబు లగుపట్లు దేర్చుటయు సంధి సమాసంబులు పంచాశద్వర్ణంబు లేర్పఱచుటయు నన్నది చతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# ఛందోదర్పణము.

## అనుక్రమణిక.

---


| | పుట. |
|---|---|
| **అ.** | |
| అంగజాస్త్రమనువృత్తము | 59 |
| అంతరాక్షరము | 77 |
| అంత్యప్రాసము | 16 |
| అంబురుహాంబనువృత్తము | 50 |
| అక్షరలయతినిర్ణయము | 78 |
| అక్కలిప్రాసనీసము | 73 |
| అక్కలిపడిసీసము | 74 |
| అజ్ఝ్రియోగచతుష్టయము | 99 |
| అనుప్రాసము | 17 |
| అనుస్వారయతి | 25 |
| అపక్రమము | 92 |
| అపరాజితమనువృత్తము | 43 |
| అపశబ్దము | 98 |
| అపార్థము | 92 |
| అర్థసమవృత్తవిషమవృత్తంబులు | 58 |
| అర్ధబిందుప్రాసము | 12 |
| అలుక్సమాసము | 108 |
| అల్పాక్షర | 78 |
| అవ్వలిప్రాసనీసము | 74 |
| అవ్యయశబ్దంబులు | 111 |
| అవ్యయీభావసమాసము | 109 |
| అశ్వలలితమనువృత్తము | 54 |
| అష్టమూర్తియనువృత్తము | 55 |
| అసంబాధయనువృత్తము | 43 |
| **ఆ.** | |
| ఆగమవిరోధము | 95 |
| ఆటవెలది | 69 |
| ఆర్యాగీతి | 68 |
| **ఇ.** | |
| ఇంద్రచంద్రాదిగణభేదములు | 5 |
| ఇంద్రవంశమనువృత్తము | 39 |
| ఇంద్రవజ్రమనువృత్తము | 35 |
| **ఉ.** | |
| ఉత్పలమాలయనువృత్తము | 51 |
| ఉత్సాహము | 75 |
| ఉదాహరణలక్షణము | 83 |
| ఉద్దిష్టము | 85 |

| | పుట. |
|---|---|
| ఉద్గీతి | 67 |
| ఉపగీతి | 67 |
| ఉపజాతియనువృత్తము | 35 |
| ఉపసర్గలు | 20 |
| ఉపేంద్రవజ్రమనువృత్తము | 35 |
| ఉభయప్రాసము | 12 |
| ఋ. | |
| ఋకారస్వరూపయతి | 19 |
| ఋప్రాసము | 10 |
| ఎ. | |
| ఎక్కటియతి | 25 |
| ఎత్తుగీతి | 68 |
| క. | |
| కందములు | 65 |
| కమలవిలసితమనువృత్తము | 44 |
| కర్మధారయము | 108 |
| కవిరాజవిరాజితమనువృత్తము | 54 |
| కాలవిరోధము | 96 |
| కాకుశ్లేషము | 94 |
| కాకుస్వరయతి | 21 |
| కారకశబ్దంబులు | 109 |
| కుంచకాకు | 94 |
| కుసంధి | 98 |
| కుసుమితలతావేల్లితమనువృత్తము | 49 |
| కృత్యాదివర్జనీయగణములు నక్షత్రములును | 6 |
| క్రియాపదంబులు | 111 |
| క్రియావిశేషణంబులు | 112 |
| క్రౌంచపదమనువృత్తము | 56 |
| ఖ. | |
| ఖచరప్లుతమనువృత్తము | 51 |
| గ. | |
| గణఫలములు | 6 |
| గణాగణక్రియాంకమనుచక్రము | 86 |
| గణాధిదైవతంబులు | 6 |
| గణాష్టకలక్షణము | 3 |
| గద్యపద్యలక్షణము | 2 |
| గద్యలక్షణము | 28 |
| గౌరీలంబనమనువృత్తము | 36 |
| గీతి | 67 |
| గురులఘునిర్ణయము | 3 |
| గూఢస్వరయతి | 19 |
| చ. | |
| చంద్రకళయనువృత్తము | 50 |
| చంద్రశ్రీయనువృత్తము | 46 |
| చంపకమనువృత్తము | 51 |
| చతుష్ప్రాసము | 16 |
| చపలార్య | 66 |
| చాటుచిత్రబంధలక్షణము | 83 |
| చిత్రపదమనువృత్తము | 32 |
| చుట్టుబ్రావ | 94 |

| | పుట. |
|---|---|
| చౌపదము | 79 |
| **ఛ.** | |
| ఛందములు | 29 |
| ఛందఃప్రాశస్త్యము | 2 |
| ఛందోభంగము | 90 |
| ఛందోవృత్తంబులభేదము | 87 |
| ఛందోవృత్తసంఖ్య | 80 |
| **జ.** | |
| జఘనచపలార్య | 67 |
| జయభద్రరగడ | 81 |
| జలదమనువృత్తము | 41 |
| జలధరమాలయనువృత్తము | 39 |
| జలోద్ధతగతియనువృత్తము | 40 |
| **త.** | |
| తత్పురుషము | 107 |
| తనుమధ్యయనువృత్తము | 32 |
| తరళమనువృత్తము | 49 |
| తరువోజ | 76 |
| తుక్సంధి | 97 |
| తురగవల్గనమనురగడ | 80 |
| తేటగీతి | 69 |
| తోటకమనువృత్తము | 38 |
| తోదకమనువృత్తము | 35 |
| తోవకమనువృత్తము | 38 |
| త్రిపద | 78 |
| త్రిప్రాసము | 11 |
| త్రిప్రాసము | 16 |
| త్రిభంగియనువృత్తము | 63 |
| **ద.** | |
| దండకము | 63 |
| దశదోషములు | 89 |
| దుష్కరప్రాసము | 15 |
| దుష్ప్రయోగము | 94 |
| దుస్సంధి | 93 |
| దేశవిరోధము | 96 |
| ద్రుతవిలంబితమనువృత్తము | 39 |
| ద్వంద్వప్రాసము | 16 |
| ద్విపద | 79 |
| ద్విరదగతియనురగడ | 81 |
| **న.** | |
| నదీప్రఘోషయనువృత్తము | 60 |
| నర్కుటమనువృత్తము | 47 |
| నష్టలబ్ధి | 85 |
| నారీప్లుతమనువృత్తము | 59 |
| నిత్యసమాసయతి | 21 |
| **ప.** | |
| పంక్తియనువృత్తము | 32 |
| పంచచామరము | 46 |
| పంచపాదియనువృత్తము | 61 |
| పంచాశద్వర్ణంబులు | 113 |
| పథ్యార్య | 66 |
| పద్మకమనువృత్తము | 46 |

| | పుట. |
|---|---|
| పద్మనాభమనువృత్తము | 54 |
| పవడగీతి | 68 |
| పాలాశదళమనువృత్తము | 48 |
| పునరుక్తికము | 90 |
| పృథ్వీయమనువృత్తము | 48 |
| పోలికవడి | 23 |
| ప్రణవమనువృత్తము | 34 |
| ప్రభాతమనువృత్తము | 42 |
| ప్రమాణీయనువృత్తము | 38 |
| ప్రమితాక్షరమనువృత్తము | 40 |
| ప్రహరణకలితమనువృత్తము | 48 |
| ప్రహర్షిణీయనువృత్తము | 41 |
| ప్రాదిప్రాసము | 11 |
| ప్రాసప్రకరణము | 7 |
| ప్రాసమైత్రి | 10 |
| ప్రాససీసము | 71 |
| ప్రియంవదంబనువృత్తము | 40 |
| ప్రియకాంతాయనువృత్తము | 45 |
| **ఫ.** | |
| ఫలసదనమనువృత్తము | 46 |
| **బ.** | |
| బంధురమనువృత్తము | 56 |
| బహువ్రీహి | 107 |
| బిందుప్రాసము | 12 |
| బింబమనువృత్తము | 31 |
| **భ.** | |
| భద్రకమనువృత్తము | 53 |
| భద్రికయనువృత్తము | 37 |
| భాస్కరవిలసితమనువృత్తము | 57 |
| భుజంగప్రయాతమనువృత్తము | 38 |
| భుజంగవిజృంభితమనువృత్తము | 57 |
| భూతిలకమనువృత్తము | 50 |
| భూనుతమనువృత్తము | 44 |
| **మ.** | |
| మంగళమహాశ్రీయనువృత్తము | 57 |
| మంజరీద్విపద | 79 |
| మంజుభాషిణీయనువృత్తము | 41 |
| మందాక్రాంతమనువృత్తము | 47 |
| మకారయతి | 25 |
| మణిగణనికరమనువృత్తము | 44 |
| మణిభూషణమనువృత్తము | 45 |
| మణిమాలయనువృత్తము | 52 |
| మణిరంగమనువృత్తము | 34 |
| మత్తకోకిలయనువృత్తము | 48 |
| మత్తమయూరమనువృత్తము | 41 |
| మత్తయనువృత్తము | 33 |
| మత్తేభవిక్రీడితమనువృత్తము | 50 |
| మదరేఖయనువృత్తము | 32 |
| మధుమతియనువృత్తము | 33 |
| మధురగతియమరగడ | 81 |
| మధురాక్కర | 77 |
| మధ్యాక్కరము | 77 |
| మనోజ్ఞయనువృత్తము | 95 |

| | పుట. |
|---|---|
| మనోహారమనువృత్తము | 59 |
| మయూరసారియనువృత్తము | 34 |
| మహాక్కర | 77 |
| మహాస్రగ్ధరయనువృత్తము | 53 |
| మానినియనువృత్తము | 53 |
| మాలినియనువృత్తము | 44 |
| ముఖచపలార్య | 66 |
| మేఘవిస్ఫూర్జితమనువృత్తము | 49 |
| మేదినియనువృత్తము | 47 |
| మేళనగీతి | 68 |
| **య.** | |
| యతిపంచకభేదములు | 17 |
| యతిపంచకము | ,, |
| యతిభంగము | 90 |
| యతిసంజ్ఞలు | 17 |
| యుక్తవికల్పయతి | 26 |
| **ర.** | |
| రగడలు | 80 |
| రథగమనమనోహారమనువృత్తము | 60 |
| రథోద్ధతమనువృత్తము | 86 |
| రుక్మవతియనువృత్తము | 38 |
| రుచిరమనువృత్తము | 42 |
| రేఫయుతయతి | 24 |
| **ల.** | |
| లగక్రియ | 86 |
| లగక్రియాచక్రము అధ్యపక్రియ | 87 |
| లయగ్రాహి | 61 |
| లయవిభాతి | 62 |
| లయహారియనువృత్తము | ,, |
| లాటీవిటమనువృత్తము | 52 |
| **వ.** | |
| వంశస్థమనువృత్తము | 39 |
| వడిసీసము | 73 |
| వనమంజరియనువృత్తము | 52 |
| వనమయూరమనువృత్తము | 43 |
| వరాంగియనువృత్తము | 60 |
| వర్గయతి | 22 |
| వసంతతిలకమనువృత్తము | 42 |
| వాతోర్మియనువృత్తము | 37 |
| వికల్పప్రాసము | 13 |
| వికల్పయతి | 26 |
| విజయమంగళమనురగడ | 80 |
| వితాళమనుజాపదము | 79 |
| విద్యున్మాలయనువృత్తము | 32 |
| విపులార్య | 66 |
| విశేషసంధి | 105 |
| విశేష్యవిశేషణంబులు | 112 |
| విశ్వదేవియనువృత్తము | 40 |
| విసంధికము | 90 |
| విసర్గసంధి | 102 |
| వీణారచనమనువృత్తము | 60 |
| వృత్తప్రాససీసము | 71 |

| | పుట. |
|---|---|
| వృత్తసంఖ్య | 15 |
| వృషభగమనమనురగడ | 82 |
| వైరివర్గము | 94 |
| వ్యంజనసంధి | 100 |
| వ్యర్థము | 92 |
| **శ.** | |
| శార్దూలవిక్రీడితమనువృత్తము | 49 |
| శాలినియనువృత్తము | 37 |
| శిఖరిణియనువృత్తము | 47 |
| శుద్ధవిరాటనువృత్తము | 34 |
| శ్యేనియనువృత్తము | 37 |
| శ్రీరమణమనువృత్తము | 60 |
| **ష.** | |
| షట్పద | 78 |
| షట్ప్రత్యయంబులు | 85 |
| షడ్వర్గంబులు | 114 |
| **స.** | |
| సంధిగతప్రాసము | 13 |
| సంయుక్తయతి | 28 |
| సంయుక్తవర్ణగణంబులు | 6 |
| సంయుతప్రాసము | 18 |
| సంశయము | 91 |
| సగణాలగక్రియాంకముగుచక్రము | 86 |
| సమప్రాసము | 9 |
| సమయవిరోధము | 95 |
| సమలఘుప్రాసము | 11 |
| సమవృత్తంబులకాలము | 87 |
| సమవృత్తలక్షణము | 31 |
| సమసీసము | 70 |
| సరసయతి | 23 |
| సరసిజమనువృత్తము | 55 |
| సర్వతఃప్రాససీసము | 72 |
| సర్వలఘుసీసము | 76 |
| సర్వసమవృత్తభేదసంఖ్య | 31 |
| సీసము | 69 |
| సుందరవృత్తము | 48 |
| సుకాంతియనువృత్తము | 31 |
| సుకేసరమనువృత్తము | 45 |
| స్రగ్ధరయనువృత్తము | 51 |
| స్రగ్విణీవృత్తము | 88 |
| స్వరయతులు | 18 |
| స్వరసంధి | 97 |
| స్వాగతమనువృత్తము | 86 |
| **హ.** | |
| హయప్రచారరగడ | 80 |
| హరిగతియనురగడ | 82 |
| హరిణగతియనురగడ | 82 |
| హరిణియనువృత్తము | 48 |
| హలముఖియనువృత్తము | 33 |

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 21 | నగఁగంబు | నగగంబు |
| 5 | 6 | -మహేశయన | -మహీశయన |
| 8 | 16 | డేటి | డేఁటి |
| 11 | 12 | ఇటుబు | ఇడుబు |
| 12 | 15 | లేటికి.... తాఁబేటి | లేఁటికి...తాఁబేఁటి |
| 13 | 2 | కృష్ణుండు | కృష్ణుండ |
| ,, | 13 | బలసిప్రోల్లు | బలసెఁబ్రోళ్లు |
| 15 | 19 | కీలిత...రంజిత | కలిత...రంజిత |
| 17 | 3 | విప్రద | తిప్రద |
| 19 | 4 | నెపలనఁగ | నెపలనంగ |
| ,, | 8 | నావనుచోన్ | నానసుచోన్ |
| 20 | 8 | క్లప్తి....ననఁగ | క్ళప్తి....ననంగ |
| ,, | 22 | దురీ | దుర్ |
| ,, | 23 | సమీ | సమ్ |
| 22 | 101వ | పద్యము సరిగాలేదు | (చూ. టిప్పణి) |
| 24 | 19 | సంజ | సంజ్ఞ |
| 28 | 11 | సురుచిర | సురుచిర |
| ,, | 12 | నినదానుకార | నినదానుకారి |
| 29 | 20 | సత్యప్తియు | యత్యప్తియు |
| ,, | 23 | యును గర్త్య | యనఁ గీర్త్య |
| 30 | 4 | రాఁగ | రాగ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 32 | 2 | అగునీ | అగున్ |
| ,, | 8 | తనుమధ్య | తనుమధ్య |
| 34 | 14 | చెన్న | చిన్న |
| 35 | | "పదునొకండవ త్రిష్టుప్ఛందంబు" అనునది తోదకమునకు ముందుండవలెను. | |
| 35 | 8 | భూమిత్ర | భూమిధ్ర |
| 37 | 18 | పరస | రస |
| 38 | 4 | ప్రయాతా | ప్రభాతా |
| 39 | 4 | నింపార | ఇంపార |
| 40 | 23 | సానల్ | సోనల్ |
| 43 | 23 | నసంబాధల్ | నసంబాధఁ |
| 44 | 2 | పురుషోత్తను | పురుషోత్తము |
| ,, | 15 | ననుపగు | నునుపగు |
| 45 | 17 | ఋుష్వను | ఋుష్యను |
| ,, | 24 | యు,న,గ | యు,స,గ |
| 47 | 14 | గజేంద్రావధ్వంసిఁ | గజేంద్రావద్ధ్వంసిఁ |
| 49 | 8 | తాగంబులుఁ | తాగంబులఁ |
| ,, | 20 | రమానాన్థు | రమానాథు |
| 51 | 14 | రుత్ | రుక్ |
| ,, | 16 | సముజ్గ్వల | సముజ్జ్వల |
| 54 | 18 | ధనుష్వేఁడు | ధనుష్వేఁదు |
| 56 | 9 | ధ్యాంత | ధ్వాంత |
| 58 | 2 | నననసలుఁ | నననసలుఁ |
| ,, | 11 | క్రౌచ | క్రౌంచ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 56 | 12 | నయమొందుఁ | నయలొందుఁ |
| ,, | 18 | గ్రవ్వఁపు | ఁగవ్వపుఁ |
| ,, | 20 | పంచ | బంచ |
| 58 | 9,13,14,16, | ర్థ. | ర్ధ |
| ,, | 18 | వృత్తంబుల.... పాదంబుల | వృత్తంబులు... ఁబాదంబుల |
| ,, | 20 | నవియ | నవియు |
| 59 | 1 | చందంబున | ఛందంబున |
| ,, | 8 | నన్నిటను | నన్నియును |
| 59 | 9,14 | నార్థ | నార్ధ |
| ,, | 21 | నర్తంబై | నర్థంబై |
| 60 | 6 | నదీ | నదీ |
| 61 | 10 | లాన | లాస |
| 62 | 11 | బుడమిఁగల | బుడమినల |
| ,, | 12 | జగత్రయ....పుత్రు | జగత్త్రయ ... పుత్త్రు |
| ,, | 21 | సదమలన | సదమలిన ("సదయఘన" పాఠాంతరము) |
| 63 | (134-వ పద్యము త్రిభంగి సరిగాలేదు. చూ. పీఠిక) | | |
| 64 | 6 | నర్థ | నర్ధ |
| 65 | 9 | యర్థముల | యర్ధముల |
| 66,67 | (ఈపుటలలోని పద్యములు సరిగాలేవు. చూ. పీఠిక) | | |
| 68 | 14 | నిడెనము | నీడెన |
| | 15 | గదియ | గీదియ |
| | 19 | ముప్పురులు | ముప్పురును |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 69 | 2 | నేయు | నెరయు |
| 70 | 6 | భాసిల్లు | భాసిల్ల |
| ,, | 11 | నవకవికి | నవకలికి |
| ,, | 13 | నది యనము | నదియు నము |
| ,, | 18 | చర్వితి | సర్వతః |
| 71 | 18 | ప్రేముడించి | ప్రేముడించు |
| 72 | 14 | రసజ్ఞాని | రసజ్ఞావి |
| 74 | 10 | పదంబునుఁ | పదంబునఁ |
| ,, | 22 | నీత్రుఁడు | నేత్రుఁడు |
| 75 | 18 | వదముగ | పదమగు |
| ,, | 19 | పాదముగ | పాదమగు |
| 76 | 1 | యార్యంచ | యార్వంచ |
| 77 | 1 | రో త్త | రొత్తు |
| 77 | 13 | ఆంద్రులు | ఆంధ్రులును |
| 78 | 22 | కార్యులుగలియ | కార్యులకవయు |
| ,, | 23 | జరగు నిప్పగిది | జరగ నిప్పగిది |
| 79 | 17 | హైన | హై |
| 80 | 4 | ప్రానం | ప్రాసం |
| ,, | 11 | జన | జను |
| 82 | 4 | కుంకుము | కుంకుమ |
| ,, | 14 | దలంచెద | దలంచెదఁ |
| ,, | 23 | బోరని | బోవని |
| 83 | 14 | నూటెనుబది | నూటెనిమిది |
| ,, | 16 | మన | మనఁగ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 83 | 19 | తార్ధ | తార్థ |
| 84 | 14 | ర్ధికి | ర్థికి |
| 87 | 9 | లథ్వ | లధ్వ |
| 90 | 15 | మద్రు | మంద్రు |
| | 22 | వ్రచింపమతికీర్తిచం దురుఁడనచుఁబలుక | వ్రచించిమతికాంతిచంద్రుఁ డటంచుఁ బలుక |
| 91 | 1 | గాంతినమృతకిరణుఁ | గీర్తినమృతకిరణుఁ |
| | 4 | నభిమతంబున | నభిమతంబుగ |
| | 15 | తాపను | తాపసు |
| 92 | 10 | చరితులు | చతురులు |
| | 12 | నగరు | నడుగు |
| | 13 | యింకగీతిభ్రాంతి | యింకఁగీర్తిభ్రాఁతి |
| 94 | 9 | జరగలోక | జరగులోక |
| | 23 | సత్వముసన్నృపస్య | సత్వమున నృపస్య (సత్వరము నృపస్య) |
| 95 | 16 | దతిచేసి | దరిచేసి |
| 97 | 12 | భకార | ఛకార |
| 98 | 4 | మృద్యన్న | మృద్వన్న |
| 99 | 6 | గ్లా | గ్లా |
| | 15 | మంత్వమున | మంత్యమున |
| | 23 | మాలిన | మావన |
| 100 | 12 | సంధులనెలమిఁ | సంధికలియమిఁ |
| | 21 | నత్సంధిఁ | నచ్ సంధిఁ |
| 101 | 3 | ఆజజ్ఞానమముల | ఆదిబిజ్ఞానమల |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 101 | 18 | నజ్ఝల్లు | నజ్ఝల్లు |
| 102 | 16 | యరలవత్పృతీ | యరలవఁదృతీ |
| | 21 | తడ్ఢక్క | తడ్ఢక్క |
| 103 | 7 | పొలువుకచట | పొలువుగఁజట |
| 104 | 9 | చతుర్థవర్గ | చతుర్థవర్ణ |
| | 15 | ట్రిలు నర్చరాజి | ట్రిలి యర్చిరాజి |
| 105 | 10 | నమేత | నమేత |
| 106 | 12 | ఛందము | చందము |
| | 15 | నేయ | చేయ |
| | 18 | సందీ | సంధి |
| 108 | 6 | యలవడఁ | యలవడుఁ |
| | 22 | నలుతుగు | నలుక్కగు |
| | 23 | వనా | వనే |
| 109 | 3 | యక్కడ | యిక్కడ |
| | 7 | క. | గీ. |
| | 13 | దానం | దానఁ |
| | 17,18 | మానుతెలుఁగు | మానుఁదెలుఁగు |
| 110 | 4 | షష్టి | షష్ఠి |
| 112 | 11 | తారక...రంజిల | కారక .... క్రియయ ... ...ల్యప్రత్యయ కావ్యయము దెనుం, రంజిలుఁ. |

---

చెన్నపురి : 'వావిళ్ళ' ప్రెస్సున ముద్రితము—1921